# నాగర సర్వస్వం




వెల: రూపాయిన్నర

## సచిత్ర కామశాస్త్రం

అభిసారిక ప్రచురణ



# ఈ గ్రంథంలో

విక్రమశకం వెయ్యి సంవత్సరాల కాలంలో, అనగా పదకొండవ శతాబ్దంలో పద్మశ్రీ అనే కవి ఈ నాగరసర్వస్వాన్ని సంస్కృతంలో వ్రాశాడు. ఈయన బౌద్ధమతస్థుడు. ఆర్యమంజుశ్రీ, తార ఈయనకు అధిదేవతలు! మొత్తం ముప్పయి ఎనిమిది అధ్యాయాల గ్రంథమిది; రత్నపరీక్ష ఎలా చేయాలో చెప్పడం ఇది ఇతర గ్రంథాలలో లేదు. భావ, అంగ, వక్త్ర, హస్తముద్రలగురించి కామ శాస్త్రంలో విపులంగా పేర్కొన్న మహామనీషి ఈయనే! చతుష్షష్టి కళలలో నాయకుడెంత సిద్ధుడైనా "సంకేత" పరిజ్ఞానం లేనివాడు నాయికచే తిరస్కరింపబడతాడని ఈయన వాదం. ఈ సంకేతపరిజ్ఞానం కామశాస్త్రానికే ఒక కొత్త చేర్పు; ఆ తర్వాత కామశాస్త్రగ్రంథాలన్నీ. పానకములను (మధువు) తయారుచేయ్యడం. అంగపరిమాణమును బట్టి పరిణాహ ఆరోహములను, వశ్యకములను, వశీకరణతంత్రములను, వయస్సును బట్టి స్త్రీ జనవర్గీకరణను. నాడిని రమించు పద్ధతులను, కామకేంద్రాలను, వివిధ నాడులను, చుంబన, ఆలింగన, మానసిక ప్రేరణాదులను, అష్టవిధాలుగా రతిముల అజ్ఞానపద్ధతులు, ఏడు పార్శ్వ రెండు ఆసనాలు, రెండు అధోముఖ, ఏడు ఉద్ధితకరణములు (రతిపద్ధతులు) తెలియజేశాడు. స్త్రీలు అనుసరించే 'కామచరితం' (చిత్రాలు) మనోదయ ప్రకరణాలను చేర్చాడు ఈయన చెప్పిన ప్రణయ ప్రక్రియలన పద్ధతులు ఎంతో ఆధునికమైనవిగా మనకు గోచరిస్తాయి. ప్రతిఒక్కరూ చదవండి.

ధర్మచక్ర ప్రెస్, సామర్లకోట.

# నాగరసర్వస్వం



రచయిత:
పద్మశ్రీ



సంపాదకులు:
రాంషా & శిరీష

# విషయసూచిక.

# నాగర సర్వస్వం

## పీఠిక.

నాగర సర్వస్వం అంటే యేమిటి? అన్న సందేహం ప్రతి పాఠకుని మనస్సులోను తొలుత ఉదయిస్తుంది. ఆ సందేహాన్ని నివారించి గ్రంథంలోని విషయాలను వివరించడం మంచిదికదా! ఆ సందేహ నివారణ కొఱకే యీ పీఠిక.



పూర్వ కాలంలో రిపుంజయుడనే మహారాజు మాహిష్మతీ నగరాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఆ రాజు పరమసుందరుడు ఆయన శౌర్యం సాటిలేనిది. ఆయన సంపదకు కుబేరుడు. బుద్ధికి బృహస్పతి అయి ప్రజారంజకంగా రాజ్యంచేస్తూ ఉండేవాడు.

రిపుంజయుని సౌందర్యంచూచి నలుగురు రాచకన్నియలాయనను వరించారు. వారు నలువురు సుందరాంగులే, ఉన్నత కుటుంబాలనుండి వచ్చినవారే, అందునలన రిపుంజయుడు వారితో కలిసి విహరిస్తూ భూమి మీదనే స్వర్గసౌఖ్యాలు అనుభవిస్తూ ఉండేవాడు. ఆయన తన భార్యలను నలుగురను సమానమైన ప్రేమతో ఆదరిస్తూ వారిలో వారికి మాత్సర్యం కలుగకుండచూస్తూ ఉండేవాడు. ఇలా ఆ రాజు ఎంతో నేర్పుతో వర్తిస్తూ ఉండడంవల్ల మనస్సులో ఏలాఉన్నా పైకిమాత్రం ఆనలువురు భార్యలు అక్కచెల్లెండ్రవలె కలిసిమెలసి ఉంటూండేవారు.

కొంతకాలానికి ఆ నలువురు భార్యలు గర్భవతులయ్యారు. నలుగురు భార్యలు ఒక్కసారి గర్భవతులు కావడంతో రాజుయొక్క ఆనందానికి అవధిలేకపోయింది. ఆయన పట్టరాని ఉత్సాహంతో ఎన్నో వినోదాలు, వేడుకలు ఏర్పాటు చేయించాడు. రాజకార్యాలన్నీ మంత్రులకు అప్పగించి తాను ఎల్లవేళలా అంతఃపురంలో భార్యల సన్నిధానంలో గడపసాగాడు.

తొమ్మిది నెలలు గడచాయి. ఒక మంచి ముహూర్తాన పెద్ద భార్య కళావతీదేవికి మగబిడ్డ జన్మించాడు. ఈ వార్త నగరంఅంతట పాకింది. అంతా ఉత్సాహంగా ఉన్నారు. అంతలో రెండవ భార్య ఇందుమతీదేవికికూడ మగబిడ్డ కలిగినాడన్నవార్త, దానికి వెంటనే మూడవభార్య రత్నావతీదేవికి, నాల్గవభార్య మాలాదేవికికూడ మగ బిడ్డలే జన్మించారన్న శుభవర్తమానం నగరంలో వ్యాపించింది. దానితో ఆ రాజుయొక్క రాజధాని నగరమంతా ఉత్సాహంతో నిండిపోయింది.

మహారాజు రిపుంజయుని హృదయం ఒక్కసారిగా జన్మించిన కుమారులను చూడడంతో పున్నమిచంద్రుని జూచిన సముద్రంలా పొంగింది. ఆయన యెన్నో వేడుకలు ఉత్సవాలు జరిపించాడు. దాన ధర్మాలు ఆచరించాడు.

ఆ రాజకుమారులు కూడ తల్లిదండ్రులవలెనే అందంగాఉన్నారు. వారి మొగములేకాదు. చేతులు, కన్నులు, పాదాలుకూడ అరవిడిచిన ఎఱ్ఱతామరవలె ఉన్నాయి.

రిపుంజయుడు వారికి జాతకర్మ చేయించి పెద్దవానికి అజయుడని రెండవవానికి విజయుడని మూడవవానికి సూర్యుడని నాల్గవవానికి చంద్రుడని పేరులు పెట్టాడు.

ఆ బాలకులు తల్లుల ఒడులలోనో, తండ్రి గుండెమీదనో ఉండే వారేకాని ఊయలలో ఉండడం అన్నదిలేదు. వారిని తల్లిదండ్రులు అంత ముద్దుగా చూస్తూ ఉండేవారు. క్రమంగా ఆ బాలురు పెరిగి అంతఃపురం అంతా ప్రాకడానికి ఆరంభించారు. వారు అంతఃపురం యొక్క నడవలో నాలుగువైపులకు ప్రాకివెళ్ళి వెనుదిరిగి చూచినపుడు ఒక్కసారిగా నాలుగుచంద్రబింబాలు ఎదురెదురుగాఉదయించినట్లుఉండేది

రిపుంజయుడు తనకుమారులకు ఐదేండ్లు వచ్చినంతనే చదువు చెప్పుటకై తగిన ఉపాధ్యాయులను నియమించాడు. ఆ రాకుమారులు

గురువు చెప్పడమే తడవుగా అన్ని విద్యలు గ్రహిస్తూవచ్చారు. పదునారేండ్లు వయస్సువచ్చేసరికి వారికి రాని విద్యఅంటూలేదు. శాస్త్రాలు వల్లించుటయేకాక అన్నిరకములైన ఆయుధవిద్యలయందు వారు ఆరితేరారు. అంతేకాక అశ్వారోహణ, గజారోహణ, రథారోహణలయందు సేనలను నడపుటయందు. వ్యూహములను కల్పించుటయందుకూడ సుశిక్షితులయ్యారు. ఆ రాకుమారులు పదునారేండ్ల వయస్సు కలవారే అయినప్పటికి నిరంతరం వ్యాయామం చేయడంవల్ల వారి శరీరాలు మంచిపుష్టి కలిగి సమున్నతంగా వున్నాయి.

రిపుంజయుడు తన కుమారులను చూచిమురిసిపోతున్నాడు. ఒక నాడాయన సభలో కూర్చుండి వుండగా ఒక రాజదూతవచ్చి ఆహ్వాన పత్రిక నొకదానిని ఆయన చేతిలోపెట్టాడు. అదియొక రాకుమారి యొక్క స్వయంవరాహ్వానం, ఆ రాకుమారిక పేరు స్వయంప్రభ, ఆమె యొక్క సౌందర్యంముందు దేవతల సౌందర్యంకూడ ఎందుకూ కొఱ గానిదని, సంగీత సాహిత్య విద్యలలో ఆమె సాటిలేదని ప్రసిద్ధి. ఆ రాజ కుమారికయొక్క స్వయంవరానికి రావలసిందని ఆహ్వానం వచ్చింది.

అ ఆహ్వానాన్నిచూచి రిపుంజయుడు— నేను స్వయంవరానికి వెళ్ళడం ఏమిటి? నాకు నలుగురు భార్యలున్నారు, రత్నాలవంటి నలుగురు కుమారులున్నారు అనుకొన్నాడు. ఈ స్వయంవరానికి కుమారులను పంపితే బాగుంటుందనుకొన్నాడు. కాని ఆయన కుమారులంతా గంటలు, ఘడియలు తేడాలో సమవయస్కులు, ఆ రాచకూతురు వీరిలో ఒకరిని వరించినా మిగిలిన ముగ్గురకు పెండ్లికూతుళ్ళను వెదకాలి కదా! అందుచేత ఇది బాగలేదు. నలుగురకు చక్కని కన్యలను వెదకి ఒకేసారి ఒకే ముహూర్తాన పెండ్లిచేస్తే బాగుంటుందనుకొన్నాడాయన. ఈ ఆలోచన రావడంతో ఆయన సభచాలించి అంతఃపురానికి వెళ్ళాడు.

అంతఃపురములోనికి రిపుంజయుడు అడుగుపెట్టగానే ఆయన భార్యలు నలుగురు ఆయన కెదురుగా వచ్చారు. ఆయనవారితో కలిసి

ఆ మాట ఆ మాట చెప్పి కుమారులకు యుక్తవయస్సు వచ్చినది, వారికి తగిన కన్యలను వెదకి పెండ్లి చేయాలి.—అన్న తన ఆలోచనను వెల్లడించాడు. దానికి వారంతా సంతోషించారు.

నలుగురు కుమారులకు తగినవారు—అందగత్తెలు–విద్యా వినయాలలో సాటిలేనివారు అయిన రాజకుమార్తెల చిత్రాలను దేశదేశాలనుండి త్వరలో రప్పించమని రిపుంజయుడు తన మంత్రికి ఆజ్ఞాపించాడు.

కొంతకాలానికి ఎందరో సుందరాంగులైన రాకుమారికలయొక్క—చిత్రాలు రిపుంజయుని అంతఃపురానికి చేరుకొన్నాయి, వారంతా పరమ సుందరులు. ఒకరిని మించిన సౌందర్యం మఱొకరిది. ఆ చిత్రాలకు దిగువనే వారి విద్యాపాటవాలు గుణస్వభావాలు సంక్షేపంగా వ్రాయబడ్డాయి.

రిపుంజయుడు ఈ మొత్తం చిత్రాలనన్నిటిని ఎదుట బెట్టుకొని భార్యల తోడ్పాటుతో అందులో మేలైన చిత్రాలను నాలిగింటిని ఎన్నిక చేసాడు. ఆ నలుగురు గుణరూప స్వభావాలలో మిగిలిన రాకుమారికలకంటే మిన్నగా వున్నారు. వారి రూపసౌందర్యాలు భిన్నంగా వున్నా నిరుపమానంగా వున్నాయి. అందుచే రిపుంజయుడు ఆ నలుగురను తనకు కోడండ్రుగా చేసికొనాలని ఊహించాడు. అయితే ఏ కన్యక నేకుమారునకు చేసికొనుట అన్నది ఇంకను తేలలేదు. అందుచేత రాజు ఆ చిత్రాలను నాల్గింటిని తీసికొని పెద్దభార్యతో ఆలోచించారు. అమె ఆ నాలిగింటిలో తనకుమారునకు తగిన కన్యయొక్క—చిత్రాన్ని ఎన్నికచేసికొన్నది. అనంతరం ఆ రాజు రెండవభార్య సన్నిధికి మిగిలిన మూడు చిత్రాలను తెచ్చి వీనిలో నీకు నచ్చిన చిత్రాన్ని యెన్నికచెయ్యి. ఆమెతో నీ కుమారుని వివాహం జరిపిస్తానన్నాడు.

"ఈ చిత్రాలు నాలుగుకదా! మూడే వున్నాయేమి"?—అన్నదామె.

"ఒక చిత్రం కళావతి ఎన్నుకొన్నది, అందుచే మూడే తెచ్చాను"—అన్నాడు రాజు.

అది విన్న రెండవభార్య—మంచి చిత్రం ఆమె యెన్నుకొన్నది. ఇక యీ చిత్రాలను నాకు చూపడం ఎందుకు? మీ పెద్దకుమారునికి పెండ్లి చేసికొనండి. నేను ఎన్నిక చేయనక్కరలేదు. నా కుమారుడు ఆజన్మ బ్రహ్మచారిగానే వుంటాడు అన్నది ఈర్ష్యతో.

రాజుకు ఇది క్రొత్తసమస్య అయినది. ఆయన పెద్దభార్యకు నచ్చజెప్పబోతే ఆమెకూడ అంగీకరించలేదు. ఎంత శ్రమపడినా ఆరాణు లందరు ఒకరు కోరిన వధువునే వేరొకరు కోరుకొంటూవచ్చారు. దానితో రాజుకు చాల చికాకుకలిగింది. ఆయన కుమారుల వివాహాలు కుమారులే చేసికొనడం మేలైనదనుకొన్నాడు.

ఆ ఊహ తోచినంతనే రిపుంజయుడు తన నలుగురు కుమారులను పిలచి—మీరందఱు దేశాటనంచేసి తగిన కన్యలను పెండ్లాడిరండి. మీ ప్రయాణానికి తగిన ఏర్పాట్లు చేస్తున్నాను— అన్నాడు. దానికి వారందరు సంతోషంతో అంగీకరించారు.

ఒక శుభముహూర్తాన ఆ నలుగురు రాజకుమారులు చాలినంత ధనం తీసికొని గుఱ్ఱాలమీద దేశాటనానికి బయలుదేరారు. వారు సవతితల్లి బిడ్డలేఅయినప్పటికి ఏకోదరులకంటె ఎక్కువ స్నేహము, ప్రేమకలవారు. అందుచే మిక్కిలి వుత్సాహముతో ఆయా వింతలు, విశేషాలుచూస్తూ ప్రయాణం చేయసాగారు. ఇలా వారు ఎన్నో దేశాలు గడచి చైత్రరథం అనే నగరానికి చేరుకొన్నారు.

చైత్రరథం చాల సుందరమైన నగరం. అందలి విశాలములైన రాజమార్గాలు, వున్నతములైన సౌధాలు, నగరవాసుల రూపురేఖలు, వేషభూషణాలూ మనోహరంగా వున్నాయి. అందువల్ల ఆ నగరంలోని వింతలు చూడడానికై రాకుమారులచ్చట సత్రంలో మకాంచేశారు.

వుదయం కాగానే పెద్దవాడైన అజయుడు— "నేను బసలో వుంటాను. మీరు నగరంలోనికి వెళ్ళి చూచిరండి. మీరు వచ్చిన మీదట సాయంకాలం నేను వెడతాను. మధ్యాహ్నం భోజనసమయం దాటకుండమాత్రం మీరువచ్చితీరాలి—అన్నాడు తమ్ములతో.

ఇలా అన్న అనుమతి ఈయగానే విజయుడు, సూర్యుడు, చంద్రుడు నగరం చూడడానికి వుత్సాహంగా బయలుదేరారు. ఇక్కడ —జయుడొక్కడూ వచ్చేపోయే నాగరికులను చూస్తూ సత్రం అరుగు మీద కూర్చున్నాడు.

మధ్యాహ్నం అయింది. భోజనసమయంకూడ దాటుతోంది. కాని నగరంచూడడానికై వెళ్ళిన తమ్ములు రాలేదు. అజయుడే వారి రాకకై ఎదురుచూస్తున్నాడు. అలా నిరీక్షిస్తూవుండగా సాయంకాలం కూడ గడచిపోయింది. రాత్రికూడ చాలవరకు నిరీక్షించి అజయుడు తన తమ్ములేమైనారో అని పరిపరివిధాలుగ ఆలోచించాడు. తెల్లవారు సరికైన రాకపోతారా ? అనుకొన్నాడు.

తెల్లవారింది. కాని సోదరులు తిరిగిరాలేదు. ఇక నిరీక్షించి ప్రయోజనంలేదు. నగరంలోకి స్వయంగా వెళ్ళి వారిజాడ తెలిసికొనాలనుకొన్నాడు అజయుడు. అతడు సత్రంయొక్క అధికారికి తన సామానులు అప్పగించి నగరంలోనికి బయలుదేరాడు. అతడెన్నో వీధులుతిరిగాడు. అన్నివీధులు జనంతోనిండివున్నాయి. ప్రతివస్తువు చూపును ఆకర్షించేదిగా వుంది. కాని అజయుడు దేనిచేతను ఆకర్షింపబడలేదు. అతనికి తన సోదరులు కనబడలేదన్నచింత ఎక్కువగావున్నది.

సోదరులకొఱకు వెదకుతూ వెదకుతూ మధ్యాహ్న సమయానికి అజయుడొక పెద్దవీథిలో అడుగుపెట్టాడు. ఆవీథి అన్ని వీధులకంటె సుందరంగా వున్నది, ఆచ్చటనైన తన సోదరులు కనపడతారేమో అన్న ఆతురతతో అజయుడు నాలుగువంకలా పరికిస్తూ ముందుకు వెళ్ళసాగాడు. అంతలో ఒక మహాభవనం అతని దృష్టిని ఆకర్షించింది.

ఆ భవనం రాజభవనమంత పెద్దది. ఎత్తైన ప్రాకారపుగోడ, విశాలమైన ప్రవేశద్వారము ఆ భవన సౌందర్యాన్ని ఇనుమడింప జేస్తున్నాయి. అజయుడాభవన ప్రాకార సమీపానికి వెళ్ళాడు. అక్కడ ద్వారసమీపంలో చలువరాతిమీద చెక్కబడిన ఒక ప్రకటనపై అతనిచూపు పడ్డది. అందులో ఇలా వ్రాయబడి వున్నది.

ఐదే ప్రశ్నలు !

ప్రశ్నలు శాస్త్రీయములే !
సముచిత సమాధానము చెప్పగలిగితివా—
రాకుమారి రత్నపదిక ఈ రాజ్యంతో నీకు పాదదాసి.
నీ సమాధానములు తగినవి కానిచో—
నీవామెకు తోటమాలివి.

—రాకుమారి రత్నపదిక,

అజయుడా ప్రకటన చదివేడు. అతడనుకొన్నాడు— ఇదేమి ప్రకటన! రాకుమారిక శాస్త్రములందు ప్రశ్నించునా? ఐదు ప్రశ్నలా! ఆ ప్రశ్నల కింతవరకు ఎవరును సమాధానము చెప్పలేకపోయిరా ? ఏవో వికట ప్రశ్నలయినచో సమాధానము చెప్పజాలకపోవచ్చును. కాని శాస్త్రములందు చెప్పబడిన విషయములందే ప్రశ్నించినపుడు చెప్పకపోవుట యేమిటి ! శాస్త్రములు చదివినవాడెవ్వరైన చెప్ప వచ్చునే! ఇంతకు నా సోదరులేమైనట్లు ? వారిక్కడకువచ్చి చిక్కు కొనలేదుకదా! ఏమో! ఎవరు చెప్పగలరు ?

ఇలా ఊహించుకొని అజయుడు వచ్చేపోయే జనాన్ని అడిగి కొంత వివరం తెలిసికొన్నాడు. అతనికి తెలియవచ్చిన విషయంఇది.

"రత్నపదిక చాల అందగత్తె, బుద్ధిమతి, విదుషి. ఆమెతండ్రి ఆమెకీరాజ్యం అప్పగించి చనిపోయాడు. మంత్రుల సాయంతో ఆమెయే యీ రాజ్యాన్ని పాలిస్తోంది. ఆమె నవయువతి, ఇది అమె వుద్యా

న్ని అంటివున్న భవనము తనకు తగిన భర్తను సంపాదించుకొను టకై ఆమె యీ ప్రకటనను వ్రేలాడగట్టి ఏండ్లుదాటింది. ఇంతవరకు ఆమె ప్రశ్నలకు సమాధానం చెప్పడానికి వెళ్ళినవారెందరో ఆమెతోట లోపనిచేస్తున్నారు. అవేవో చిత్రమైన శాస్త్రప్రశ్నలు వానికి సమా ధానం చెప్పడం అసంభవం. ఆ రాకుమారికి పెండ్లియే కాదేమో!"

ఇలా వున్నాయి జనం చెప్పేమాటలు, అజయుడు ఆలోచించి కాని ఏపనీ చేయడు. అతడాభవన ద్వారం దగ్గఱ కావలియున్న వాని వద్దకు చేరి–నిన్న ఎవరైనా ప్రశ్నలకు జవాబు చెప్పడానికి వచ్చినారా? అని అడిగేడు.

ఆఁ! వచ్చారుబాబూ! వారెవరో మీవలెనే వున్నారు. మొత్తం ముగ్గురు. ఇప్పుడు తోటలో పనిచేస్తున్నారు అన్నాడు.

ఇది విని అజయుడు ఆశ్చర్యపడ్డాడు. అతడాలోచించసాగాడు. నా సోదరు లిక్కడ చిక్కుకొన్నారన్నమాట. కాని ఇది సంభ వమా! మా చదువని శాస్త్రములు లేవు. వారామె ప్రశ్నలకు తగు సమాధానములు చెప్పలేకపోయినారా? వారు చెప్పజాలకపోయిన నేను మాత్రము చెప్పగలనా? తమ్ములను విడిపించుట యెట్లు? ఇంతకు ఆమె యే శాస్త్రములో ప్రశ్నిస్తోంది? నవయువతి అగుటచే కామ శాస్త్రములో ప్రశ్నించునేమో! అందైనను సోదరులకు తెలి యని విషయములు లేవే! అట్లుకాదు. యౌవ్వన మింకను బొడ సూపకముందే కామశాస్త్రములు చదువుట మంచిదికాదని గురువులు నిషేధిస్తూ వాత్స్యాయన మహర్షి రచించిన కామ సూత్రములకు సూత్రమే బోధించారు. కామశాస్త్రములేకాక కామశాస్త్రగ్రంథము లెన్నో వున్నవి. నేను మాత్రము ఆ గ్రంథాలన్నీ తెప్పించి చదివేను. వారు చదువలేదేమో! ఈ రాకుమారి తప్పక కామసాస్త్రములోనే ప్రశ్నిస్తూవుండాలి. లేకపోతే నా తమ్ములను జయించడం ఈమెకు సాధ్యంకాదు. ఇప్పుడు నేనేమిచెయ్యాలి? ఆమె ప్రశ్నలకు సమా ధానం చెపుతానని లోపలకువెళ్ళనా? మాననా? సమాధానం చెప్ప

డానికి నేను సాహసించలేదంటే తమ్ములను తోటమాలులుగ విడచి పెడుతున్నానన్నమాటయే కదా! అలాకాదు. ఆమె ప్రశ్నలకు సమాధానాలు చెప్పుటకు ఉద్యమించుటయే కర్తవ్యము. దైవము తోడ్పడెనా జయిస్తాను. లేదా తమ్ములను కలసికొంటాను.

అజయు డీవిధంగా ఆలోచిస్తూండగా ఆ భవనంలోనుండి ఘంటానాదం వినబడ్డది. అజయుడా ధ్వనివిని ద్వారపాలకుని సమీపించి — ఆ ధ్వని ఏమని ప్రశ్నించాడు.

దానికి ద్వారపాలకుడు—స్వామీ! రాకుమారి యీ భవనములోనికి ఇప్పుడే వచ్చినది. ఆమె ప్రశ్నలకు సమాధాన మీయదలచువారెవరైనా ఉన్నచో రావచ్చునని సూచించుటకు ఈ గంట మ్రోగింపబడినది.

అజయుడు వెంటనే—నేనామె ప్రశ్నలకు సమాధానమిస్తాను నన్ను లోపలకు తీసికొనివెళ్ళు—అన్నాడు.

ద్వారపాలకు డాతని యీ నిర్ణయానికి చకితుడయ్యాడు. కాని అతని నాపుటకు తానెవ్వడు? అందుచేత "రండి! రండి!"అని పిలుస్తూ ముందుకు నడచి మార్గము చూపసాగేడు.

ఆ భవనము మిక్కిలి విశాలమైనది. నానాలంకారములతో నిండినది. భవనములోని కడుగిడినంతనే కొందరు పరిచారకులు అజయుని పాదాలు కడిగి తడియొత్తారు. మరికొందరు నీరాజన మిచ్చారు. కొందరాతని నొక సుందరమైన గదిలోనికి గొనిపోయి మెత్తనైన సెజ్జపై డబెట్టారు.

అజయుడా భవన సౌందర్యమును పరికిస్తూ ఆ రాకుమారి తన్నేమి ప్రశ్నిస్తుందో అని ఆలోచిస్తూ ఉన్నాడు. అంతలో ఒక పరిచారిక బంగారు పళ్ళెములో తీయమామిడి చివుళ్ళ అంకురములను బెట్టి తెచ్చి యాతనిముందు నిలువబడినది.

అజయునకిది యేమో అర్థముకాలేదు. ప్రశ్నిస్తుందనుకొన్న రాకుమారిరాలేదు. పోనీ తన్ను గౌరవించి ఆతిథ్యమిస్తున్నారనుకొందమంటే మామిడి చివుళ్ళ నెవరు తింటారుగనుక? దీనియర్థమేమై యుంటుంది. ఇట్టి సందిగ్ధావస్థలో చిక్కుకొని అజయుడు దైవమును తలుస్తూ క్షణకాలమూరకున్నాడు. అంతలో అతని బుద్ధియందు తానెన్నడో చదివిన "నాగర సర్వస్వము"అను కామశాస్త్రమందలి సంకేతాలు స్ఫురించాయి.

'కులప్రశ్నేంకురః స్మృతః'

నీ కులమేది? అని ప్రశ్నించుటకు అంకురమును బంపుట సంకేతముగా ఆ శాస్త్రమున చెప్పబడ్డది.

ఆ రాకుమారి తన కులమునుగూర్చి ప్రశ్నించుచున్నదని అజయుడుగ్రహించి ఆ నాగరసర్వస్వమునందే చెప్పబడిన విధానాన్ననుసరించి సమాధానము చెప్పవలెనని తలంచి అటునిటు పరికించాడు.

అచ్చట ఒక బల్లమీద లక్కతో చేయబడిన దానిమ్మపండ్లు, పనసపండ్లు, అరటిపండ్లు, మామిడిపండ్లు అమర్చబడి ఉన్నాయి. అజయుడు వానిని చూచినంతనే మిగుల ఉత్సాహముతో అందలి లక్కపనసపండును దెచ్చి, మామిడి చివుళ్ళ అంకురములున్న పళ్ళెమునందుంచాడు

దాడిమంతు ద్విజే జ్ఞేయం
పనసః క్షత్రియే స్మృతః
కదలీజం ఫలం వైశ్యే
తథామ్రం శూద్రజే స్మృతం.

అని శాస్త్ర సంకేతనము. అనగా బ్రాహ్మణునకు దానిమ్మపండు. క్షత్రియునకు పనసపండు, వైశ్యునకు అరటిపండు, శూద్రునకు మామిడిపండు సంకేతములై ఉన్నాయి.

నీకులమేది? అని చూతాంకురములను బంపుటద్వారా రాకుమారి ప్రశ్నించెనుకదా? అజయుడు తాను క్షత్రియుడైనందున పనసఫలమునంపి తనకులమును తెలియజేసాడు.

పరిచారిక ఆ పళ్ళేరాన్ని లోనికి గొనిపోయి మరికొంత సేపటికి వేరొక పళ్ళెమునుదెచ్చి యాతని యెదుటఉంచింది. అందొక చక్కని కాగితముపై సుందరముగా చిత్రింపబడిన చంద్రరేఖ ఉన్నది. ఆ చంద్రరేఖ విదియ చంద్రునకు చాలివున్నది.

"రాజపుత్రి ద్వితీయేందః"

అని శాస్త్రము. అనగా—నీవు రాజపుత్రుడవా? అని అడుగుటకు విదియ చంద్రుడు సంకేతము.

అజయుడు దానివంకచూచి ఈమె ప్రశ్నలన్నియు నాగరసర్వస్వ శాస్త్రమునకు చెందినవేకాబోలును. అయినచో జయపతాక నెగుర వేసినటులే తలంచవచ్చును. అనుకొనుచు తాను చక్కగా చదివిన ఆ శాస్త్రసంకేతాలను స్ఫురణకు తెచ్చుకొని అచటనున్న కుంచెతో ఆ చంద్రరేఖకు వెనుకగా మేఘమాలలను చిత్రించాడు.

"ఘనచ్ఛాయస్తు భూపతిః"

అని శాస్త్రము. భూమీశుడైనచో మేఘచ్ఛాయ సంకేతము.

అందువలననే అజయుడు తాను సామాన్య రాజకుమారుడను కాననియు భూపతి ననియు సూచించుటకా కాగితముపై మేఘమును చిత్రించాడు.

పరిచారిక యా పళ్ళేరాన్ని లోనికి గొనిపోయింది. అజయుడు—రెండు ప్రశ్నలయ్యాయి. మూడున్నాయి—అని తలుస్తున్నాడు.

అంతలో పరిచారిక తిరుగ వేరొక పళ్ళేరముతో అతని యెదుటకువచ్చింది. ఆ పళ్ళేరంలో ఒక మైనపుముద్ద ఉన్నది. ఆ ముద్దపై ఐదుగోళ్ళతో గుచ్చినటులు గుర్తులున్నవి. మైనమునకు ఎఱ్ఱదారము చుట్టబడియున్నది.

అజయుడు దానినిచూచి రాకుమారిక పోటలీ ప్రశ్న అడిగినదే! అని తలచేడు.

మదనాసంగతః సిక్థః సంరాగో రక్తవేష్టనమ్,
పంచబాణ క్షత త్వేతు పంచాంగుళి నఖక్షతిః—

ఇంతకుముందు మన్మథవ్యాపారము లేదనుటకు మైనము, నీయం దెక్కువ యనురాగము కలదనుటకు ఎఱ్ఱిదారము చుట్టుట, మన్మథుని ఐదు బాణములు తన మనస్సుననాటి యున్నవని తెలుపుటకు ఐదు గోళ్ళతో గుచ్చుట సంకేతములై ఉన్నాయి. శాస్త్రమున దీనికి పోటలీ యని పేరు.

అజయుడు వెంటనే ఇటునటు పరికించి అచ్చటనున్న చక్కని వస్త్రఖండాన్ని తెచ్చి, దానికి చిల్లులు పొడిచి యామైనపు ముద్ద కంటించాడు. పరిచారిక పళ్ళెరాన్ని లోనికి గొనిపోయింది.

"స్మరేణోద్భిన్న దేహాత్వే సచ్ఛిద్రం వస్త్రముత్తమం"

అని శాస్త్రము. అనగా—మన్మథునిచే నా దేహము చిల్లులుపడినదని సూచించుటకు చిల్లులు పడిన వస్త్రము సంకేతము. అజయుడు చిల్లులు పొడిచిన వస్త్రమంపుటద్వారా రాకుమారియొక్క సంకేతమునుగుర్తించినటులేకాక తానుకూడ మదనునిచే పీడింపబడుచున్నట్లుసూచించాడు.

కొంతసమయానికి పరిచారిక వేరొక పళ్ళెరాన్ని తెచ్చి రాకుమారుని యెదుట ఉంచింది. ఆ పళ్ళెమునందు తమలపాకులు చిత్రముగా చుట్టబడి నాలుగుమూలలయందు లవంగ మొగ్గలచే గ్రుచ్చబడిఉన్నాయి ఆ లవంగములు నాలుగు నాలుగుకోళ్ళవలె నుండగా చుట్టబడిన తమలపాకులు పరుపుతోకూడిన మంచమువలె ఉన్నాయి.

"పర్యంక స్సంగమాశయా"

అని శాస్త్రము. అనగా—నేను నిన్నుకలియ గోరుచున్నాను. అనుటకు పర్యంకముయొక్క ఆకారముగల తాంబూలము సంకేతము.

అజయుడు దాని భావము గ్రహించి ప్రక్కనున్న గంధపు గిన్నెలోని గంధమునింతదీసి యా తాంబూలముపై అంటించాడు. పరిచారిక పళ్ళెమును లోనికి దీసికొనిపోయింది.

"బాహ్యా చందన పంకాక్త మత్యర్థ మనురాగతః"

తాంబూలమునకు మంచిగంధ మంటించినపుడు నాకు నీయందు మిక్కిలి యనురాగము కలదని సూచించుటకు సంకేతముగా శాస్త్రి మున చెప్పబడ్డది.

పర్యంకాకారముగల తాంబూలమునంపి రాకుమారి తన మనస్సులోని సంగమాశను తెలుపగా దానిపై మంచిగంధమునలది అజయుడు నాకు నీయందు మిక్కిలి యనురాగముకలదని సూచించెను.

మరికొంత సమయానికి పరిచారిక పల్కైరము లేకయే చేతనొక చీటిగొని యాతని సన్నిధికివచ్చి యా చీటినందించింది. దానియందిట్లు వ్రాియబడిఉన్నది.

ఆర్యా! తాము ఎడమచేతి బొటనవ్రేలి చివరిరేఖనాడు తిరుగ యిచ్చుటకు దయచేయుడు.

—రాకుమారి రత్నపదిక.

అనియున్నది.

"శుక్లేవామకరో జ్ఞేయః అసితే దక్షిణః కరః".

అని శాస్త్రము. అనగా ఎడమచేయి శుక్లపక్షమునకు కుడిచేయి కృష్ణపక్షమునకు సంకేతములు. చేతికి వ్రేళ్ళైదు, ప్రతివ్రేలికి రేఖలు మూడు. మొత్తమీ రేఖలు పదునైదు. అందు చిటికెనవ్రేలి మొదటి రేఖ పాడ్యమి తిథిని, రెండవది విదియను, మూడవది తదియను సూచించును. ఇట్లు వరుసగా పదునైదు రేఖలు పదునైదు తిథులకు గుర్తులుగా శాస్త్రము సూచించెను.

ఎడమచేతి బొటనవ్రేలి చివరిరేఖ నాడనగా పూర్ణిమ అయినది రాకుమారి పూర్ణిమనాడు రమ్మని సంకేతము చెప్పినదని గ్రహించి— అజయుడు, నేడు శుద్ధవిదియకదా! అని కొంచెమాలోచించి ఆకాశ తమః మీద నే—

నేనంతవరకు నిలువజాలను. ఎడమచేతి చిటికెనవ్రేలి నడిమిరేఖ సంకేతముగాగల యీ దినముననే నా కోరిక తీర్పవలెను.

—అజయుడు.

అనివ్రాసి ఆ పరిచారికకిచ్చెను. పరిచారిక యీ చీటిని రాకుమారియొద్దకు గొనిపోయింది.

ఈ విధముగా తానామె ప్రశ్నలకెల్ల దింటికి తగు సమాధానములు చెప్పగలిగినందులకు వాన్ని స్తుతిస్తూ అజయుడచ్చట కూర్చుండి ఉన్నాడు. అంతలో బహుపరిచారికా సేవితయై రాకుమారి అజయుని యెదుటకు వచ్చి నమస్కరించి పరిచారిక యందిచ్చిన పూలమాల నాతని మెడయందుంచి—

స్వామీ! నాకొక సిద్ధుడీ ప్రశ్నలను-వీని సమాధానములను ఉపదేశించి— ఈ సమాధానములు చెప్పినవానిని పెండ్లాడమన్నాడు. అప్పటినుండి నేనీవిధంగా అనేకులను ప్రశ్నించాను. కాని ఒక్కరును వీని మర్మము తెలిసికొని సమాధానము చెప్పజాలకపోయేరు. నేటికి నా తపము ఫలించింది. మీరిచ్చిన సమాధానాలు తగివున్నాయి. నాకు ముప్వురు చెల్లెండ్రు. వారుకూడ ముమ్మూర్తుల నన్నేపోలినవారు. మమ్ము నలువురను భార్యలుగా స్వీకరించి యీ రాజ్యాన్ని పాలించండి.—అని వినయముగా బలికింది.

అనంతరం అజయుడు తన సోదరులనుగూర్చి రాకుమారినడిగి తెలిసికొని వారిని విడిపించాడు. రూపంలో సౌందర్యంలో రత్నపదికనే పోలివున్న ఆమె చెల్లెండ్రను ముప్వురను తన ముగ్గురు సోదరులకు భార్యలుగా నిర్ణయించాడు.

ఒకనొక శుభముహూర్తంలో రత్నపదికకు, అజయునకు వైభవముగా వివాహము జరిగినది. అదే ముహూర్తలో రత్నపదికయొక్క చెల్లెండ్రను అజయుని సోదరులు పెండ్లాడిరి. ఆ నూతన దంపతులు చిరకాలము సుఖముగా జీవించారు.



నాగర సర్వస్వమననేమో తెలుపుటకీ కథ చెప్పబడినది. కామినీ కాముకులు పరమ నాగరికులైనపుడు తమ సంకేతముల నితరులు గుర్తింపనటులు ప్రవర్తించు స్వభావముకలవారై యుంటారు. ఆ సంకేత మర్మములు తెలియనివాడు స్త్రీయైనను పురుషుడైనను—ఇట్టి సంకేతములతో తన యెదుటకు వచ్చిన సౌఖ్యమును అనుభవింప జాలనివారే అవుతారు, ఇట్టి కళాపాండిత్యముకల స్త్రీలు అరుదుగా వుంటారు. అట్టివారితో సాంగత్యము దుర్లభము. అయినను ఒకవేళ అట్టి స్త్రీ తన్నువలచి సంకేతమును దెలిపినచో శాస్త్రము తెలియని వాడు తెల్లబోవుట దక్క చేయునది యుండదు.

లోకమునందలి యిట్టి నాగరిక సంకేతములను, ఇంకను అనేక విషయములను శాస్త్రగ్రంథములనుండి యేర్చికూర్చి పద్మశ్రీ అను పేరుగల బౌద్ధయతి యీ నాగరసర్వస్వమును సంస్కృతంలో రచించారు. గ్రంథాంత మందాత డిట్లు చెప్పకొన్నారు.

ఆసీద్బ్రహ్మకంలే కలాగ్రనిలయో యోవాసుదేవః కృతీ
తస్యస్నేహవశా చ్చిరంప్రతిముహుః స్సంప్రేరణాత్ సాంప్రతం
దీప్తేయం రతిశాస్త్రదీపకలికా పద్మశ్రియా ధీమతా
హృద్యార్థాన్ ప్రకటీకరోతు జగతాం సంహృత్య హార్దంతమః

వాసుదేవుడను విప్రు డొకడు కలడు. ఆతడు సకలకళాకోవిదుడు చతురుడు. ఆతడు మాటిమాటికి ప్రోత్సహింపగా పద్మశ్రీ అను పేరుగల బౌద్ధయతి రతిశాస్త్రములకు దివ్వెవంటిదైన ఈ నాగర సర్వస్వమును రచించాడు. ఈ గ్రంథము రమ్యార్థములను వెల్లడించుచు అజ్ఞానమను చీకటిని హరించి లోకమున చిరకాలము వెలుగులు చిందుగాత!

వాస్తవమున కీ నాగర సర్వస్వము చదువుటవలన హృదయము నందొక వింత వెలుగు ప్రసరిస్తుంది. గ్రంథమును పఠించినగాని ఆ వెలుగు మనస్సున కంటదు. యీ నాగర సర్వస్వం అనాగరకునకు నాగరత

నేర్పుతుంది. నాగరికునియందు అనంత విలాసాలను నిక్షేపిస్తుంది. విలాసి జనానికి విశ్రాంతిశాయి సౌఖ్యాన్ని అందజేస్తుంది. సంస్కృత భాషయందున్న యీగ్రంథము సర్వులకు చదువుట సాధ్యముకాదు. అందులకే ఈగ్రంథము తెనిగింపబడుచున్నది. ఈ అనువాదమున అవతారికా ప్రాయములు వ్యాఖ్యానసదృశములు అయిన విషయములనేకములున్నను మూలమును విడిచిన అకాండతాండవము మాత్రముకాదు.

ఇట్టి గ్రంథమొకటి సంస్కృతమునందున్నదనియైన యెఱుంగని నన్ను— శ్రీ రాంషాగారు అనువాదము చేయుడని ప్రోత్సహించినారు. కాగా వ్రాసినది నేనే అయినను వ్రాయించినది రాంషాగారు. ఆయన ఉత్తమ రచనలకే కాదు, రచయితలకును సృష్టి. ఆయనకు నమస్సులు. ఈగ్రంథమును జదువు పాఠకులకు అభినందనలు.

ఇట్లు,

"అరుణకిరణం"

# మంగళాచరణము

ఎవ్వని అనుగ్రహామువలన మదవతియై మనోహరమైన రూపము కలదైన యువతి తనంతతానై పతిని కౌగలించుకొనడం— తానానందించి అతనిని ఆనందింపజేయడం జరుగుతూ వున్నదో— ఆ పూవిలుకానికి, సొగసులుచిందే శరీరంతో సుందరులకెల్ల సుందరుడై వెలయువానికి మన్మథునకు నమస్కారము.

**ఈ శాస్త్రముయొక్క అవసరము - ప్రయోజనము :**

లోకంలో ఎన్నో కామశాస్త్ర గ్రంథాలున్నాయి. కాని వానిలోకొన్ని అన్యభాషలలోఉంటే, కొన్ని సులభంగా తెలియడానికి వీలులేని కఠిన శైలిలో వ్రాయబడ్డాయి. కొన్ని గంభీరమైన శాస్త్ర విషయాన్ని సమగ్రంగా చెప్పక కొంతవరకూ మాత్రమే చెప్పి ఊరకొన్నాయి. అందుచే పద్మశ్రీ అనే బౌద్ధుడు అందరకు తెలిసికొనడానికి వీలైన శైలిలో ప్రాచీన కామశాస్త్రాలలోని లోపాన్ని పూరిస్తూ ఈ నాగర సర్వస్వం రచించాడు. ఈ గ్రంథం కేవలం కామాన్ని మాత్రమే సాధించి పెడుతుందని ఎవరైనా అనుకొంటే అదివారి అజ్ఞతను వెల్లడించుకొనడమే అవుతుంది. ఇది ధర్మాన్ని - అర్థాన్ని - కామాన్ని మొత్తం త్రివర్గాలను సాధించిపెట్టే సద్గ్రంథం. ఈ కారణంచే పండితులు దీనిని ఆదరంతో చూచెదరుగాక! అని విన్నవించుకొంటున్నాను.



కామం అన్నది సర్వప్రాణి సహజమైనది. అది నేర్పకోకుండానే అందరకు అలవడుతుంది. అట్టి కామానికికూడ ఒక గ్రంథం, ఒక శాస్త్రం అవసరమా? అన్నప్రశ్న కలగడం సహజం.

కాని తగినంత విజ్ఞత లేనివారికిమాత్రమే పై విధమైన ప్రశ్న ఉదయిస్తుంది. విజ్ఞత కలవాడెవ్వడూ అలాంటి ప్రశ్నను తావీయడు. ఏమంటే—లోకంలో అవులమంద మధ్యలో ఆంబోతు ప్రబల కామంతో విహరించడం చూస్తూన్నాముకదా! “నేను నాగరకుడను, ఏ విష

యున్నాసరే! నేను లలితంగా సుందరంగా ఉపాసిస్తాను."—అని చెప్పుకొనే మానవుడు కామవిషయంలో మంచి శాస్త్రగ్రంథాలు చదువక—చిత్రచిత్ర రతిక్రీడావిధానాలు—ఉపచారవిధానాలు తెలిసికొనక కాంతలతో కాముకుడై విహరిస్తే— వాని విహారానికి, ఆ ఆబోతు విహారానికి తేడా ఏముంటుంది!

అందుచే మానవుడు తన నాగరకతా లక్షణానికి అనుకూలమై సుందరమైన సంవిధానంలో కామాన్ని ఉపాసించాలి— అనుభవించి ఆనందించి, ఆనందింపజేయాలి— అంటే శాస్త్ర గ్రంథాలు చదవడం అవసరం. అందుకొఱకే ఈ గ్రంథం రచింపబడుతూన్నది.

వయస్సులోని సొగసుకత్తె మదవతియై అధిక కామంకలదై మిక్కిలిగా బాధపడుతూ ఉన్నప్పుడు ఆమెయందు దయగలవాడై. స్వార్థరహితుడై పురుషుడామెకు పూర్ణమైన తృప్తిని కలిగించగలిగితే— వానికి ఈ పుడమియే స్వర్గం అవుతుంది. తనవల్ల అలా తృప్తిపొందిన పడతిచే ఆ పురుషుడు నిరంతరం ఆరాధింపబడుతూ స్వర్గసౌఖ్యాలను ఈ పుడమియందే అనుభవింపగలవాడవుతాడు. అయితే అలాకామార్తయైన వనితయొక్క భావాన్ని గుర్తించి ఆమెను కలిసి తాను తృప్తి పొంది ఆమెకు తృప్తి కలిగించడానికి మంచి శాస్త్రగ్రంథాలు చదివి వాని ఎఱుక సంపాదించడం అవసరం.

అలా కామంతో బాధపడే పడతి పరవనిత అయినప్పటికి ఆమెను కలిస్తే పురుషునకు పుణ్యమే లభిస్తుంది, కాని పాపం కలుగదు. అట్టి వనితను కలియడానికి పాపభీతితో నిరాకరిస్తే పాపంకలుగుతుంది. మహాభారతంలో—కామాతురయై స్వయంగా (తన ప్రయత్నం ఏమీ లేకుండా) కోరివచ్చిన వనితను తిరస్కరించి ఆమెను కలియనిరాకరించిన పురుషుడు దేహావసానమున నరకానికి చేరుకొంటాడని, 'వాని నిట్టూర్పులు సోకినవానికల్లా పాపం అంటుతుందని—చెప్పబడ్డది.♦ అందుచే

♦ కామార్తాం స్వయ మాయాతాం యోనభుంక్తేనితంబినీం ।
సోవశ్యం నరకం యాతి తన్నిశ్వాస హతోనరః ।

కామపీడితయై వలచి వచ్చిన వనితను ఇహలోక సుఖంకొఱకు కాకపోయినా పరలోక సుఖంకొఱకైనా తిరస్కరించకూడదు.

మరియొక విషయం— కామ పీడితయై తన భార్యయే తన సన్నిధికివస్తే ఆమెనుచూచి తాను కామానికి వశంకాకుండా ఆమెకు నిత్యతృప్తిని కలిగించే పురుషుడుకూడ దేహావసానమున ఉత్తమ లోకాలకు చేరుకొంటాడనికూడ చెప్పబడ్డది.

స్వయంగా వలసి వచ్చిన వనితను చూచినప్పుడు పురుషుని మనస్సులో ఉత్కటమైన కోరిక ఉదయిస్తుంది. అలా పురుషుడు ఉత్కటమైన కోరిక కలవాడైనప్పుడు ఆ వనితకంటెముందు తానే తృప్తిచెంది తరువాత ఏమియు చేయలేనివాడవుతాడు. అందుచే అతడు తన కోరికను నిగ్రహించుకొని- అంటే తాను ఒక రకంగా మానసికంగా కామరహితుడై ఆమెను కలిసినప్పుడు మాత్రమే ఆమెకు తృప్తి కలిగించగలవాడవుతాడు. కాంతా పరితృప్తికై ఇట్టి నిగ్రహాన్ని అవలంబించేవానికి ఉత్తమ గతులు కలగడంలో ఆశ్చర్యంలేదు. అందుచే కామ శాస్త్రిలన్నవి ఎంతమాత్రమూ నిందింపదగినవికావు.

నాగరసర్వస్వం అనబడే ఈ కామశాస్త్రాన్ని చక్కగా చదివి అచరణలోపెట్టి ఎవరైనా ధనధాన్యాదికాన్ని సంపాదించదలిస్తే అవి వారికి సులభంగానే లభిస్తాయి. అంతేకాదు. ఈ శాస్త్రంలో చెప్పబడ్డ విషయాలయందు శ్రద్ధకలిగి యత్నించేవారికి పుత్రుడు జనించాలని కోరిక ఉంటే పుత్రుడు, పుత్రిక జన్మించాలన్న కోరికఉంటే పుత్రిక జన్మిస్తారు.

మిక్కిలి కోరికతో తనవద్దకు వచ్చిన మదవతియైన వనితను పురుషుడు శాస్త్రము వివరించిన విధానములో కలిసి ఆమెయొక్క యోని యందు బీజవ్యాసం (వీర్య విసర్జన)చేస్తే ఆమె అరమోడ్పుకనుగవతో పరవశయై మిక్కిలిగా ఆనందించినదై ఆ పురుషునకు తన శరీరాన్నే కాదు తనయొద్దనున్న ధనాన్నికూడ కొల్లబెట్టేది అవుతుంది, అందుచే ఇహాముపరము చెడకుండ కాపాడుకోవాలనుకొనేవారు కామశాస్త్రి గ్రంథాలను అభ్యసించితీరాలి.

అసలు ఈలోకం మోక్షాన్నిమాత్రమే ఆరాధించే ముముక్షువుల వల్ల వృద్ధిచెందలేదు,వృద్ధిచెందదుకూడ. ధర్మము, అర్థము. కామము- అనబడేత్రివర్గాన్ని ఉపాసించేవారివల్ల లోకం వృద్ధిచెందుతుంది. ఈగ్రంథము ప్రధానంగా కామాన్ని అప్రధానంగా ధర్మార్థాలను వివరించేదై వున్నది. అందుచే పండితు లెవ్వరూ దీనిని ఆదర రహితములైన దృక్కులతో అవలోకింపకుందురుగాత! అని వేడుచున్నాను.



ఏమయ్యా! నీవుచూ స్తే బౌద్ధుడవు. సన్యాసివికదా! నీకు కామాన్నిగూర్చి వివరించే గ్రంథరచన దేనికి? అన్న శంకకూడ కలగడం అసహజంకాదు. ఇదేదో బౌద్ధధర్మానికి వ్యతిరేకమైనపని నాచే ఆచరింపబడుతూ ఉన్నదనికూడ అనిపిస్తుంది.

ధర్మము—అర్థము—కామము—అనేవి లోకోపకారక విషయాలేకాని లోకానికి అపకారం కలిగించేవికావు. విద్వాంసులు,లోకకల్యాణానికై శ్రమించి ఆనందించేవారై ఉంటారు. అందుచే ధర్మముతో అర్థముతో కూడినదై కామాన్ని వివరించే యీ శాస్త్రరచనవల్ల నాకు కలిగే అపకీర్తి ఏమీలేదు. యీ విషయాన్ని బాగా మథించి ఆలోచించినమీదటనే నేను గంటంపట్టేను.

లోకంలో ప్రాణుల కెవరైనా ఏవిధంగానైనా ఉపకారంచేస్తే- అది నన్ను పూజించి గౌరవించడంగాను, ఏ ప్రాణికైనా అపకారం ఎవరైనాచేస్తే అది నా పరాభవంగాను భావించే స్వభావం కలవాడను నేను. నా మతంకూడ అట్టిదే. నాయొక్క సుఖదుఃఖాలు లోకంలోని ప్రాణివర్గమందు నిహితులై ఉన్నాయి.

అందుచే ప్రాణివర్గానికి సుఖించే విధానాన్ని విశదీకరించే నాయీ నాగర సర్వస్వరచనం నాకూ, నామతానికీ ఉపకారకమైనదేకాని, విరుద్ధమైనదీ, అపకారం చేసేదీకాదు.

* * *

# అలంకరణము - ఆవశ్యకత

కామం చాలా సున్నితమైన గుణం. అది మనస్సుయొక్క లోపలి పొరలలో జనించేదై ఉంటుంది. పురుషుడుకాని, స్త్రీకాని ఎవరైనా కామించి వారి అనురాగాన్ని సంపాదించదలచినపుడు—తమచే ప్రేమింపబడే ఆజనంయొక్క మనస్సులో తమ విషయమై ఒక సుముఖత ఏర్పడేలా వర్తించవలసినవారవుతారు. ఆ ఎదిరిమనస్సులోని సూక్ష్మ సూక్ష్మభావాలనుకూడ గుర్తించి వానికి అనుకూలమైన వేషభాషాదికాన్ని అలవరచుకొనవలసి వుంటుంది.

అసహ్యము-మలినము అయిన వేషముకలవాని హృదయంలో అమృతంవలె స్వచ్ఛమైన ప్రేమ నెలకొనివున్నా వానిప్రేమ తిరస్కరింపబడుతుందేకాని ఫలించదు. అందుచే స్వచ్ఛమైన వేషధారణం అందరకూ మిక్కిలి అవసరం.

అందులోనూ నాగరకులై మిక్కిలి ప్రజ్ఞా విశేషాన్ని గడించి-ఏ పని అయినాసరే సుందరంగా కళాత్మకంగా ఆచరించే స్వభావంకలవారై-ధనవంతులై-సౌందర్యంకలవారై-మదవతులైన పడతుల అనురాగాన్ని సంపాదించి, ఆ అలభ్య సుందరీసంయోగ పారవశ్యంలో సుఖిద్దామని వువ్విళ్ళూరేవారు-తమ శరీరాలంకరణ విధానంలో మిక్కిలి యెక్కువ ఆసక్తి చూపవలసి వుంటుంది. అలాకాక శరీరాలంకరణాలో స్వచ్ఛవేషధారణలో అశ్రద్ధ చూపితే అట్టి నాగరకులైన యువతులు వారిని కన్నెత్తికూడ చూడరు.

నాగరకులైన స్త్రీ పురుషులు కాలానుగుణములైన స్వచ్ఛవస్త్రాలను ధరించాలి. వేసవియందు తాపం ఎక్కువగా వుంటుంది, అందుచే సన్నని పలుచని దుస్తులు, ధరించే వానికేకాక చూచేవారికి కూడ తృప్తిని కలిగిస్తాయి. వర్షఋతువులో పరిమితములైన దుస్తులను ధరించడం మంచిది. చలికాలంలో ధరించే దుస్తులు కొంత ముదుకగా

వున్నప్పటికి బాధలేదు. కాని ఏ కాలంలో ధరించే దుస్తులైనాసరే స్వచ్ఛంగా వుదుక బడ్డవై వుండాలి.

కేవలం ఇలాంటి దుస్తులతో మాత్రమే కాక నాగరకులు నానారత్నాలతో నిండిన సముచితమైన ఆభరణ సముదాయముతోడను, మంచి సువాసనలు వెదజల్లే సుందర పుష్పాలతోడను కూడ తమ్ముతాము అలంకరించుకొనడం అవసరం. యీ ఆభరణాలు, పూలమాలలు శరీర సౌందర్యాన్ని ఇనుమడింపజేసేవై వుంటాయి. రత్నహారాలచే కంఠము పుష్పమాలలచే కేశపాశము, కనకకంకణాలచే కరయుగ్మము అందాలు చిందే ఎదిరిచూపులను మనస్సును ఆకర్షిస్తాయి.

అత్తరు, పన్నీరు మొదలగు పరిమళ ద్రవ్యాలను సముచితముగా వుపయోగించడంకూడ నాగరకులకు అవసరం. ఎల్లపుడు ఏదో ఒక మంచి సువాసనా ద్రవ్యం అలదుకొని నలుగురిలోనికి ఎవడైనావస్తే ఆ సువాసనాద్రవ్యం కారణంగా అక్కడవున్న జనంయొక్క చూపులు అనుకోకుండా అతని వంకకు మళ్ళుతాయి. "ఎక్కడిదయ్యా! ఈ సువాసన!" అని ఓహో! ఇతడా! అందుకే యీ ఘుమఘుమ!" అని అంటూ వారాతనిని సాదరంగా ఆహ్వానిస్తారు.

అందుచే అత్తరు, పన్నీరు, కర్పూర తాంబూలము-వీనిని నాగరకులు తప్పక సేవించవలసి వుంటుంది. ఇక శరీరంయొక్క చర్మంమీద విశేషించి మొగంమీద పూసుకొనే అంగరాగాలు (పౌడరు, పెదవి రంగు మొదలుగునవి) విషయంలోకూడ నాగరకులు అశ్రద్ధ చూపకూడదు. మేలైన అంగరాగద్రవ్యాలను ఎంచి జాగ్రత్తచేసి తగినట్లుగా వానిని వుపయోగించడంవల్ల చర్మసౌందర్యము, ముఖసౌందర్యము ఇనుమడిస్తాయి. యీ అంగరాగద్రవ్యాలను వుపయోగించకపోతే ముఖమందు శ్రమలక్షణమైన జిడ్డుతోకూడిన చెమట ఏర్పడివున్న సౌందర్యానికికూడ లోపం కలిగిస్తుంది. యీ కారణంచే నాగరకజనం శరీరాలంకారానికై ఉపయోగించే సర్వవస్తువులను నిత్యము ఉపయోగిస్తూండాలి. అలా కానినాడు వారికి నాగరకులతో గౌరవం లభించదు.

ఇలా కేవలం శరీరాన్ని అలంకరించుకొనడమే కాక నాగరకులు తమ నివాసాలనుకూడ సుందరంగా అలంకరించి స్వచ్ఛంగా ఉంచుకొనాలి. ఏమంటే తాము ప్రేమించేజనం అనుకోకుండా తమయింటికి రావడం జరిగితే—తమ నివాసం కశ్మలంగా మలినంగాఉంటే— తమ వేషం కారణంగా వారిమనస్సులో ఏర్పడుతూన్న సుముఖత కాస్తా నశించిపోతుంది. ఏమంటే— "ఇతడు బయటకు వచ్చినపుడు కొంచెం అలంకరించు కొంటాడేకాని ఇంటిదగ్గఱ గొడ్డులా ఉంటాడు. ఛీ! ఛీ! యీ యింటిలో ఎలా ఉంటున్నాడు? ఏ వస్తువుకూ తీరూ తెన్నూ లేదు. ఇలాంటి మలిన ప్రదేశాలలో ఉండేవాని మనస్సుకూడ మలినంగానే ఉంటుంది. నేనేదో మంచివాడు, అందంగా—నాజూకుగా ఉన్నాడనుకొన్నాను. వీని అసలు రూపం ఈ ఇంటిలోని వస్తువులను చూస్తే తెలుస్తోంది. చాలు వీనితోడి స్నేహం"—అన్న భావం వారి మనస్సులో కలుగుతుంది.

అందుచే నాగరకజనం తమ నివాసాన్ని సుందర వస్తునిచయంతో చూపరదృష్టిని ఆకర్షించేలా అలంకరించాలి. వీణ–వేణువు–మృదంగము మొదలగు వస్తులను గృహంలో సముచిత స్థానంలోవుంచాలి. అవి దృష్టిని ఆకర్షిస్తాయి. తాము ఎవరి అనురాగాన్ని వాంఛిస్తున్నారో వారే తమయింటికి తలవని తలంపుగా వచ్చి—వీనిని చూస్తే వారిమనస్సులో రేఖామాత్రంగా వున్న సుముఖత పెరుగుతుంది. "కేవలం వేషమే అనుకొన్నాము. ఇల్లుకూడ చూడముచ్చటగా వున్నది. ప్రతి వస్తువూ చక్కగా వుండవలసినచోటవున్నది. వీణ–వేణువు–మృదంగము కనబడుతున్నాయి. వానియందుకూడ ఇతనికి ప్రవేశంఉన్నది. కాబోలు. ఒకవేళ ప్రవేశం లేకపోయినా ఆకళ (సంగీతము) అంటే ఇతనికి మంచి ఆసక్తి అయినా వుండివుండాలి. లేకపోతే ఇవి ఇక్కడ ఎందుకుంటాయి.! ఏమో అనుకొన్నాను. మొత్తానికి ఇతడు మంచి రసికుడే!—"అన్న భావం వారి మనస్సులో కలుగుతుంది."

ఇంటిలో అవసరమైన పాత్రలు మొదలుగునవి ఎలాగా ఉంటాయి. అవికూడ సుందరంగా ఉండేలా చూచుకొనాలి. ఇంటి యొక్క ప్రతి ద్వారానికి రంగురంగు వస్త్రాలతో పరదాలు ఉంచడం కూడ అవసరం. అవి గృహంయొక్క అందాన్ని ఇనుమడింపజేస్తాయి.

గోడలను వ్రేలదీయబడిన చిత్రాలను అందమైన పూలమాలలతో అలంకరిస్తూండడం, గృహాన్ని అగరు ధూమంతో సువాసనా వాసితం చెయ్యడంకూడ అవసరం.

నాగరకులు తమ యింటిలో వ్యాయామ సాధనాలనుకూడ జాగ్రత్తచేసి ఉంచుకొనాలి. ఏమంటే అవి నిత్య వ్యాయామానికి ఉపయోగిస్తూ శరీరారోగ్యాన్ని కాపాడుతూ వుండడమేకాక చూపరకు–"ఇతడు కేవలం పిండి బొమ్మ కాడు. శరీరంలో తగినంత పిండి వున్నవాడే"—అన్న భ వం కలిగిస్తాయి.

గృహంలోని ఆసనాలు, మంచాలు చిత్రచిత్రాలంకారాలతో తేజరిల్లేలా చూచుకొనాలి. మంచాలు, కుర్చీలు కంపించే లక్షణం కలవి (స్ప్రింగు ఇచ్చేవి) అయివున్నప్పుడు—చూచేవారిని అవి వెంటనే ఆకర్షిస్తాయి, అంతేకాదు—ఆ వచ్చిన వారి మనస్సులో ఆ స్ప్రింగుమంచంమీదనో లేక కుర్చీమీద ఒకసారి కూర్చోవాలన్న కోరికకూడ కలుగుతుంది. ఆ వచ్చినవారి అనురాగాన్నే కోరియుత్సించేవాడైనప్పుడీ నాగరకుడు వారిమనస్సులోని కదలికను కనుపెట్టి ఆదరంగా–"కూర్చో! కూర్చో! బాధలేదు" అంటూ వారిని అందు కూర్చుండబెట్టి వారి మనస్సులోని అనురాగానికి దోహదం చెయ్యడానికికూడ వీలుకలుగుతుంది.

ఇక ఇంటి ముంగిలియందు, పార్శ్వభాగములయందు సుందర పుష్పవృక్షాలను, చిన్న జలాశయాలను (ఇప్పుడు ఫౌంటైన్) ఏర్పరచుట ద్వారాకూడ ఇంటియొక్క అందం పెరుగుతుంది. చిలుకలు, పావురములు మొదలగు మధురంగా కూసే పక్షిజాతులు తమ గృహ ప్రాం

గణంలో నిరంతరం విహరించే ఏర్పాటుకూడ నాగరకులు చెయ్యవలసి ఉంటుంది.

ఈ అన్నిటివలన ఆ నాగరకుని నాగరకతా లక్షణం వ్యక్తమై సర్వుల హృదయాలలోను అతడంటే ఒక ప్రత్యేకభావం ఏర్పడుతుంది. అయితే ఈ అలంకరణం అంతా తాను ఎవరినో మిక్కిలి నాగరకురాలైన వనితను ప్రేమించనారంభించి, ఆమెయొక్క అనురాగాన్ని సంపాదించగోరి అప్పటికప్పుడు యత్నిస్తే సాధ్యంకాదు. తనను ఇంటిని అలంకరించుకొనడం నాగరకుని లక్షణం. ఆలక్షణమే అవసరమైనప్పుడు నాగరక వనితానురాగసంపాదనానికికూడ తోడ్పడుతుంది.

## రత్నాలు - సుగంధాలు :

బాగా ధనవంతులైనవారు కేవలం బంగారు నగలనేకాక రత్నాభరణాలనుకూడ ధరిస్తారు. అవి వారిసౌందర్యాన్ని పెంచుటయే కాక నలుగురిలో వారికొక ప్రత్యేక గౌరవం కలిగింపజాలినవి అవుతాయనడంలో సందేహంలేదు. కాని గుణదోషపరిశీలన చెయ్యకుండా జాతి రత్నాలను ధరిస్తే అందంమాట దేవుడెరుక, ఆపదలు ముంచుకొనివస్తాయి. అందుచే ప్రాస్తావికంగా ఇక్కడ జాతిరత్నాల గుణదోషాలు సంక్షేపంగా చెప్పబడుతూన్నాయి.

దోషంగల రత్నాన్ని ఎవరైనా తెలియక ధరిస్తే అతనికేకాదు, అతని సన్నిహిత బంధువులకుకూడ ఆపదలు కలిగే సావకాశంవున్నది. అట్టి దోషయుక్తములైన రత్నాలను ధరించడంవల్ల కారాగార ప్రవేశము (జైలుశిక్ష) ఏదో తెలియబడని వ్యాధిపీడ—బంధుమరణం—ధననాశనం వంటి విపత్తులు కలుగుతాయి. అందుచే రత్నాల గుణదోషాలు తెలిసికొనడం అవసరం.

రత్నం తగినంత బరువుకలదై—మంచి కాంతికలదై—నున్నగా—స్వచ్ఛంగా—సమంగా ఉంటే అది ఉత్తమ రత్నం అనబడుతుంది. ఇట్టి రత్నాలను ధరించడంవల్ల మేలు కలుగుతుంది.

అలాకాక రత్నం తగినంత బరువులేక తేలికగావుంటే అది వుత్తమ రత్నంకాదు. కాంతి కలదైనప్పటికి రత్నంలో ఎక్కడైనా చిన్న చుక్క లేక మచ్చ ఏర్పడిఉంటే అది దుష్టరత్నమే అవుతుంది. గీరలున్న రత్నాలు, పగిలిన రత్నాలు, నున్నగాకాక ఎగుడు దిగుడుగా వున్న రత్నాలు, కాకికాలువంటి రేఖలుగల రత్నాలు ఉత్తమ రత్నాలు కావు. ఈలక్షణాలలో ఏ ఒక్కలక్షణమున్నా సరే ఆరత్నాన్ని ధరించ కూడదు. వీనిని ధరించడం ఆపదలను కొని తెచ్చుకొనడమే అవుతుంది. రత్నశాస్త్రంలోకూడ (గుణవద్గుణ సంపదాం ప్రసూతి ర్విపరీతం వ్యసనోదయస్య హేతుః) "ఉత్తమమైన జాతిరత్నం గుణసంపదలను ప్రసాదిస్తే దోషయుక్తమైన దుష్టరత్నం ఆపదలను తెచ్చిపెడుతుంది" అని చెప్పబడినది.

లోకంలో అధికంగా వజ్రము-ముత్యము-పద్మరాగము-ఇంద్రనీలము-మరకతము-వైడూర్యము ధరింపబడుతూ వుంటాయి.

వజ్రం కత్తి పదునువంటి పదునుకలదై వెడల్పుగా వుంటే ఉత్తమంగా భావింపబడుతుంది. ఆ పదును, వెడల్పా అన్నవి ఎంత ఎక్కువగా ఉంటే అది అంత వుత్తమమైనదని గ్రహించాలి.

ముత్యం ముత్యపు చిప్పనుండి లభిస్తుంది. అది నున్నగా గుడ్రంగావుండి తెల్లగా మెరుస్తూంటే వుత్తమమైనదిగా తలచాలి. నున్నదనము, గుండ్రదనము తెల్లని కాంతి అనేగుణాలు ఎంత ఎక్కువగా వుంటే అది అంత వుత్తమమైనదని గ్రహించాలి.

పద్మరాగమనబడే రత్నం బంధూక పుష్పమువలె, (మంకెన పూవు) మగకోకిల కనుగుడ్డువలె, గురివెందపూసవలె మెరస్తూంటుంది. ఇట్టికాంతి తగినంతవుండి బరువు-నున్నదనము-స్వచ్ఛత్వము-సమత్వము అనే గుణాలు కలదై వెనుక చెప్పిన దోషములు లేకుండావుంటే అది వుత్తమ పద్మరాగంగా భావించదగినది.

ఇంద్రనీలమనబడే రత్నం నీలిరంగునీళ్ళలో ఒక బుడగ (నీటి బుడగ) తేలితే అది ఎలా మెఱుస్తూ వుంటుందో అలామెరసేదై ఉంటుంది. ఇట్టి మెరుపు ఇతరముల్లైన గుణాలు కలదైనపుడు దానిని శ్రేష్ఠమైన ఇంద్రనీలంగా భావించాలి.

మరకతమనబడే రత్నం మిణుగురు పురుగు వీపువలె (దానివీపు మెరిసే చిక్కని ఆకుపచ్చరంగు కలదై వుంటుంది.) క్రొత్తగా మొలచిన గడ్డివలె. నీటిలో తేలియాడే నాచువలె మెరుస్తూంటుంది. ఇట్టి మెరపు ఎక్కువగా కలిగివుండి చెప్పబడిన దోషములు ఏవీలేని రత్నాన్ని వుత్తమమరకత రత్నంగా భావించాలి.

వైడూర్యాలనబడే రత్నాలలో కొన్ని నెమలి మెడవలె ప్రకాశిస్తాయి. కొన్ని వెదురుపొదయొక్క ఆకువంటి కాంతికలవై వుంటాయి. ఇవి రెండూకూడ వుత్తమమ్మైనవే. దోషరహితంగా చూచుకొని ఇట్టి వైడూర్యాలను ధరించవచ్చును.

రత్నాలు—అవి లభించే గనులనుబట్టి, వానిరంగునుబట్టి ఎన్నో రకాలుగా ఉంటాయి. ఇక్కడ ప్రాస్తావికంగా కొన్ని ముఖ్యమైన వానినిగూర్చి మాత్రం వివరించడం జరిగింది.

రత్నాలవలెనే నాగరకజనం తాము ఉపయోగించే సుగంధ ద్రవ్యాలనుకూడ విలక్షణంగా, వుత్తమంగా వుండేటట్లు చూచుకోనాలి. పూర్వం ఈ సుగంధ ద్రవ్యాలను ఇంటిలోనే తయారు చేసుకోనేవారు. కాని క్రమంగా అట్టి అలవాటు తొలగి సుగంధ ద్రవ్యాలను కొన్ని ప్రత్యేక సంస్థలవారు తయారుచేసి విక్రయిస్తే కొని వుపయోగించే సంప్రదాయం ఏర్పడ్డది. అందుచే వానియొక్క నిర్మాణ విధానం ఇక్కడ వివరింపబడడంలేదు.

నాగరకులు తాంబూలమునందు సుగంధ ద్రవ్యాలను వినియోగిస్తూనే వుంటారు. స్నానం చెయ్యడానికి పూర్వం శరీరాన్ని నలుచుకొనే నలుగుపిండి, తలకు రాసుకొనే నూనె, స్నానార్థమైన జలమూ

కూడ సువాసనాభరితమై వుండునట్లు చూచుకోవాలి. నోటియొక్క దుర్వాసనను హరించి సువాసన కలిగించే ద్రవ్యాలను, చంకలయందేర్పడే చెమట వాసనను హరించే సామర్థ్యం కల ద్రవ్యాలనుకూడ వారు వుపయోగించాలి. మంచి సువాసనగల అగరువత్తులను ఆ త్తరులను వారువుపయోగిస్తూ వుండాలి. ఇవన్నీ నాగరకతా లక్షణానికి మెరుగులు దిద్దుతాయి.

## భాషా సంకేతములు

నగరాలలో నివసించే చతురులైన వనితలు పురుషుని యందెన్ని గుణాలు, ఎన్నిరకాల కళానైపుణ్యాలు వున్నాసరే—తామొక వక్రోక్తిని, ఒక గూఢార్థాల్ని, ఒక సంకేతార్థాన్ని చెప్పినపుడు గ్రహించలేనివాడైతే తిరస్కరిస్తారు. అలాంటి పురుషుణ్ని వారు వాడిపోయిన పూలదండలా విడిచి పెడతారు. వారి గూఢార్థ వాక్యాలు ఎలా ఉంటాయో తెలిసికొనడానికి ఒక ఉదహారణం.

శ్లో॥ వాణిజ్యేన గతస్సమే గృహపతి ర్వార్తాపి నశ్రూయతే
ప్రాత స్తజ్జననీ ప్రసూతతనయా జామాతృ గేహంగతా
బాలాహం నవయౌవనా నిశకథం స్థాతవ్యమస్మిన్ గృహే
సాయం సంప్రతి వర్తతే పథిక హేస్థానాంతరం గమ్యతాం।

ప్రయాణ సాధనాలు లేని ప్రాచీన కాలంలో ప్రయాణం కాలి నడకనే సాగించవలసివచ్చేది. ఎక్కడ చీకటిపడితే అక్కడ ఎవరియింటనో తలదాచుకొని రాత్రివేగించి తిరుగప్రయాణం చేయవలసిఉండేది.

అలాంటి వెనుకటి రోజులలో ఒక యువకుడైన బాటసారి సాయంకాలానికి ఒక గ్రామానికి చేరుకొన్నాడు. ఈ రాత్రి ఎక్కడ గడిపెదా అన్న ఆలోచనలో ఉన్నాడు అలా ఆలోచిస్తూ అతడొక యింటినడవలో అడుగుపెట్టాడు. ఎవరో వచ్చిన అలికిడివిని ఆ యింటిలోనుండి ఒక మదవతియైన నవయువతి బయటకువచ్చి నడవలో నిలచియున్న నవయువకుడైన బాటసారిని పరికించిచూచింది. చూచీ చూడ

గానే ఆమె—అతడెవరో బాటసారి అనీ, రాత్రిగడపే ఉద్దేశంతో వచ్చాడని గ్రహించింది. అయితే అతని రూపం చూచినమీదట ఆమెలో ఏవో వింత ఆలోచనలు రేకెత్తాయి. ఆమె పల్లెపట్టున నివసిస్తూవున్నా నాగరకత నెరిగిన యువతి. అందుచే తనకోరికను స్పష్టంగా చెపితే ఎవరైనా గ్రహిస్తారనుకొని ఇలాఅన్నది.

"ఏమయ్యా! నీవుచూస్తే బాటసారివిలా వున్నావు. సాయంకాలం అయింది. చీకటి పడుతూన్నది. కనుక ఇక్కడ తలదాచుకొందామని వచ్చివుంటావు. కాని ఇక్కడ నాపరిస్థితి నీకు తావియ్యడానికి అనుకూలంగాలేదు. ఏమంటావా? నా భర్త వర్తకం చెయ్యడానికి దూరదేశాలకు వెళ్లేడు. ఎక్కడ వున్నాడో ఎప్పుడు వస్తాడో అన్నవార్తైనా తెలియదు. ఇక యింటిలో పెద్దదిక్కుగా వున్న అత్తగారు కూడ ఈ రోజు వుదయమే కూతురుకు పురుడువచ్చినదన్న వార్తరావడంతో అల్లుని యింటికి వెళ్ళింది. నన్ను చూస్తున్నావుకదా! నేను నవయువతిని. ఒంటరిదానను. అందుచే ఈ రాత్రి నీవు మాయింటిలో ఎలా గడుపుతావు? నీవు వేరొకచోటుకు వెళ్ళడం మంచిది"—అన్నది.

"నా భర్త ఊరిలోలేడు. అత్తగారుకూడలేదు. నేను యువతిని భర్త చిరకాలమై దేశాంతరం వెళ్ళినందున కామార్తనై వున్నాను. ఈ రాత్రి యిచ్చట వసించి నన్ను స్వేచ్ఛగా అనుభవించు"—అన్నదే ఆమె మాటలలోని గూఢార్థం.

కాని ఆపథికుడు తెలివిలేనివాడై— ఆమె మాటలలోని సంకేతం తెలియనివాడై— వీలు లేదంటూన్నదికదా అని వెనుదిరిగి వేరొక చోటికి వెడితే ఆ పడతియొక్క తిరస్కారానికి పాత్రుడుకాక తప్పదు.

నాగరకులైన స్త్రీలయొక్క మాటలను అర్థం చేసుకొనడానికి ప్రత్యేకమైన తెలివివుండాలి. ఆ తెలివిలేనినాడు పురుషుడెంత యువకుడైనా ఎంత సొగసుకాడైనా యువతులచే పరిత్యజింపబడతాడు. అందుచే నాగరక వనితల అనురాగాన్ని సంపాదించగోరే పురుషుడు

వివిధ సంకేతార్థాలను నిల్లడించే ప్రాచీన కామశాస్త్రిలను చక్కగా అభ్యసించాలి. నాగరక సంకేతాలను వాని అర్థాలను వివరించే శాస్త్రిలు ఎన్నో ఉన్నాయి. వానియందు పరిశ్రమచేస్తే ఎట్టి సంకేతార్థమైనాసరే వివరంగా తెలిసికొనగల జ్ఞానం అనవడుతుంది.

"మా కెందుకీబెడద" అని ఎవరూకూడ సంకేతశాస్త్రిల విషయంలో నిరాదరణ చూపకూడదు. ఎందువల్లనంటే— అన్ని గౌరవాలు లభించినా అందగత్తెయైన నాగరక యువతి తిరస్కరించినపుడు పురుషుడు పొందే దుఃఖానికి మేర ఉండదు. అట్టి యువతీ తిరస్కార రూపమైన దుఃఖం కలుగకుండ వుండాలంటే ప్రాచీన సంకేత శాస్త్రిల యందు పరిశ్రమచేయడం అవసరం. అందుచే ఇక్కడ స్త్రీలయొక్క భాషా సంకేతములను—అంగ సంకేతములను—పోటలీ సంకేతములను—వస్త్ర సంకేతములను—తాంబూల సంకేతములను సంక్షేపంగా వివరించడం జరుగుతూన్నది. ఈ వివరణ వలన పురుషునకు స్త్రీయొక్క సంకేతార్థాన్ని విడదీసి తెలిసికొనగలశక్తి అలవడుతుంది. ఆ శక్తితో ఆతడు ఇందులో చెప్పబడని క్రొత్త సంకేతములనుగూడ విడదీసి అవగాహన చేసికొనగల వాడవుతాడు.

పురుషులకు ఫలము. స్త్రీకి పుష్పము సంకేతములై ఉన్నాయి, ఎవరి కులమునైనా ప్రశ్నించి తెలిసికొన దలచినపుడు "అంకురము" (మొలక) సంకేతముగా వుపయోగింపబడుతుంది. ఇక బ్రాహ్మణుని విషయంలో దానిమ్మపండు— క్షత్రియుని విషయంలో పనసపండు సంకేతములై వున్నాయి. అరటిపండు వైశ్యునకు, మామిడిపండు శూద్రునకు సంకేతాలు.

ఇలా కేవలం సంకేతాలను చెప్పుకొంటూ వెడితే వానిని వుపయోగించే విధానం తెలియక కొంతమంది పెదవి విరుస్తారు. అందుచే వాని వుపయోగ విధానంగూడ అల్పంగా చెప్పబడుతూన్నది.

అత్తగారు—బావలు— మరదలు— ఆడబడుచులు— తోటి కోడళ్ళు—ఇరుగు పొరుగువారు మొదలైన జనంయొక్క కట్టడులలో

వుంటూకూడ సంకేతశాస్త్రమునందు నిపుణ అయిన యువతి తాను కోరినవానిని కలిసి ఆనందించగలదవుతుంది. ఆమె వీరందరి యెదుటనే తన రహస్యం ఎరిగిన చెలికత్తెతో లేక దూతికతో— "ఏమే! నాకు ఏమీ తోచడంలేదు. నేనలా తోటలోనికిపోతున్నాను. ఈవేళ "దానిమ్మ పండు" తినాలని వున్నది. బజారుకుపోయి మంచి దానిమ్మపండు అలా తోటలోనికి తెచ్చిపెట్టు"—అని చెప్పడం జరిగితే— అక్కడ వున్నవారు ఆమె ఏదో దానిమ్మపండు తినాలనుకొంటోంది— అని తలుస్తారేకాని— తనకు ప్రియుడైన బ్రాహ్మణ యువకుని తీసికొని రమ్మంటూ వున్నదని, వానితో కలిసి ఏకాంతంగా తోటలో విహరించే తలపుకలదై ఉన్నదనీ. భావించలేరు.

ఇలా వివిధవిధానాలలో ఈ సంకేతాలను కాముకులు ప్రయోగిస్తూంటారు. సంకేతాలు ఇవే అయి ఉండాలన్న నియమంకూడలేదు. శాస్త్రంలో ఈ సంకేతాలు చెప్పబడ్డాయి. కాముకులు క్రొత్త సంకేతాలను సృష్టించుకొంటూ వుండటంకూడ లేకపోలేదు. ఏసంకేతమైనా పరస్పరం అవగాహనచేసికొనడానికి వీలుకలదై వుంటే బాధలేదు.

ఒకనాడు ఒక వేదపండితుడు భోజనంచేసిన తరువాత శిష్యుని పిలచి—ఏమిరా! బంధువును తీసికొని వచ్చేవా? అన్నాడు.

ఆ శిష్యుడు "లేదండీ"—అని సమాధానంచెప్పి పరుగెత్తిపోయి ఒక పావుగంటకు తిరిగివచ్చి ఒక పొగచుట్ట గురువుగారి యెదుట వుంచాడు.

ఆ పండితుడు—"అమ్మయ్య"—అని చుట్టనోటబెట్టి నిప్పు ముట్టించాడు. ఎదుట వున్నవారు—ఏమండీ! మీరు బంధువును తెమ్మంటే శిష్యుడు చుట్టతెచ్చాడేమిటి? అని ప్రశ్నిస్తే ఆ పండితుడిలా అన్నాడు.

"బాబూ! "బంధువు" అంటే "చుట్టము" అనికదా అర్థము! "చుట్టాలు, చుట్టములు, చుట్టలు"—ఇవన్నీ సమానార్థకాలు (రూపాంతరాలు) అందుచే కొంత గూఢంగావుంటుందని "బంధువును తెమ్ము"ని

నేనన్నాను. ఈసంకేతానికి శిష్యుడు అలవాటుపడ్డవాడే అయినందున నేనుకోరే పొగచుట్టను తెచ్చిపెట్టేడు. చదువుకొన్న పండితుడను. అందరియెదుట చుట్ట తెమ్మని ఎలాచెప్పను. అందుచే అలాచెప్పేను. అని నవ్వేడు.

కాగా లోకంలో సంకేతాలు ఈ తీరువనలో ఉంటాయని తెలిసికొనాలేకాని నియతంగా అవేసంకేతాలు వుంటాయని తలంపకూడదు.

రాజపుత్రుని విషయంలో 'విదియ చంద్రుడు' సంకేతంగా వాడబడతాడు. పుణ్యమినేలే ప్రభువుకు నీడనిచ్చే పెద్ద మేఘము సంకేతమై యున్నది.

"ఏమే! చెలీ! నిన్న చెఱువుకు వెళ్లేను. అక్కడ పొదరింట కూరుచున్నాను. ఇంతలో ఒక పరమ సుందరమైన మేఘం ఆకాశం మీద కనుపించింది. ఆ మేఘంయొక్క నీడ చెఱువుమీద, పొదరింట మీద, నామీదకూడ పడ్డది. ఆ మేఘచ్ఛాయలో ఉన్న సమయం తక్కువే అయినా నాకేమిటో విలక్షణమైన ఆనందం కలిగింది. ఆ మేఘాన్ని తలచుకొంటే ఇప్పుడుకూడ మనస్సు పరవశం అయిపోతూన్నది మళ్ళా ఆ మేఘచ్ఛాయలో ఆనందించాలని వున్నది."—— ఇత్యాదిగా ప్రభువుతో తాను అనుభవించిన ఆనందము, తిరుగ అనుభవించాలన్న కోరిక 'మేఘచ్ఛాయను' అడ్డంగాపెట్టుకొని నెరజాణ అయిన నాగరిక కామిని జంకుబొంకులు లేకుండా వెల్లడిస్తుంది.

దుష్టమైన వంశంలో పుట్టినవాని విషయంలో నల్లని పుష్పము సంకేతముగా వుపయోగింపబడుతుంది.

దుష్కులంలో పుట్టినవానిని నాగరకవనిత కామించదుకదా! వాని విషయంలో ఒక సంకేతం ఎందుకు? అనిపిస్తుంది. కాని దాని అవసరంకూడ వున్నది.

సాధారణంగా పురుషుడు తన భార్యను ఎవడో కామిస్తున్నాడని తెలిసినప్పుడు వానినెత్తురు కళ్ళజూచే వరకు శాంతించలేని తత్త్వంకలవాడై వుంటాడు. ఒక నాగరక యువతి ఒక దుష్టుని ప్రేమించకపోవ

చ్చును. కాని ఒకదుష్టుడామె పొందుగోరి ఉచ్చులు పన్న వచ్చునుకదా ఆ విషయం ఆమెకు ఇష్టంకాదు. అలాఅని భర్తతో చెబితే పెద్దరగడ అవుతుంది. అందుచే ఆమె తనకు ఇష్టంకానిదైనప్పటికి ఇట్టి విషయాలను గూఢంగా దాచే స్వభావంకలదై వుంటుంది. అందుచే దుష్టునకు కూడ సంకేతం అవసరం అయింది.

"చెలీ! చెరువుగట్టుమీద ఎప్పుడు చూచినా ఏవో నల్లని పువ్వులే వుంటాయి. ఆ పువ్వులంటే నాకు మిక్కిలి అసహ్యము. కాని ఎప్పుడు చెరువుకువెళ్ళినా అవి కంటబడుతూనేవున్నాయి— ఇత్యాదిగా ఈ సంకేతం వినియోగింపబడుతుంది.

సామంత రాజపుత్రుని విషయంలో 'సరస్సు' సంకేతంగా చెప్పబడ్డది.

"నీవు మేఘచ్ఛాయనుచూస్తే ఆనందిస్తావు. నాకు సరోవరాన్ని తిలకించాలని ఉంటుంది"—ఇత్యాదిగా పుడమినేలే రాజును ప్రేమించిన వనితతో సామంత రాజకుమారుని పొందుకై తహతహపడే తరుణి సాంకేతికంగా మాటాడుకొనడానికి ఈ సంకేతం వినియోగపడుతుంది.

ఇక స్త్రీల విషయంలో పుష్పము సంకేతముగా వినియోగింపబడుతుందని వెనుక చెప్పబడ్డది. ఏజాతి స్త్రీ విషయంలో ఏపుష్పాన్ని సంకేతంగా ఉపయోగించాలి. అన్న విషయము వివరింపబడుతోంది.

బ్రాహ్మణ స్త్రీ విషయంలో కుంద పుష్పము (మొల్లపూవు) రాజపుత్రిక విషయంలో మాలతీపుష్పము, వైశ్యవనితా విషయంలో మల్లెపూవు, శూద్రవనితకు తెల్లకలువపూవు సంకేతములై వున్నాయి.

కాముకులైన నాగరక జనం ఈ సంకేతాలతో గూఢంగా తమ మనోభావాన్ని వ్యక్తంచేస్తూ వుంటారు. తాను వలచిన ప్రియురాలు ఏ దేవాలయమునకో, చెఱువుకో ఉద్యానవనమునకో పరివారంతో కలసివచ్చినపుడు, వారందరి యెదుట తాను వెల్లడిగా మాటాడకూడదు గనుక—తన పక్కనున్న స్నేహితునితో— "పూవు లన్నిటిలోను

మాలతీ సౌందర్యమే సౌందర్యం. వికసించిన యీ మాలతీ పుష్పాన్ని చూస్తూంటే నాకు నిద్ర, ఆహారము అక్కరలేదు. మాలతీ పుష్పాన్ని గుండెపై ధరించి యేకాంతముగా దాని సౌందర్యాన్ని ఆలోకించే భాగ్యమే లభిస్తే నాకు లోకముతో పనిలేదు. నేను సర్వాన్ని మరచి మాలతీ సౌందర్యాన్ని ఆరాధిస్తాను"— ఇత్యాదిగా ఈ సంకేతాలు వినియోగింప బడుతూంటాయి.

పెద్ద వర్తకుని కూతురు విషయంలో తామరపూవు, మంత్రి కూతురు విషయములో నల్లకలువపూవు సంకేతములై వున్నాయి. కాముకుడైన పురుషునకు తుమ్మెదయున్ను, కామినియైన యువతి 'మామిడిపూలగుత్తి' సంకేతములై ఉన్నాయి.

"ఉద్యాన వనంలోని దిగుడుబావిలో నల్లకలువపూవు ప్రక్క ఒక తామరపూవు వికసించి వుండడం నిన్నచూచేను. అవి జంటగా ఒక దానినొకటి ఒరసుకొని కదలి ఆడుతూంటే గండుతుమ్మెద ఎక్కడ నుండి వచ్చినదో కాని ఒకసారి కలువమీద, ఒకసారి తామరపూవు మీదవ్రాలి తేనె త్రాగసాగింది. యీదృశ్యం నిన్నచూచేను. ఆ గండు తుమ్మెద వ్రాలినంతనే ఆ తామరపూవు కలువపూవు ఎంతో అందంగా కదులుతూ దానికి తమ హృదయంమీద చోటిచ్చాయి"— ఇత్యాదిగా మంత్రి కుమారికయొక్క విహారాన్ని వుద్దేశించి యీసంకేతాలు వుపయోగింపబడతాయి.

"వికసించిన యీ చూతమంజరి (మామిడిపూవులగుత్తి) మీద గండుతుమ్మెద వ్రాలినపుడే యీగుత్తి తుమ్మెదకై ఎదురుచూస్తోంది" ఇత్యాదిగా కామినులైన స్త్రీలనుద్దేశించి చూతమంజరీ సంకేతము, కాముకులైన పురుషులనుద్దేశించి తుమ్మెదయొక్క సంకేతము వుపయోగింపబడతాయి.

ఒక కాముకు డొక వనితను కలియగోరినపుడు— ఆతనితోడి కలయిక ఆమెకిష్టమైనప్పటికి— "తగిన సమయంకాదని, నీవు నన్ను కలియు

టకు రావద్దని" సూచించడానికి 'ప్రాకారము' (గోడ) సంకేతముగా వినియోగింపబడుతుంది.

ఇది ముద్రారూపంలోకూడ చూపబడుతుంది. అనగా ఏ దేవాలయ ప్రాంగణములోనో ప్రియుడు తన వంకకుచూచి, తనతో కలియవలెనన్న కోరికను గూఢంగా చేష్టలద్వారా వ్యక్తపరిస్తే—తగిన వెసులుబాటు లేదని తలంచిన కామిని ప్రాకారముద్రను (రెండు చేతులవ్రేళ్ళను చాచి ఒకదానితో ఒకటి కలిపి గోడయొక్క ఆకారమును కల్పించుట( ప్రదర్శిస్తే ఆ కాముకుడు–ఇది తగిన సమయంకాదని, అడ్డంకులున్నాయని గుర్తించాలి.

ఇక—'నీవు రావచ్చును, నన్ను కలియవచ్చును, నీకు అడ్డములేదు అని సూచించడానికి 'అంకుశమును' (ముద్రారూపంలో కూడ) సంకేతముగా ఉపయోగిస్తారు.

చేతివ్రేళ్ళలో నడిమి వ్రేలినిమాత్రం చాచి–దానికి ఒకప్రక్కగా ఉన్న చూపుడు వ్రేలిని సగానికి మడచి ఉంచితే అది అంకుశముద్ర అనబడుతుంది♦

ఇట్టిదైన అంకుశముద్రాసంకేతాన్ని నాగర జనం పదుగురిలో ఉన్నప్పుడుకూడ ప్రియుని ఆహ్వానించడానికి వినియోగిస్తారు.

తన్ను కలియదగిన సమయం రాత్రివేళ అయితే దానిని తెలుపుటకు 'ఘన్నచంద్రుడు' (మబ్బుచాటు చంద్రుడు) అలాకాక పగటిభాగమే అయితే 'బాగా ప్రకాశించే సూర్యుడు'—సంకేతాలుగా వినియోగింపబడతారు.

ఈ సంకేతాలు చేతివ్రేళ్ళతో అభినయించే ముద్రలద్వారాకాని చిత్రాలద్వారాకాని ఉపయోగింపబడతాయి.

ఇక తన్ను కలియవలసిన సమయం జాములలో సూచింపవలసి వచ్చినపుడు వానికి వేరే సంకేతాలు ఉన్నాయి. సూర్యోదయం

♦ ఋజ్వాం చ మధ్యమాం కృత్వా తన్మధ్యే పర్వమూలతః
తర్జనీం కించి దాకుంచే త్సాముద్రాంకుశ సంజ్ఞితా।

మొదలు తిరుగ సూర్యోదయం అయ్యేవరకు ఉన్న కాలం 24 గంటలు కదా! ఈ కాలాన్నే ఎనిమిది జాములుగా విడదీస్తారు. అందుచే జాముఅంటే మూడు గంటలకాలం అవుతుంది.

ఈ జాములలో మొదటి జామునకు– 'శంఖము,' రెండవ జాము నకు–'మహాశంఖము', మూడవ జామునకు– 'పద్మము' నాల్గవ జాము నకు– 'మహాపద్మము' ఐదవ జామునకు–'రాముడు' సంకేతాలుగా విని యోగింపబడతాయి.

ఆరవ జామునకు—'విరామశబ్దము' ఏడవ జామునకు– 'ప్రవర శబ్దము' ఎనిమిదవ జామునకు–'ప్రత్యూష శబ్దము' సంకేతాలుగా నాగ రజనం ఉపయోగిస్తారు.

" ఓ తుమ్మెదా! విరామ సమయంలో (రాత్రి 9–00 గం. దాటిన మీదట 12 గం॥ల వరకు) నల్ల కలువపూవులోని మాధుర్యా లను (మంత్రికుమారికయొక్క సొగసులను) అనుభవిస్తూ–ప్రవర సమ యాన్ని (రాత్రి 12 గం. మొదలు 3 గం. వరకు)కూడ అక్కడే గడపి ప్రత్యూష సమయానికి (తెల్లవారు జాము 3 గంటలు దాటిన మీదట సూర్యుడుదయించేవరకు ఉన్న కాలం) మాలతీ కుసుమం మీదకు (రాజ కుమారి) వచ్చి వ్రాలిన నీ రసికత కొనియాడదగినది"– ఇత్యాదిగా ఈ సంకేతాలు వినియోగింపబడతాయి.

---

## అంగసంకేతములు

వెనుక ప్రకరణంలో భాషాసంకేతములు వివరింపబడ్డాయి. అవి యెంత సాంకేతికంగాఉన్నా వానిని ఉపయోగించడానికి కొంతవీలుచిక్కి తేకాని కుదురదు. ఏమంటే– సందర్భం ఏమీ లేకుండా–ఓ తుమ్మెదా! నీ రాకకై ఈ మాలతీ పుష్పం ఎదురుచూస్తోంది.'– అనడం కుదురదు కదా! అదీకాక కేవలం ఆ భాషా సంకేతాలవల్ల కొంత పరిమితమైన

కార్యం మాత్రమే నెరవేరుతుంది. ప్రియుడుకాని, ప్రియురాలుకాని ఎదుటబడినప్పుడు మాటాడవలసినవి ఎన్నో వుంటాయి.

చిరకాలానికి ప్రియుడు కంటబడినపుడు ముందు— "కులాసాగా ఉన్నావా? నేను కులాసాగానే ఉన్నాను" ఈ మొదలైన కుశల ప్రశ్నలు ఏమీలేకుండా—"నేను నిన్ను కలియగోరుతున్నాను, ఫలానా సమయానికి రావలసినది"— ఇత్యాది విషయాలను సాంకేతికంగా చెప్పినా, అది నాగరకత అనిపించుకోదు. అందుచే భాషా సంకేతములేకాక ఇతర సంకేతములుకూడ అవసరం అయ్యాయి.

శరీరంలోని అవయవాలతో చేయబడే సంకేతాలనే అంగ సంకేతాలు అని అంటారు.

'చిరకాలానికి ప్రియుడు కనిపించాడు— కాని అతడు పదుగురిలో ఉన్నాడు—కులాసాగా ఉన్నావా? అని అడగాలని ఉన్నది.— కాని అందరియెదుట అలా ప్రశ్నిస్తే నవ్వుతారు— ఆ ప్రియుడుకాక భర్త కాక పరపురుషుడే అయితే నలుగురిలో నవ్వులపాలు కావడమేకాక అత్తయింట కాపురంచేసికొనే వయసుకత్తె తన కాపురానికే నీళ్ళు వదులుకోవలసి వస్తుంది. ఆ బాధలు ఏమీ అక్కరలేకుండా ఈ సంకేతాలు వినియోగపడతాయి.

"కులాసాగా ఉన్నావా?"అని ప్రశ్నించడానికి చేతితో తన చెవిని తాకడం—సంకేతముగా చెప్పబడ్డది.

తా నెరిగిన మదవతియైన యువతి సాభిప్రాయంగా తనవంకను చూస్తూ చెవిమీద చేయివేసుకొనడం జరిగితే— ఆమె నీవు కులాసాగా ఉన్నావా? అని ప్రశ్నిస్తూ వున్నదని నాగరకుడైన పురుషుడు గుర్తించాలి.

అలా గుర్తించి తాను కులానాసా ఉన్నట్లు సూచించడానికి— తన చెవిని తనచేతితో తాకాలి. అనగా కుశల ప్రశ్నలకు, కుశలంగా యున్నానన్న సమాధానానికి రెంటికికూడ చేతితో చెవిని తాకుట సంకేతమైయున్నది.

ఎవరైనా ఒకయువతి ప్రియవిరహంతో క్రుగ్గిపోతూ ఎట్టకేలకు కంటబడిన ప్రియునితో "— "నేను కామాతురనై ఉన్నాను."— అని చెప్పదలచినపుడు కచదంశం (జుట్టు లేక జడను వెనుకనుండి ముందుకు తెచ్చి మునిపంటితో కొరకడం) సంకేతముగా చెప్పబడ్డది.

భార్య, పరిచిత, లేక అపరిచిత అయిన యువతి తన్ను సాభిలాషంగా చూస్తూ 'కచదంశం' ఆచరిస్తే—ఆమె కామాతురయై ఉన్నదని తన్నుకోరుతూన్నదని పురుషుడు గ్రహించాలి.

"గుండెమీద చేయివేసి ప్రదర్శించడం"— "నాకు నీమీద మిక్కిలి ప్రేమఉన్నది"—అనడానికి సంకేతముగా చెప్పబడ్డది. ఎవరైనా మదవతియైన యువతి తన గుండెమీద చేయి చేర్చుకొన్నదై సాభిలాషంగాచూస్తే—పురుషుడామె తన ప్రేమను వెల్లడిస్తూన్నదని గ్రహించాలి.

"నేను నిన్ను ఆరాధిస్తున్నాను"—అని సూచించడానికి— తలమీద చేయిచేర్చి ప్రదర్శించడం—సంకేతముగా చెప్పబడ్డది.

ప్రియురాలు చేతిని తలపై చేర్చినదై సాభిలాషగాచూస్తే— పురుషుడామె తన్ను ఆరాధిస్తూన్నదని గ్రహించాలి.

ఇలా ఆమె తన్నుకోరుతూ ఆరాధిస్తూన్నదని తనకు తెలిసినా, ఆమెను కలియడానికి అది తగిన సమయం అగునో కాదో తెలిసికొనకుండా ముందడుగువేస్తే పురుషునకు పరాభవం తప్పదు.

అందుచే "ఇది తగిన సమయం అవునా కాదా? అని ప్రశ్నించడానికి వేరేసంకేతము చెప్పబడ్డది. అట్టి ప్రశ్నకు— చూపిన చూపుడువ్రేలిమీద నడుమవ్రేలిని ఎక్కించి ప్రదర్శించడం— సంకేతముగా చెప్పబడినది.

ప్రియుడు తనవంకకుచూస్తూ— చూపుడువ్రేలిని చాచి దానిమీదకు నడుమవ్రేలిని ఎక్కించి ప్రదర్శిస్తే— ఇది తగిన సమయం అగునా కాదా? అని ప్రశ్నిస్తున్నాడని యువతి గ్రహించాలి.

అలా గ్రహించినమీదట—'ఇది తగిన సమయమే'—అని చెప్ప దలచినపుడు 'అం జ లి బం ధ ం' (దోసిలి పట్టుట) సంకేతముగా చెప్పబడ్డది.

తన వంకకు చూస్తూ ప్రియురాలు 'అంజలి బంధం' ఆచరిస్తే—ప్రియుడు ఆమెను కలియడానికి ఇది తగిన సమయమేనని గ్రహించాలి. తగిన సమయం కాదనుట్కైతే "ప్రాకారముద్రాసంకేతము" వెనుక చెప్పబడ్డది కదా! దానిని వినియోగించాలి.

అయితే తగినసమయం అని చెప్పినా—పురుషుడు వెంటనే ముందడుగు వేయడానికి తగినంత ఆదరపూర్వకమైన ఆహ్వానం ఉండాలికదా! అట్టి ఆహ్వానం చేయదలచినప్పుడు 'అంజలీ కుంచనం'(దోసిలిని మూయడం) సంకేతమై ఉన్నది.

ప్రియురాలు 'అంజలీ కుంచనం' ఆచరిస్తే ప్రియుడామెరమ్మని ఆహ్వానిస్తూన్నదని గ్రహించాలి.

అయితే ఆమెరమ్మని ఆహ్వానిస్తోందేకాని ఎక్కడకు రమ్మంటూ ఉన్నదో అన్న విషయం ఈ పురుషునకు తెలియాలికదా! అందుచే దానికి వేరే సంకేతాలు చెప్పబడినాయి.

చేతివేళ్ళు బొటనవేలుకాక 1 చూపుడువేలు, 2 నడిమివ్రేలు 3 ఉంగరపు వేలు, 4 చిటికెనవేలు అని నాలుగు వేళ్లున్నాయికదా! ఈ వేళ్లు నాలుగు క్రమంగా తూర్పు—దక్షిణము—పశ్చిమము—ఉత్తరము అనబడే నాలుగు దిక్కులకు సంకేతాలై వున్నాయి.

అనగా ప్రియురాలు 'అంజలిబంధం—అంజలికుంచనం' ఆచరించి—తన బొటనవ్రేలితో చూపుడువేలిని 'ముక్కుపొడుము పట్టినట్లు' పట్టుకొని ప్రదర్శిస్తే పురుషుడు—ఆమె తూరుపు దిశయందున్న సంకేతస్థలానికి (అక్కడ ఏతోటయో, చెఱువో, దేవాలయమో, లేక మరియొక జనంలేని స్థలమో ఉండవచ్చును. దానిని పురుషుడు ఊహించి తెలిసికొనాలి.) రమ్మంటూన్నదని గ్రహించాలి.

అట్లే బొటనవ్రేలితో నడుమువ్రేలిని తాకినప్పుడు దక్షిణ దిక్కునియు, ఉంగరపు వ్రేలిని తాకినప్పుడు పశ్చిమదిక్కునియు, చిటికెనవ్రేలిని తాకినప్పుడు ఉత్తర దిక్కునియు గ్రహించాలి.

ప్రియుని లేక ప్రియురాలిని ఫలానా తిథినాడు రమ్మని చెప్పడానికి వేరే సంకేతాలు వున్నాయి.

పాడ్యమినుండి పూర్ణిమకు లేక అమావాస్యవరకువుండే తిథులు మొత్తం పదునైదు. శుక్ల పక్షము (వెన్నెలరాత్రులు) కృష్ణ పక్షము (చీకటి రాత్రులు) అనే రెండు పక్షాలలోనూ అవే తిథులు పునరావృత్తం అవుతాయి. అంటే తిథులు పదునైదు— పక్షాలు రెండు అయివున్నాయి.

శుక్ల పక్షమునకు ఎడమచేయి, కృష్ణ పక్షమునకు కుడిచేయి సంకేతాలుగా చెప్పబడినాయి. చేతివ్రేళ్ళను పరిశీలిస్తే ప్రతి వ్రేలు మూడు కణుపులుగా వుండి ఒక్కొక్క వ్రేలికి మూడేసి రేఖల చొ॥న మొత్తము పదునైదు రేఖలు కలవై యుంటాయి. ఈ రేఖలు పదునైదూ పదునైదు తిథులకు సంకేతాలై వున్నాయి. ఎడమచేతి రేఖలు శుక్లపక్ష తిథులను సూచిస్తే కుడిచేతి రేఖలు కృష్ణపక్ష తిథులను సూచిస్తాయి. అయితే యే రేఖ యే తిథికి సంకేతము ? అన్న విషయం తెలియదుకదా !

చిటికెనవ్రేలి దిగువరేఖ (గోటిదగ్గరదికాదు) మొదలు వరుసగా ఈ పదునైదు రేఖలు పదునైదు తిథులకు సంకేతాలై వున్నాయి.

చిటికెనవ్రేలియొక్క దిగువరేఖ పాడ్యమితిథికి, మధ్యరేఖ విదియకు మూడవదైన పై రేఖ తదియకు సంకేతాలు. అ తరువాత వుంగరపు వ్రేలియొక్క పై రేఖనుండి క్రిందికి గణించాలి.

ఉంగరపు వ్రేలియొక్క పై రేఖ చవితికి, మధ్యరేఖ పంచమికి, దిగువరేఖ షష్ఠికి సంకేతాలై ఉన్నాయి. పిమ్మట అరంభమయ్యే నడిమివ్రేలి రేఖలను దిగువ రేఖనుండి లెక్కించాలి.

నడిమి వ్రేలి దిగువరేఖ సప్తమికి, మధ్యమరేఖ అష్టమికి, పైరేఖ నవమికి సంకేతాలైయున్నాయి. ఆ తరువాత చూపుడువ్రేలియొక్క పైరేఖనుండి గణించాలి.

చూపుడువ్రేలియొక్క పైరేఖ దశమికి, మధ్యరేఖ ఏకాదశికి, దిగువరేఖ ద్వాదశికి సంకేతాలు. పిమ్మట బొటనవ్రేలి దిగువరేఖ నుండి లెక్కించాలి.

బొటనవ్రేలియొక్క దిగువరేఖ త్రియోదశికి, మధ్యరేఖ చతుర్థశికి, పైరేఖ పూర్ణిమకు లేక అమావాస్యకు (ఆ బొటనవ్రేలు ఎడమ చేతిదైనపుడు పూర్ణిమకు, కుడిచేతిదైనపుడు అమావాస్యకు)సంకేతాలు.

ఇలా వున్న యీ సంకేతాలలో ప్రియురాలు స్పృశించిన సంకేతాన్ని గమనించి పురుషుడు ఫలానా తిథినాడు రమ్మంటూ వున్నదని గ్రహించి— వెనుక భాషాసంకేతాలలో జాములకు చెప్పిన "శంఖ—మహాశంఖాది సంకేతాలతో జామునుకూడ ఆమె సూచిస్తే— ఆ తిథి నాడు—ఆ జామున—ఆమె సంకేతంద్వారా తెలిపిన దిశయందు ఆమెను కలిసికోవాలి.

ఈ సంకేతాలను పురుషులు, స్త్రీలు ఇద్దరూకూడ వుపయోగించవచ్చును. వీనిద్వారా నాగరజనంయొక్క వర్తనం ఇతరులు తెలిసికొనడానికి వీలులేనిదై—దుర్భేద్యమై—నిరపాయమై—సుఖదమై వుంటుంది. భాషా సంకేతాలు మాట వినబడదగినంత దూరంలో వున్నప్పుడు వినియోగింపబడతాయి. ఈ అంగ సంకేతాలు ప్రియుడు లేక ప్రియురాలు ఒకరినొకరు చూడదగినంత దూరంలో వున్నప్పుడు వినియోగిస్తాయి.

---

## పోటలీ సంకేతములు

ఈ లోకంలో కామినీ కాముకుల స్వేచ్ఛా విహారాలు అసంఖ్యాక విధానాలలో సాగుతూంటాయి. ఒక్కొక్క సమయంలో ఒక్కొక విధమైన సంకేతాన్ని వుపయోగించడానికి వీలు కుదురుతుంది. అందుచే

భాషా సంకేతాలు, అంగసంకేతాలు అయిన పిమ్మట పోటలీ సంకేతాలు, వివరింపబడుతున్నాయి.

'పోటలీ'—అనగా పొట్లము. ప్రియుని యెదుటకు తనకుతానై వెళ్ళడానికి వీలుకుదరనప్పుడు నాగరయువతులు ఇతరులకు తెలియకుండ ఈ పోటలీసంకేతాలను వినియోగిస్తారు.

"ప్రియుడు ఎక్కడనో వున్నాడు. అతనిని తాను ప్రేమిస్తూ ఉన్నది. తన యీప్రేమవార్త అతనికి తెలియాలి"—అన్నప్పుడు—సుగంధ ద్రవ్యాలు, వక్కలు, కవిరి పొట్లాముగాకట్టి అతనియొద్దకుపంపడం"— సంకేతముగా చెప్పబడ్డది.

ఎవరైనా యువతి కొన్ని సుగంధ ద్రవ్యాలను పొట్లముగాకట్టి తనయొద్దకు పంపడం జరిగితే, పురుషుడామె తన్ను ప్రేమిస్తూన్నదని గ్రహించాలి.

'నాకు నీ మీద ప్రేమ చాలాధికం'—అని సూచించడానికి— చిన్న ఏలకులు, జాజికాయ, లవంగములు పొట్లముగాకట్టి పంపుట— సంకేతముగా చెప్పబడినది.

అట్టిదైన పొట్లము తనవద్దకు పంపబడినప్పుడు ఆపొట్లమును పంపినవారు తన్ను అధికముగా ప్రేమిస్తున్నారని నాగరకులు గ్రహించాలి.

ఒకప్పుడు ఒకజంట ఒకరిమీద ఒకరు అనురాగం కలవారై సాంకేతికంగా కలిసి విహరించి, కొంతకాలానికి అందులో ఒకరికి ఒకరి మీద ఏదో కారణంవల్ల విరక్తికలిగి తమప్రేమకు స్వస్తి చెప్పదలచినప్పుడు 'పగడమును' పొట్లముకట్టి పంపుట సంకేతముగా చెప్పబడ్డది.

తనయొద్దకు పగడము పొట్లముగాకట్టి పంపబడినప్పుడు—ఆపంపినవారు ఇంతవరకూ తన్ను ప్రేమిస్తూన్నా, ఇప్పుడు ప్రేమించడంలేదని, తమప్రేమకు స్వస్తి చెప్పేరని—నాగరకులు గ్రహించాలి.

చిరకాల సమాగమానాన్ని సూచించడానికి— రెండు పగడములను పొట్లముగాకట్టి పంపడం— సంకేతమైయున్నది.

"ఒక యువతి, ఒక యువకుడు చాలకాలానికి వెనుక ఒకరినొకరు ప్రేమించి విహరించారు. కాని తరువాత కొన్ని కారణాలవల్ల ఒకరి నొకరు దూరమైపోయారు. మరల కొంతకాలానికి ఇద్దరూ ఒకేఊరిలో ఉండడం సంభవించింది. వారికి ఆ చిన్ననాటి నెచ్చెలి ఈ యూరనే యున్నట్లు తెలిసింది. ఈ విషయం ఆ యువతికి, ఆ యువకునకు ఇద్దరకు తెలిసియున్నదే. అయినా ఎవరిమట్టుకు వారు వెనుకటి ప్రేమ నిలచి యున్నదో లేదో అని సందేహిస్తున్నారు.

అట్టి పరిస్థితులలో ఆ యువతి వద్దనుండికాని, యువకునివద్దనుండి కాని—రెండు పగడాలు పొట్లాముగా కట్టి పంపబడితే– ఆ పంపినవారు తమ్ము ఇంకను ప్రేమిస్తూనే ఉన్నారని, తమయొక్క చిరకాల సమాగమాన్ని సూచిస్తున్నారని నాగరకులు గ్రహించాలి.

"నేను నీ మీాది వలపు నిలుపలేక, దానివల్ల జ్వరంవచ్చి బాధ పడుతున్నాను."—అని సూచించడానికి— 'చేదుగా, కారంగాఉండే ద్రవ్యాలను పొట్లముగాకట్టి పంపుట' సంకేతముగా చెప్పబడ్డది.

"నేను నిన్ను ఇప్పుడే కలియగోరుతున్నాను. ఆలస్యానికి సహించలేను"—అనుటకు— "ద్రాక్షపండు పొట్లముగాకట్టి పంపుట"— సంకేతమై యున్నది.

అట్టి పొట్లమును ఏ యువతి అయినా తనయొద్దకు పంపినపుడు యువకుడామె వెంటనే తన్ను కలియుటకై రమ్మంటూవున్నదని గ్రహించాలి.

'నా శరీరాన్ని నీకు అర్పిస్తున్నాను'—అనుటకు ప్రత్తిని పొట్లముగాకట్టి పంపుట—సంకేతమై యున్నది.

'నా శరీరాన్నే కాదు, ప్రాణాలనుకూడ నీకై అర్పిస్తున్నాను'— అనుటకు 'జీలకర్రను పొట్లముగాకట్టి పంపుట సంకేతము.

'నేను నిన్ను కలియగోరుతున్నాను. కాని ఏది యెటువస్తుందో అని మిక్కిలి భయముగా వుంది'—అని భీతిని సూచించడానికి 'జీడిని పొట్లముగాకట్టి పంపుట' సంకేతము.

'నాకు నిన్ను కలియాలని ఉన్నది. నాకు భయములేదు. నీవు కూడ భయపడనక్కరలేదు'—అని సూచించడానికి 'కరక్కాయను' పొట్లముగాకట్టి పంపుట సంకేతము.

కరక్కాయతో కూడిన పొట్లము ప్రియురాలివద్దనుండి వచ్చినపుడు పురుషుడు జంకుగొంకులు లేకుండ ఆమెను కలియుటకు యత్నింపవచ్చును.

'నేనిదివరకు మన్మథ వ్యాపారము నెఱుంగనిదానను, నేనునిన్ను మిక్కిలి ప్రేమిస్తున్నాను, మన్మథుడు నన్ను మిక్కిలి వేధిస్తున్నాడు, నన్ను దయజూడు'–అని సూచించడానికి ప్రత్యేకసంకేతము చెప్పబడినది.

మైనము తెచ్చి దానిని నున్నని ముద్దగాచేసి, దానిపై ఎఱుపు దారముచుట్టి, ఆముద్దమీద తనచేతి ఐదుగోళ్ళు నాటునట్లు ఒక్కసారి నొక్కి,—దానిని పొట్లముగాకట్టి పంపుట పైన చెప్పిన మూడు విషయాలకు సంకేతమై యున్నది.

ఇందు 'నున్నని మైనపుముద్ద'—ఇంతవరకు పరసంపర్కము ఎరుగనిదనుటకు, దానికి చుట్టిన ఎఱ్ఱిదారము—'ఆమె తన్ను ప్రేమిస్తూన్నదనుటకు', దానిమీద గుచ్చబడిన గోరులైదూ—'ఆమెను మన్మథుడు తనబాణము లైదింటితోడను వేధిస్తునాడనుటకు'—సూచనలు.

ఇట్టి పోటలీ సంకేతములద్వారా కామినీకాముకులు నిగూఢముగా కలిసికొని విహరించగలవారు అవుతారు.

---

## వస్త్ర సంకేతములు

నాగరకులు తాము ధరించే వస్తువుల ద్వారాకూడ తమ మనోభావాలను సాంకేతికంగా వెల్లడించే స్వభావం కలవారై ఉంటారు. భాషాసంకేతములకంటె వస్త్రసంకేతములు నిగూఢములైనవి. ఏమంటే ఇచ్చట తనపని తానుచేసి కొంటూ తాను ధరించిన వస్త్రంద్వారా

తనమనోభావాన్ని వ్యక్తంచేయడం జరుగుతుంది. కొన్నిచోట్ల కామినీ కాముకులు యీవస్త్రాలను ఒకరియొద్దకొకరు పంపడంకూడజరుగుతుంది.

తన యింటికి వచ్చిన ప్రియునకు నిగూఢంగా నేను మదనునిచే మిక్కిలి వేధింపబడుతున్నాను. అతడు నా మనస్సును చాలారకాలుగా గాయపరచాడు. ఇక నేను తాళలేను—అని సూచించడానికి చిల్లులు పడిన (చిరుగులు కాదు) వస్త్రము సంకేతముగా చెప్పబడినది.

తన చిన్ననాటి ప్రియురాలు, ఇప్పుడు పరవనిత అయిన యువతి తాను వారియింటికి ఏదో పనిమీద వెళ్ళి కూర్చున్నప్పుడు 'చిల్లులు పడిన వస్త్రాన్ని ధరించి తనయెదుట సంచరించడం జరిగితే' ఆమె తన్ను ప్రేమిస్తూ తన పొందుకై తహతహ పడుతూన్నదని గ్రహించాలి.

ఉదాహరణకోసం పరవనిత అనిచెప్పడం జరిగిందేకాని, ధర్మ బద్ధంగా వివాహం చేసికొన్న భార్యకూడ అత్తమామలయొక్క, ఆమె బిడ్డలయొక్క, ఇతర జనంయొక్క సమక్షంలో కూర్చున్న భర్తతో తన మనస్సులోని సంగమాశయాన్ని చెప్పడానికి సిగ్గుపడ్డదై ఈ వస్త్ర సంకేతాన్ని అవలంభింపవచ్చును.

ఆలుమగలు ఇద్దరు మాత్రమే యింటిలో నివసిస్తున్నవారైనప్పుడుకూడ ఆ యువతి సిగ్గుచేత తన మనస్సులోని కోరికనునోటితో చెప్పలేనిదై పతియెదుట యీ వస్త్రధారణా సంకేతాన్ని అవలంభించవచ్చును.

'చిల్లులుపడిన వస్త్రం' మన్మథునిచే పీడింపబడుతూన్నాను, అతడు నా మనస్సును తూట్లు తూట్లుగా గాయపరచాడు—అనడానికి సంకేతమై యున్నదనుటయే ప్రధాన విషయంకాని, పరవనితయే కావలెనన్న నియమంలేదు.

మిక్కుటమైన ప్రేమను సూచించడానికి— ఎఱ్ఱని వస్త్రము సాధారణ ప్రేమకు పసుపువచ్చని వస్త్రము, విరక్తి సూచనకు కాషాయ వస్త్రము సంకేతములైయున్నాయి. అట్టి వస్త్రాలను ధరిం

చుట, లేక పంపుట జరిగినప్పుడు—కాముకులు ఆ వస్త్రాలను ధరించిన వారు లేక పంపినవారు తమయందు మిక్కిలి ప్రేమకలవారై యున్నారని, కాషాయ వస్త్రములనుబట్టి విరక్తి చెందినారని గ్రహించాలి.

'చినిగిన వస్త్రము' వియోగమునకు సంకేతము, ఆ చినిగిన వస్త్రమే చిరుగులు దారముతో కుట్టబడినదై యున్నప్పుడు వియోగానంతర సంయోగమునకు సంకేతమైయున్నది.

అలా చినిగిన వస్త్రము ఒక్కటే ధరించబడినప్పుడు అది ధరించిన వారియొక్క స్థితినిమాత్రమే వెల్లడిస్తుంది, అలాకాక, చినిగిన వస్త్రాలను రెంటిని తెచ్చి, వాని చిరుగులనుకుట్టి రెంటిని ధరించుట—

'మనం చిరకాల వియోగ భాధను అనుభవించాము. కాని నేడు కలిసికొనే అవకాశం లభించింది. ఈ వియోగములో నేను ఎలా బాధపడ్డానో నీవుకూడ అలాగే బాధపడ్డావు. నాలాగే నీవుకూడ సంయోగానికై తహతహపడుతూన్నావు. ఇది నేను గుర్తించేను— అని ఉభయుల స్నేహాన్ని సూచించడానికి సంకేతమైయున్నది.

మిగిలిన సంకేతాలకంటె యీ వస్త్రధారణా సంకేతాలు అల్పభావాన్ని వెల్లడిస్తూ పరిమితమైన కార్యాన్ని సానుకూలపరచేవై యున్నప్పటికి, చిరకాలానికి కలిసికొన్న ఆలుమగల మనస్సులమీద యీ సంకేతాలు తేనెజల్లులు కురిపిస్తాయి.

---

## తాంబూల సంకేతములు

పరమ నాగరకులైనవారు వెనుకటి సంకేతాలనేకాక తాంబూల సంకేతాలనుకూడ వుపయోగిస్తారు. యీ సర్వ సంకేతాలకు ప్రియుడు లేక ప్రియురాలు పరకీయంగా ఉన్నప్పుడే ఉపయోగం అనుకొనడం పొరపాటు. ఆలుమగలుకూడ తమ మనోభావాన్ని నోటితో చెప్పడం కంటె, యీ సంకేతాలద్వారా తమ మనస్సులోనిభావాన్ని వెల్లడించి

దానినిగ్రహించిన తమ నెచ్చెలియొక్క కూటమిలో మిక్కిలి ఆనం దించేవారు అవుతారు.

పతి భోజనంచేసి ఎవరితోడనో మాటాడుతూ కూర్చున్నాడు. భార్య అతనికి తాంబూలం పంపింది. ఆతాంబూల నిర్మాణం విచిత్రంగా వుంది. భావస్ఫోరకంగా వున్నది. అది ఏదో ఒక సంకేతార్థాన్ని సూచిస్తూన్నట్లు వున్నది. అప్పుడు ఆ సంకేతార్థం తెలిసికొన్న పతికీ, దానిని పంపిన భార్యకు వింత ఆనందం కలగడానికి సావకాశంలేదా! అందుకే నాగరజనం తాంబూల నిర్మాణములో నైపుణ్యము కలవారై తమ మనోభావాలను వానిద్వారా వ్యక్తంచేసి ఆనందించేవారై యుంటారు.

తమలపాకులకు సున్నమురాసి వక్కలు మొదలగునవి వానియం దుంచి చుట్టగా చుట్టుటలోని వైవిధ్యాన్ని అనుసరించి యీతాంబూల సంకేతాలు ఏర్పడ్డాయి.

ఇలా విభిన్నములైన తాంబూల నిర్మాణములు 1 కౌశలము, 2 అంకుశము 3 కందర్పము 4 పర్యంకము 5 చతురస్రము అని ప్రధానంగా ఐదు రకాలుగా ఉన్నాయి. ఈ ఐదింటిని ఐదు రకాలైన భావాలకు సంకేతంగా నాగరజనం వుపయోగిస్తూంటారు.

కౌశలము:—మిక్కిలి నేర్పుగా చుట్టబడిన తాంబూలమునకు 'కౌశలము' అనిపేరు. యీ నేర్పు తమలపాకుల యీనెలు తీయుట యందు, వానికి సున్నము రాయుటయందు వానియందు వక్కలు మొ॥వి సమముగా (ఆకారమునకు రుచికికూడ) వుంచుటయందు అవి యేమాత్రము నలుగకుండ చుట్టచుట్టుటయందు నాగరులు వ్యక్తం చేస్తారు.

ఇట్టి కౌశల తాంబూలము—"నాకు నీ యందు ప్రేమయెక్కువ" అనడానికి సంకేతంగా వుపయోగింపబడుతుంది.

ఒక నాగర యువకుడు తన మేనమామ యింటికి వెళ్ళేడు. ఆతడు అవివాహితుడు. ఆ మేనమామవద్ద వివాహము కాదగిన సుందరియైన

కన్య ఉన్నది. ఈ మేనల్లునకు ఆమెనిచ్చి వివాహంచేస్తే బాగానే ఉంటుంది. ఆ యువతికికూడ యీ మేనత్తకొడుకుమీద ప్రేమ లేకపోలేదు. కాని ఏవో కారణాలవల్ల ఆ వ్యవహారం పొసగిరావడంలేదు. ఈపరిస్థితులలో ఇంటికివచ్చినబావ భోజనంచేసినంతనే ఆ నెరజాణఅయిన మరదలు కౌశలం పుట్టిపడే తాంబూలాన్ని నిర్మించి అతనికి అందించింది. అనగా 'ఓ బావా! పెద్దలు కట్నాలకనియో, కానుకలకనియో ఏవో అభ్యంతరాలు తెపుతున్నారు, కాని యీ అభ్యంతరాల నన్నింటిని దాటి నా మనస్సు నీయందు లగ్నమైయున్నది. నేను నిన్ను ప్రేమిస్తున్నాను'—అని చెప్పినట్లే కౌశల తాంబూలంయొక్క ఉపయోగానికి ఇది ఉదాహరణముగా చెప్పబడ్డది. ఇట్టివే అయిన భిన్నభిన్నపరిస్థితులలో ఈకౌశలతాంబూలాన్ని సాంకేతికముగా నాగరకులు వాడుతూంటారు.

అంకుశము:— వెనుక భాషా సంకేతములయందు వివరించిన అంకుశముయొక్క ఆకృతివంటి ఆకృతి ఏర్పడునట్లు నిర్మించిన తాంబూలము 'అంకుశము' అనబడుతుంది. 'ప్రియాహ్వానానికి' సంకేతముగా నాగరజనం దీనిని వినియోగిస్తారు.

ఇట్టి తాంబూలము పంపబడినపుడు ఆ తాంబూలమును పంపిన వారు—తమ్ము సాదరంగా ప్రేమతో ఆహ్వానిస్తున్నారని గ్రహించాలి.

కందర్పము:—తమలపాకులకు సున్నము రాసి, యీనెలుతీసి, వక్కలు మొదలగువానిని వానియందుంచి, మూడుకోణములు వచ్చునట్లు చుట్టినచో ఆ తాంబూలము కందర్పము అనబడుతుంది ఈ కోణములు వచ్చుటకు తమలపాకుల చివళ్లు మిక్కిలి సాయపడతాయి.

'నేను మన్మథునిచే పీడింపబడుతున్నాను' అనడానికి యీ తాంబూలము సంకేతమై యున్నది.

చిరకాలానికి దూరదేశంనుండి వచ్చిన భర్త భోజనంచేసి తన తల్లిదండ్రులతో మాటాడుతూ కూర్చున్నాడు. రాత్రి చాలగడచింది, అయినా ఆ కబుర్లకు అంతు కనబడడంలేదు. ఇక్కడ తాను (భార్య)

అతని కౌగిలికి ఎప్పుడు చేసుకొందునా అని తహతహపడుతూన్నది. అతడేవో కబుర్లలో మునిగియున్నాడు. అప్పుడు భార్య యీ "కందర్పము" అనే తాంబూలాన్ని అతని యొద్దకు పంపితే ఆమె తన మనస్సులోని భావాన్ని సుందరంగా చెప్పినది అవుతుంది.

కందర్ప తాంబూలాన్ని పంపిన భార్యవలెనే భర్తకూడ విజ్ఞుడైనవాడు ఆతాంబూలాన్ని చూచినంతనే అతని మనస్సులో మల్లెలు, మొల్లలువిరియబూస్తాయనడానికి తాను మన్మధసామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడైనట్లుగా అతడు ఆనందిస్తాడనడానికి సందేహంలేదు.

పర్యంకము:—"పర్యంకము"అనగా మంచము. తమలపాకులను చక్కగా మడచి మంచముయొక్క ఆకృతిలో నిర్మించిన తాంబూలము 'పర్యంకము' అనబడుతుంది. తాంబూలానికి ఇట్టి ఆకృతివచ్చుటకు లవంగాలు మిక్కిలితోడ్పడతాయి. తమలపాకులను చక్కగా-బల్లపరుపుగా దీర్ఘ చతురముగా మడచి, వానిమీద చతురస్రముగా కత్తిరించిన లేత తమలపాకును పరచి దానికి నాలుగువైపులయందు నాలుగు లవంగాలు గ్రుచ్చాలి. అప్పుడు దానికి మంచముయొక్క పైభాగమువంటి ఆకారం యేర్పడుతుంది. పరువబడిన లేత తమలపాకు మంచంమీది దుప్పటివలె భాసిస్తుంది. ఇక కోళ్లు, వాని కొలుకుకూడ లవంగాలనే వినియోగించాలి. ఆ తాంబూలముయొక్క అడుగు భాగములో నాలుగువైపుల యందు నాలుగు లవంగాలను పూర్తిగాకాక కొంతవరకు గ్రుచ్చివదలితే అవి నాలుగూ మంచంయొక్క నాలుగు కోళ్ళవలె భాసిస్తాయి.

ఇట్టి యీ పర్యంక తాంబూలాన్ని నాగరజనం సంయోగాభిలాషను వ్యక్తం చేయడానికి సంకేతంగా వాడతారు.

చతురస్రము:—తమల పాకులను గుండ్రని చుట్టుగాకాక నాలుగు కోణములు వచ్చునట్లు చుట్టినచో చతురస్రము అనబడుతుంది. 'చతురస్రము' అనగా నాలుగు కోణములుకలది. అలా కోణాలు రావడానికి తమలపాకులను నలుగింటిని చివరలు వేరువేరుగా కనబడునట్లు

పరచి వానిని చక్కగా మడవడం అవసరం. ఈ తాంబూల నిర్మాణానికికూడ లవంగము తోడ్పడుతుంది.

ఈ చతురస్ర తాంబూలము—'నీవూ నేనూ కలియడానికి ఇది యెంతమాత్రమూ తగిన సమయంకాదు'—అనడానికి సంకేతమైఉన్నది. కామినీకాముకులు ఒకరినొకరు కలియడానికి తగిన సమయంకాదని సూచించడానికై యీ తాంబూలాన్ని వుపయోగిస్తారు.

యీ చతురస్ర తాంబూలమే—వక్కలు లేకుండ పంపబడితే—"నాకు నీయందు ప్రేమలేదు"—అనడానికి సంకేతమై ఉంటుంది. అట్టి తాంబూలము తనయొద్దకు వచ్చినపుడు—దానిని పంపినవారు తన్ను ప్రేమించడం లేదని గుర్తించాలి.

పై చతురస్రతాంబూలమే ఏలకులు ఎక్కువగావేసి పంపితే—'నాకు నీయందు ప్రేమ ఉన్నది, కాని మన కలయికకు ఇది తగిన సమయంకాదు'—అన్న విషయానికి సంకేతమై ఉన్నది.

విజ్ఞులైన నాగరజనం ఈ తాంబూలసంకేతాలద్వారా పరస్పరం భావాలను అవగాహన చేసికొంటూ ఆనందించేవారై యుంటారు. తాంబూల సంకేతాలలో ఈ ఐదు మాత్రమే ప్రధానమైనవై వున్నా, ఇంకాకొన్ని అవాంతర భేదాలుకూడ వీనిలో వున్నాయి.

తమలపాకులను రెంటిని తెచ్చి వానిని ఒకదాని వీపు (అడుగు భాగము) వేరొకదాని వీపుకు తగులునట్లు (ఎడమొగము పెడమొగముగా) తలక్రిందుచేసి వానిని చుట్టగాచుట్టి, ఆ చుట్ట ఊడిపోవకుండుటకో అన్నట్లు దానిపై సన్నని నల్లదారము మెలిపెట్టి పంపినచో అది—వియోగ సూచనకు సంకేతమైయున్నది.

అట్లుకాక 'తమలపాకులను ఒకదాని ముఖము (పై భాగము) వేరొకదాని ముఖముతో అంటి యుండునటులు పరచి ఎర్రదారముతో చుట్టిపంపుట'—సంయోగమునకు సంకేతమై యున్నది.

తమలపాకులను మధ్యకు చీల్చి వానిని చుట్టి, సన్నని నల్లదారముతో ముడివేసి పంపుట'— నీకును నాకును ఇక సంబంధములేదు,

నేను నిన్ను సర్వదా విడిచిపెడుతున్నాను— అనడానికి సంకేతమై ఉన్నది.

అలా మధ్యకు చీల్చిన తమలపాకులనే మిక్కిలి సన్నని ఎఱ్ఱ దారముతో కట్టి చుట్టచుట్టి పంపుట—'నా ప్రాణములు పోవుచున్నవి. ఒకసారివచ్చి నీవు నన్ను కలిసిన నిలచునేమో'— అనుటకు సంకేతముగా చెప్పబడ్డది.

'తమలపాకును ముక్కలు ముక్కలుగా చించి, ఆ ముక్కలను మరల సరిచేసి, పూర్వపు ఆకారము వచ్చునట్లు వేరొక ఆకుమీదపరచి వానియందు పోకలనువుంచి, వానిమధ్య నిండుగా కుంకుమపూవుపెట్టి, చుట్టచుట్టి, ఆ చుట్టపై సువాసనలుచిందే మంచి గంధము లేక గంధమువాసనగల అత్తరుపూసి పంపుట'—నాకు నీమీద వర్ణింపనలవికాని ప్రేమ ఉన్నదని చెప్పుటకు సంకేతముగా చెప్పబడినది.

ఈ సంకేతాలను వినియోగించడానికి ధనికులే కావాలన్న నియమంలేదు. సాధారణ గృహస్థులైన ఆలుమగలుకూడ యీ సంకేతార్థాలను గుర్తించినవారై వీనిని వినియోగిస్తే విచిత్రమైన ఆనందం మానసికంగా అనుభవించగలుగుతారు.

## పుష్పమాలా సంకేతము

తాము ధరించే పూలమాలద్వారాకూడ నాగరజనం తమ మనోభావాలను వ్యక్త పరుస్తారు. మంచివైన పూవులనుతెచ్చి ఎఱ్ఱ దారముతో దండగా గుచ్చి (ఆ దారముకూడ సన్నగా కనబడునట్లు) ధరించుట—అధిక ప్రేమకు సంకేతమై యున్నది.

ఎఱ్ఱదారమునకు బదులు పసుపుపచ్చని దారము వినియోగించినచో—'నాకు నీ మీద ప్రేమ ఉన్నది' అని సాధారణమైన ప్రేమను సూచించుటకు సంకేతమైయున్నది.

కాషాయరంగు దారముతో గుచ్చబడిన పుష్పమాల 'విరక్తికి' సంకేతమైయున్నది. అట్టిమాల తనకు పంపబడినపుడు లేక దానిని ధరించి తన నెచ్చెలి తనయెదుట సంచరించినపుడు—దానిని పంపిన లేక ధరించిన నెచ్చెలి తనయందు విరక్తి చెందినటులు గ్రహించాలి.

ఈ సర్వవిధములైన సంకేతములు యువతీయువకుల ఆనంద సోత్రస్సులకు ఏతా మెత్తజాలినవి. ఈ సంకేతాలన్నీ ఆలుమగలలో లేక కామినీకాముకులలో ఒక్కరికిమాత్రమే తెలివున్నప్పుడు వీనివల్ల ప్రయోజనం ఏమీ ఉండదుకదా! అని వీనియందు నిరాదరం చూపడంకంటె వీనిని తెలిసికొని పరస్పరం ప్రాణాధికంగాప్రేమించుకొనే ఆలుమగలు వినియోగించడంజరిగితే వారనుభవించేఆనందంయినుమడిస్తుంది.

వనితలు యీ సంకేతాలు తమకు తెలియనపుడు పతిద్వారా తెలిసికొని వినియోగిస్తే మంచిదే. కాని భర్త యీ సంకేతాలను విడదీసి చెప్పగల నిలుకడలేనివాడైనపుడు, వారు స్వయంగా కామశాస్త్రాలను చదువనివారైనపుడు ఇవి వారికి తెలిసే అవకాశంవుండదు. అప్పుడు వారు తాము అనుభవించగల అధికానందము అనుభవించలేనివారవుతారేకాని వేరే యేదో విపత్తుకు లోనుకావడం జరుగదు.

కాని పురుషుల విషయం అట్టిదికాదు. వారు యీ సర్వసంకేతాలను ప్రయత్నించి తెలిసికొని యుండాలి. ఏమంటే, అన్నిచోట్లు లందు కాకపోయినా, ఎక్కడనో ఎవ్వరికో అదృష్టవంతునకు సకల కళానిపుణయై, కామశాస్త్ర సంకేతాలను సద్యస్ఫూర్తితో వినియోగించే నేర్పుకల పడతి భార్యగా లభించవచ్చును. అపుడామె యీ సంకేతాలను వినియోగించడం జరిగితే—వీని అర్థాలను గ్రహింపజాలని భర్త సముచితముగా వ్యవహరింపజాలని మూఢుడు అవుతాడు. అపుడావనిత వానియందు విరక్తి చెందుతుంది. అందుచే పురుషుడు యీ సంకేతార్థాలను గ్రహించడం చాలాఅవసరం. తన భార్యకుకూడ అతడీ సంకేతాలను వివరంగా విశదీకరిస్తే పరస్పరం ఆనందించే అవకాశం ఉంటుంది.

"కామీ స్వాత్మాం పశ్యతి" అన్నారు. కాముకుడు తన మనస్సు లోని భావానికి అనుకూలముగా ఊహిస్తాడు. తాను ప్రేమించిన ఒక యువతి (ఆమె తన్ను ఎందుకో నవ్వితే, తన్ను చూచియే నవ్వుచున్న దనుకొనుట, పైట సరిచేసుకొంటె తన్ను చూచి సాభిప్రాయముగా అలా చేసినదనుకొనుట కాముకులకు సహజం. కేవలం ఇలా మనస్సులో ఊహించుకొని గాలిమేడలు కట్టుకొంటూ కూర్చుంటే కలిగే బాధ ఏమీ వుండదుకాని, యదార్థం తెలియకుండ ముందడుగు వేస్తే ప్రమా దం తప్పదు.

అలాగే ఈ సంకేత విషయాలలోకూడ—ఒక యువతి ఎందుకో తలమీద చేయి వేసుకొంటే, ఆమె తన్ను ఆరాధిస్తున్నానని ఆంగిక సంకేతంద్వారా తెలియజేస్తున్నదని, గుండెపై చేయి వేసుకొంటే 'నేను నిన్ను ప్రేమిస్తున్నానని సూచిస్తూ ఉన్నదని'— యీ మొదలుగా భావించడం, భావించి ముందడుగు వేయడం ప్రమాదాన్ని తెచ్చి పెడ తాయి. బాగా నిదానించి, ఆమె యీ సంకేతం ఎఱిగి వుండి చేస్తు న్నదా లేక తలవని తలంపుగా అలా జరిగినదా, అన్న విషయం గమ నించి రూఢిచేసుకొనికాని ముందడుగు వేయకూడదు. పూర్వ పరిచి తులైన యువతీయువకులైతే అలా సంకోచింప నక్కరలేదు.

యువతి చేసిన సంకేతాన్ని సరిగా తెలిసికొనక తప్పుగా తెలిసి కొని వ్యవహరించడం మరీ ప్రమాదాన్ని తెచ్చి పెడుతుంది. కామ శాస్త్ర సంకేతములన్నియు తెలిసికొన్నదైన ఒక యువతి తనవలెనే విజ్ఞుడైన తన ప్రేమికునకు—"తూరుపు దెసగా రమ్మని చూపుడు వ్రేలిని ప్రదర్శిస్తే" ఆ యువకుడు ఆ సంకేతాన్ని తప్పుగా అర్థంచేసి కొని 'పడమరగా' ఆ యింట ప్రవేశిస్తే ప్రమాదం కలుగదా?

రత్న కుమారుడనే వాడు వెనుక ఈ విధంగానే ఒకనాగర యువతి చేసిన సంకేతాన్ని తప్పుగా అర్థంచేసుకొని వ్యవహరించినవాడై పరాభవింపబడ్డాడని ప్రాచీనకామశాస్త్రాలలో ప్రాసంగికంగా చెప్పబడ్డది.

అందుచే స్త్రీ పురుషులు, విశేషించి పురుషులు శాస్త్రం విశదీకరించిన ఈ సర్వసంకేతాలను తెలిసికొని అవి తెలిసిన వారియొద్ద ఉపయోగిస్తూ—ఎవరైనా ఉపయోగించిన సంకేతార్థాన్ని నిదానంగా గ్రహించి వ్యవహరిస్తూ వచ్చినపుడు జీవితాన్ని ఆనందకందం చేసికొనగలుగుతారు.



# శృంగార చేష్టలు

ఏ సంకేతాలైనా యువతీ యువకుల మానసంలో శృంగారభావం ఉద్బంధమైనపుడు (మేలుకొన్నపుడు) చేయబడితేనే చరితార్థం అవుతుంది. వట్టికట్టెల ప్రోవుదగ్గర కూర్చుండి చలికాగడం అన్నది సాధ్యం కాదు. ఆ కట్టెలయందు అగ్ని జ్వలిస్తూండాలి. అప్పుడే ఎవరైనా తమ శీతబాధను తొలగించుకొనగలుగుతారు. అలాగే కామినీకాముకుల మానసంలో శృంగారభావం జ్వలిస్తూ ఉన్నప్పుడే సంకేతము మొదలైన వ్యవహారాలన్నిటికి అవకాశం ఏర్పడుతుంది. సాధారణంగా యౌవ్వనం వచ్చేసరికి అందరియందు యీ శృంగారభావం మేల్కొనడానికి తగినస్థితి కలదై యుంటుంది. కాని లోకంలో వయసువచ్చినా శృంగారభావంయొక్క స్పర్శ అయినా ఎఱుగని మనస్సుకలవారుకూడ ఉంటారు. రామాయణంలోని ఋష్యశృంగుడు అట్టివాడు.

ఒకప్పుడు అంగదేశములో కరవువచ్చింది. వానలులేవు. జనం అన్నంలేక అల్లాడిపోతున్నారు. వానలు కురిసి కరవు తొలగాలీఅంటే ఎవరైనా మంచి శీలంకల మహర్షి యీ దేశంలో అడుగుపెట్టాలి. అప్పుడు మాత్రమే యీ కరవు తొలగే అవకాశం ఉన్నదన్నారు పండితులు. అయితే అట్టి మహర్షి యెవరన్న ప్రశ్న బయలుదేరింది. చివరకు విభాండకుడనే ఋషికి కుమారుడైన ఋష్యశృంగుడట్టివాడని తేలింది. ఆ ఋష్య శృంగుడు విభాండకుని కట్టడిలో తన తపమేమో తన జపమేమో తప్ప ఇతరచింత లేకుండ జీవిస్తున్నాడు. యౌవ్వనం

వచ్చినా ఆయనకు స్త్రీ అంటే ఏమిటోకూడ తెలియదు. ఆయనను అంగ దేశానికి తేవడం ఎలా ? ఎవరీ పనికి పూనుకొంటారు. రావయ్యా ! అని ఆహ్వానించిన మాత్రంలో వస్తాడో రాడో, అన్న శంకకూడ కలిగింది.

అంగ దేశంలోని వేశ్యలు మిక్కిలి రూపవతులు. తమ సౌంద ర్యంతో ఎట్టివానినైనా సరే పాదదాసుడుగా చేసికొనగలమన్న గర్వంకలవారు. వారు మేమా ఋష్యశృంగుని ఈ దేశానికి తీసుకు రాగలము"న్నారు.

ఆ వేశ్యలలో పడుచుదనంలోఉన్న నెరజాణలైన అందగత్తెలు కొందరు విభాండకుని ఆశ్రమానికి చేరుకొన్నారు. వారు వచ్చిన సమ యానికి విభాండకుడు ఆశ్రమంలో లేడు. ఋష్యశృంగు డొక్కడే ఉన్నాడు. ఆశ్రమానికి వచ్చిన యీ వేశ్యలనుజూచి ఆయన ఆశ్చర్య పడ్డాడు. ఆయన వారినిచూచి—"ఎవరో ఋషి కుమారులు, మిక్కిలి తపంచేసి ఎంతో తేజం సంపాదించుకొన్నారు. నేనూ తపస్సు చేస్తు న్నాను కాని ఇంత తేజం నాకు కలుగలేదే!" అనుకొంటూ ఇలా ప్రశ్నించాడు.

ఓ ముని కుమారులారా! మీరెవరు ? మీరు చేసే తపోవిధా నం యేమిటి ? మీ జుట్టు అంతపొడవుగా సుందరముగా ఉన్న దేమిటి? మీ ముఖంమీద యీ వింత తేజస్సు యెలా యేర్పడ్డది ? అని ప్రశ్నించాడు.

ఆ వేశ్యలు ఋష్యశృంగునియొక్క ఈ ప్రశ్నలువిని ఆశ్చర్య పోయారు. అయినా వారంతా నెరజాణలు. "మేము చేసే తపస్సును గూర్చి వివరిస్తాం రమ్మంటూ వారు ఆయనను సమీపములోవున్న నదికి తీసికొనివెళ్లేరు. అక్కడ నదిలో ఋష్యశృంగునితో వారున్ను స్నానంచేసేరు.

ఆ వేశ్యలు ధరించిన వస్త్రాలు మిక్కిలి పల్చనివి. ఆ పల్చని వస్త్రాలు నీటితో తడిసి వారి శరీరానికి అంటుకొనిపోయాయి. అప్పుడు

ఋష్యశృంగుడు వారివంక చూచి మరీ ఆశ్చర్యానికిలోనై ఇలా అన్నాడు.

"ఋషికుమారులారా! మీ ముఖము మీద తేజస్సుకే ఆశ్చర్యపడ్డాను. ఇప్పుడు మీ గుండెలమీద బంతుల వంటివి ఏవో కనబడుతున్నాయి. అవేమిటి? అన్నాడు.

వేశ్యలు ఆయనయొక్క యిలాంటి ప్రశ్నలకు ఏవో సమాధానాలు చెపుతూ క్రమంగా ఆయనను అంగదేశానికి తీసికొని వచ్చారు. ఋష్యశృంగునిరాకతో అంగ దేశంలో వర్షాలుకురిశాయి. కరవు తొలగింది. ఆ ఋష్యశృంగుడే దశరథునకు సంతానం కలుగకపోతే 'పుత్రికామేష్టి' చేయించాడు. ఆ యాగ ఫలముగానే రామ, లక్ష్మణ, భరత, శతృఘ్నులు జన్మించారు. ఈ కథ రామాయణంలో విపులంగావుంది.

లోకంలో ఋష్యశృంగునివంటి ప్రకృతులుచాలా అరుదు. సాధారణముగా బాల్య యౌవ్వనాల సంధియందే శృంగార భావం జాగృతం అవుతుంది.

కొందరి యందీభావము చాల తక్కువగా యుంటుంది. కొందరి యందిది ఎక్కువగాను, మరికొందరియందు చాల అధికంగాను ఉంటుంది.

అసలు యీ శృంగార భావము యేయే అంతరువులలో జన్మిస్తుంది? అన్న విషయాన్ని అలంకారికులు అలంకార శాస్త్రాలలోని రసచర్చలో విపులంగా వివరించారు. ఆ వివరణ అంతా చెప్పడానికి ఇది స్థానంకాదు. అయినా అల్పంగానైనా వివరించకపోతే దాని రూపం తెలియడం కష్టంగనుక కొంత వివరిస్తున్నాము.

"సహజంగా స్త్రీని అనుభవించవలెనన్న కోరిక పురుషుని మనస్సులోను, పురుషుని పొందు బడయాలన్న కోరిక స్త్రీ మనస్సులోను ఉంటుంది. అయితే ఆ కోరిక బాగా నివురుగప్పిన నిప్పులా వుంటుంది. కోరికయొక్క అట్టి స్థితినే 'రతి' అన్నారు.

ఇలా నివురు గప్పిన నిప్పులా తన ఉనికి తనకే తెలియనంత అజ్ఞాతంగా ఉన్న "రతి" (సంభోగేచ్ఛ) తనకు నచ్చిన యువతీ సందర్శనంతో పురుషుని మనస్సులోను, అందగాడైన యువకుని సందర్శనంతో తరుణీ మానసమందు— ఆ నివురు తొలగించుకొని కొంత బయటకు వస్తుంది. అంటే అజ్ఞాతంగా ఉన్న "రతి" యువతీ యువకులను, వారి వేషభాషాదికాన్ని, వయస్సును, సౌందర్యాన్ని వాతావరణాన్ని (వసంతకాలం, సాయంసమయం. మలయపవనం, వెన్నెలరాత్రి) ఆలంబంగా (ఆధారంగా) చేసికొని మేలుకొంటుంది.

అలా "రతి" ఇంచుక మేలుకొన్నంతనే దానియొక్క దీప్తి మనస్సులోనికి, బుద్ధిలోనికి, వాక్కులోనికి, శరీరంలోనికి వ్యాపిస్తుంది. అనగా మనస్సుయొక్క ఆలోచనాశక్తి, బుద్ధియొక్క వివేచనాశక్తి పూర్వంవలెకాక క్రొత్తదారులు త్రొక్కుతాయి. మాటలలో, శరీరంలో కొంతమార్పువస్తుంది.

ఒకయువతి ఉద్యానవనంలో ఏకాంతముగా సంచరిస్తోంది. వాతావరణం సుందరంగా వున్నది. ఆ సమయంలో అక్కడకే వచ్చిన ఒక యువకుడామె కంటబడ్డాడు. ఆ యువకుని చూచేసరికి ఆమె మనస్సులో ఏదో ఒక వింతకదలిక కలిగింది. సాయంకాలము, ఏకాంత సమయం ఆ యువకుని సౌందర్యం కారణాలుగా ఆ కదలిక మరికొంత పెరిగింది. అప్పుడామె మనస్సు సిగ్గుచే ఆవరింపబడ్డది. బుగ్గలు అనుకోకుండానే కొంత ఎఱుపెక్కాయి. ఆమె ఆయువకునితో ఏవో మాటలు మాట్లాడింది. ఆ మాటలలో ఏదో తెలియని తీయదనం మెదలుతుంది. ఆమె శరీరంకూడ ఏవో వింత సౌందర్యాలను వెలిజిమ్ముతుంది.

ఇదంతా "రతి" (సంభోగేచ్) ఇంచుక మేలుకొన్న తరువాత జరిగేపరిస్థితి. ఈస్థితికి చేరుకొన్న రతియే శృంగారభావమనబడుతుంది.

ఈ భావమే 1 అల్పము, 2 సామాన్యము, 3 అధికము అనే మూడు రకాలుగా వ్యక్తం అవుతూంటుందని వెనుక చెప్పబడ్డది.

ఒక యువతి ఒక యువకునివంక జూచి కొద్దిగా చిఱునవ్వు నవ్వడం మాత్రమే జరిగితే, అక్కడ శృంగారభావం అల్పంగామాత్రమే వ్యక్తమైనటులు గుర్తించాలి.

ఒకయువతి ఒకయువకునివంకజూచి కేవలం చిరునవ్వు నవ్వుటయే కాక పులకించిన శరీరం కలదికూడ అయితే శృంగారభావం చాలవరకు వ్యక్తమైనటులే గుర్తించాలి.

యువకునివంకచూచి యువతి-పులకించిన శరీరంకలది కావడమే కాక, నిట్టూర్పులు విడచిపెట్టడంవంటివికూడ జరిగితే ఆభావంఅధికంగా వ్యక్తమైనటులు గుర్తించాలి.

కామినీకాముకులు తాము పిలచినవారియందు శృంగారభావం ఏ అంతరువులో వ్యక్తమై ఉన్నదో గుర్తించాలి. అది తక్కువగా, లేక సాధారణంగా ఉంటే తను వర్తనంద్వారా దానికి దోహదం చెయ్యాలి. ఎంతో కాలంగా కలిసిమెలిసి కాపురం చేసుకొంటూఉన్న ఆలుమగలుకూడ శృంగారభావంయొక్క అధికదీప్తిని గమనించి వ్యవహరించినపుడు మాత్రమే ఎక్కువ ఆనందాన్ని పొందగలుగుతారు. శృంగారభావం అధికంగా దీప్తమైనపుడు స్త్రీ పురుషుల చేష్టలయందు మార్పువస్తుంది. ఈ చేష్టలద్వారా దాని దీప్తిని గమనించవచ్చును. వీనిని గుర్తించడం, గుర్తించి వ్యవహరించడంవల్ల భార్యా సాంగత్యంలో భర్తకు, భర్తయొక్క పొందులో భార్యకు మిక్కిలి ఆనందం కలుగుతుంది. ఈ చేష్టలు పదునారు రకాలుగా విభజింపబడ్డాయి. 1 హేల. 2 విచ్ఛిత్తి. 3 కిలికించితము. 4 విభ్రమము. 5 లీల. 6 విలాసము. 7 హావము. 8 విక్షేపము. 9 వికృతము. 10 మదము. 11 మోట్టాయితము. 12 కుట్టమితము. 3 ముగ్ధత్వము. 14 తపనము. 15 బిబ్బోకము. 16 లలితము— అని వానిపేర్లు. వీనియొక్క లక్షణాలు ఉదాహరణాలు దిగువ నీయబడుతున్నాయి.

**1 హేల** సంభోగేచ్ఛ ప్రబలంగాఉంటే ఆస్థితిని సూచించే చేష్టకే హేల అని పేరు.

"భార్యా భర్తలిద్దరియందు సంభోగ సమయంలో భార్యకంటె ముందుగా భర్త ప్రివృత్తుడవుతాడు. స్త్రీ తన బిగింపును వదలి ముందుగా సిద్ధంకావడం అనేది ఎన్నడో కాని జరుగదు. కోర్కె ఉన్నా తనంతతానై ప్రివర్తించకపోవడం స్త్రీలయొక్క లక్షణం. ఈ సహజ లక్షణాన్ని విడచి భార్య తానే ముందుగా పతిని అతడు కోరకుండగానే కౌగలించుకొని ముద్దుపెట్టుకొనడం, సంభోగ మధ్యంలో తనంత తానుగా భర్తను క్రిందుజేసి పురుషాయితం(పురుషునివలె ఆచరించడం) చేయడంవంటిది జరిగితే అది శృంగారభావంనుండి పుట్టిన "హేల" అనే చేష్టగా గుర్తించాలి. ఈ హేల పురుషునకు మిక్కిలి ఆనందాన్ని ఇచ్చేది అవుతుంది. పురుషుడు తన వర్తనంద్వారా భార్యయొక్క మానసంలోని శృంగారభావాన్ని అధికంగా దీప్తంచేసిన మీాదట మాత్రమే భార్య యీా చేష్టను ప్రదర్శిస్తుంది.

**2 విచ్ఛిత్తి** : భర్తచేసినఅపరాధంకారణంగా భార్యతాను అలంకరించుకొనుట మానినదై, చెలికత్తెలు అలంకరింపబూనుకొన్నా తిరస్కరించడం జరిగితే ఆ చేష్ట "విచ్ఛిత్తి" అనబడుతుంది. కొందరు "భర్త పిలుస్తూఉన్నా సిగ్గుచే సమాధానం చెప్పనిదై భార్య ఉంటే ఆ స్థితి విచ్ఛిత్తి అనబడుతుంది" అంటారు.

"ఓసి చెలీ! నీ పతి ఏదో చిన్న తప్పిదం చేశాడేఅనుకో! అయినా ప్రియుని విషయంలో ఇంత అలగడం తగదు. ప్రేమించినవారిని క్షమించడంకూడ నేర్చుకోవాలి. అలంకరించుకోనంటావేమిటి? నేను జడ వేస్తాను, ఇలారా! అని చెలికత్తె అంటూ ఉన్నపుడు, అలంకరించడానికి పూనుకొన్నపుడు— "నాకు జడ అక్కరలేదు, నేను అలంకరించుకో నక్కరలేదు, నీవునాకు బలవంతంగా జడవేస్తావా ఏమిటి, లాగుతున్నావా"—అంటూ తోసి పుచ్చడం జరిగితే దానిని "విచ్ఛిత్తి" అనే శృంగార చేష్టగా గుర్తించాలి.

**3 కిలికించితము** : చిరకాలానికి వచ్చిన భర్తను చూచిన ఆనందాతిరేకంలో భార్య క్షణకాలం చిరునవ్వునవ్వి, క్షణం ఏడ్చి కండ్ల

నీరుపెట్టకయే, క్షణకాలం గట్టిగానవ్వి, క్షణం ఎందుకో భయపడి క్షణం కోపించి, క్షణం ఏదో అలసటను ప్రదర్శించి, అనేక భావాల సాంకర్యానికి లోనైతే ఆ చేష్ట "కిలికించితం" అనబడుతుంది.

"భర్త చిరకాలానికి యింటికివచ్చాడు. భార్య అతనినిచూచి కొంత ఆనందాన్ని వ్యక్తపరచి ఇంటిపనులన్నీ తొందరగా ముగించి, ఏకాంతంగా వున్న పడకటింటికి, భర్త సన్నిధికి చేరుకొన్నది. అప్పుడు భర్త ఆమెను పొదవుకొన్నాడు. ఆ స్థితియందామె కొంతసేపునవ్వి, "ఇంత కాలంగా నన్ను విడచి ఉండగలిగేరు, నేనేమైపోయానో అన్న చింతకూడ మీకులేదు" అంటూ చిరుకోపాన్ని ప్రదర్శించి, మీ వియోగంలో నేనెంతగా బాధపడ్డానని"పలుకుతూ ఏడ్పుకాని ఏడ్పును ప్రదర్శించి, తిరుగ నన్ను విడచి వెళ్ళవద్దంటూ భయాన్ని సూచించి అలసటతో అతని గుండెమీద ఒరిగిపోతే— ఆ చేష్ట కిలికించితం అనబడుతుంది.

**4 విభ్రమము :** పతి వస్తున్నాడని తెలిసినంతనే కలిగిన ఆనందంలో తొందరకలదై భార్య తన అలంకారాలను తారుమారుగా ధరించడం జరిగితే ఆచేష్ట 'విభ్రమము' అనబడుతుంది.

'ఏమే! రవిక తిరుగవేసి తొడుక్కొన్నావు. బొట్టు పెట్టుకోలేదా? అదేమిటి ముఖాన నల్లగా ఉన్నది! కాటుక పెట్టుకొన్నావా కంటికి పెట్టుకోవలసిన కాటుక ముఖానికి పెట్టుకొన్నావేమిటే! ఇదంతా బావవచ్చేడన్న ఆనందమేనా!'—ఇత్యాదిగా నవయువతుల విభ్రమచేష్టను జూచి ఆనందంతో వృద్ధులు పలుకుతూ ఉంటారు.

**5 లీల** తాను మిక్కిలిగా ప్రేమిస్తూఉన్న తన భర్తతోడి పొందు తనకు ఎంతకాలానికి లభించకపోతే, నిరంతరంభర్తనే ధ్యానిస్తూ అతని చరిత్రనే చెప్పుకొంటూ, మనో వినోదినికై చెలుల యెదుట— నా పతి యిలాఉంటాడని, ఇలా మాటాడుతాడని, ఇలానడుస్తాడని, ఆయన వేషం ఇలావుంటుందని, ఆయన ఇలానవ్వుతాడని, ఇలాకొంటె చూపులు చూస్తాడని అనుకరిస్తూ అభినయించడం 'లీల' అనబడుతుంది

"పార్వతీదేవి పరమశివుని గూర్చి తపం ఆచరిస్తూన్నది. ఆయన ఇంకా ప్రసన్నుడుకాలేదు. రోజురోజుకు పరమశివునికొరకై పార్వతి యొక్క తహతహ పెరిగిపోతోంది. ఒకరోజున ఆమె చెలులు ఆమెను చూడడానికై వచ్చారు. వచ్చిన చెలులను చూచి పార్వతి ఏవోకబుర్లు చెపుతూ కూర్చున్నది. కబుర్లన్నీ పరమశివునిగూర్చియే. అలాచెపుతూ పార్వతి "చెలీ! పరమశివుని రూపం ఎంత మనోరమైన దనుకొన్నావు ఆయన శిరస్సుపై జటాజూటం ఉన్నది. దానికి 'కపర్దం' అని పేరు. ఆ కపర్దం చక్కగా చుట్టబడి ఉంటుంది. దాని అందంచూస్తే తెలి యాలికాని చెబితే తెలిసేదికాదు. ఉండు! నా జుట్టునే కపర్దంగా చుట్టి చూపుతాను. "అంటూ తన జుట్టును శివ జటా జూటంలాచుట్టి, ఇదిగో! ఆయన జటాజూటం ఇలా అందంగా ఉంటుంది; అయ్యో! నా తెలివి తెల్లవారినట్లేఉంది; ఆయన జటాజూటానికి దిగువగా చం ద్రరేఖ వెలుగులు కుమ్మరిస్తూంటుంది. అదిలేకపోతే జటాజూటానికి అంత అందం ఎక్కడినుండి వస్తుంది. కపర్దాన్ని చూపడానికి నాజుట్టును చుట్టగాచుట్టాను కాని చంద్రరేఖను చూపడంఎలా? అయినా ఉండు! అంటూ తెల్లని మొగలిపూరేకను చంద్రవంగా కత్తిరించి నొసట ధరించి—ఆయనయొక్క 'కపర్దము' చంద్రరేఖ ఇలాఉంటాయి, ఆయన శరీరం తెల్లగా మెరుస్తూంటుంది. నా శరీరం నల్లగా వున్నది. అని తెల్లని మంచిగంధం ఒడలినిండా పూసుకొని, ఆయన మెడలో యజ్ఞో పవీతాలు (జంధెము) తెల్లగా మెఱుస్తూంటాయి అని తామర తూడు లను చీల్చగా వచ్చిన తెల్లని దారాలను యజ్ఞోపవీతాలుగా ధరించింది. ఇది ఒక కవిచేసిన వర్ణన.

స్త్రీలయొక్క ఇట్టి చేష్ట "లీల" అనబడుతుంది.

**6 విలాసము :** వచ్చిన భర్తను చూచినది మొదలు నవ యువతియైన భార్యయొక్క నడకలో, కూర్చుండుటలో, ఉనికిలో, మాటాడుటలో, చూపులలో ఒకరకమైన మార్పువస్తుంది. ఈమార్పునే

లోంకలో 'ఒయ్యారం' అంటారు. ఇట్టి మారిన చేష్టకే 'విలాసము' అని పేరు.

"చెలి నీ ముఖంమీద యీ వింత కాంతియేమిటే! నా ప్రశ్న విని నవ్వుతావు దేనికి! నీ నడక చాల ఒయ్యారంగా ఉన్నదే! ఈ ఒయ్యారపు నడక ఎక్కడనేర్చావు! పడగలవు మాటాడవేమిటి! పలుకే బంగారమైనదా యేమిటి! అసలు నామాటలు నీకు వినబడు తున్నాయా! ఎందుకే అక్కడే నిలువబడిపోయావు? నీలో ఏదో మార్పు వచ్చింది. నీపతి వచ్చినాడేమిటి? ఆయనరాక నీలో ఆనంద జ్యోతి వెలిగించి వుంటుంది. అందుకే యీ మార్పులన్నీ వచ్చాయి.— ఇత్యాదిగా విలాసాన్ని ప్రదర్శించే యువతులనుగూర్చి వారిచెలికత్తెలు పలుకుతూంటారు.

పదునారేండ్ల వయసులోని కన్యకు పెండ్లిచేసి 'శోభనం' ఇంకా చెయ్యక ఏ పండుగకో ఆమె భర్తను ఆహ్వానించి తీసికొనివస్తే, పతి యింటికి వచ్చిన సమయంలో ఆమె ఒక్కసారిగా మారిపోతుంది. అట్టి వారి యందే విలాస లక్షణాన్ని స్ఫుటంగా గుర్తించవచ్చును.

7. హావము:—కన్నులయొక్క కనుబొమ్మలయొక్క కదలికలోని మార్పు కారణముగాను, మాటలోని మాధుర్యం కారణంగాను, సంభోగేచ్ఛ కొంచెముగా వ్యక్తం అయితే ఆచేష్ట "హావం" అనబడుతుంది.

"పెండ్లి కొడుకును చూచేవు కదా! మా కందరికీ నచ్చేడు. పున్నమి చందురుడులా ఉన్నాడు. మెరుస్తూ ఉన్న పెద్ద కళ్ళు – ఉంగరాలు తిరిగిన నల్లని జుట్టు – పల్చగా, పచ్చగా పొడవుగా నాజూకుగా ఉన్నాడు. ఇంతకూ నీకు నచ్చినాడాలేదా? అలా చూస్తావేమిటే! చెప్పు!" అని పెద్దలడిగితే పదునారేండ్ల కన్యక

కొంచెంగా నవ్వుతూ – మెరసే కండ్లతో క్రింది చూపులు చూస్తూ, కనుబొమలుకదలిస్తూ "నాకేం తెలుస్తుంది, మీయిష్టం!" అన్న మాటలు మధురంగా పలుకుతుంది. ఇదిగో! ఇట్టి చేష్టకే "హావం" అని పేరు.

8. విక్షేపము - పతిని గాంచిన సంతోషములో ఏదో ఆవేశమునకు లోనై స్థిరతను వీడి వివిధవికారములను ప్రదర్శించుట "విక్షేపము"- అని కొందరి మతము.

మరికొందరు యువతి నగలు సగము సగముగా ధరించి, జడ పూర్తిగా కాక సగమే వేసికొని, ఊరకే క్రీగంట చూస్తూ పతితో గుసగుసలాడడం విక్షేపమన్నారు.

"ఓయి మిత్రుడా! నీయొద్ద దాపరిక మేమున్నది. నిన్న నేను నాప్రియతమ సన్నిధికి వెళ్ళేను. అప్పుడామె తల్లిదండ్రులను, బంధుజనమును తప్పించుకొని నాయొద్దకు వచ్చినది. ఆసమయంలో ఆమె రూపము పరమ మనోహరంగా ఉన్నది. జడసరిగా అల్లుకొనలేదు. కాటుక సరిగా పెట్టుకొనలేదు. నుదుట కుంకుమతిలకము చక్కగా దిద్దుకొనలేదు. నడుమునకు ఉన్న ఒడ్డాణములోని మువ్వలు చక్కగా ధ్వనిస్తున్నాయి. మెడలోని హారాలు బుజంమీదకు జారిఉన్నాయి. ఇట్టి రూపముతో ఆమె నాయొద్ద కూర్చుండి ఏవో మాటలు లజ్జానమ్రముఖియై మధురంగా పలికింది. ఇట్టిదైన ప్రియారూపం నామానసంలో హత్తుకొని పోయింది."

యువతీ గతమైన ఇట్టి చేష్ట విక్షేపము అనబడుతుంది. సాధారణముగా ఈ విక్షేపమన్న చేష్ట నవదంపతులయందు గోచరిస్తుంది. వివాహము జరిగిన కొలది కాలానికే వరుడు అత్తవారి యింటికి ఏపండుగకో వెళ్ళినపుడు – భర్తతో కొంత పరిచయం ఏర్పడీ ఏర్పడనిస్థితిలో ముద్దురాలైన వధువు ఈ విక్షేపాన్ని అనుకొనకుండ(తలవని తలంపుగ) ప్రదర్శిస్తుంది. ఈవిక్షేపాన్ని వివాహితులైన దంపతులందరును అనుభవించియే ఉంటారు. ఏదో తెలియని ఆనందాన్ని అందుకొంటున్నామనియే తప్ప, ఆఆనందం ప్రియురాలు ఆచరించే విక్షేపమనే చేష్టవల్ల లభిస్తోందని పురుషునకు, ఇట్టి చేష్ట నాచే ఆచరింపబడి భర్తయొక్క మానసంలో ఆనందతరంగాలను సృష్టిస్తూ ఉన్నదని వధువుకు తెలియ

కుండగనే ఈ విక్షేపం ఏర్పడుతుంది. అందువల్లనే "కామో నాఖ్యాత శిక్షితః"- గురువులయొద్ద చదువకపోయినా కామం తెలియబడు తుందన్నారు.

**9. వికృతము:-** పతితో మాటాడునపుడు వనిత అతని మాటలకు కావలెనని వంకర సమాధానములు చెప్పుట 'వికృతము' అనే శృంగారచేష్టగా పేర్కొనబడ్డది. అనురక్తులైన భార్యాభర్తలయొక్క చేష్టలు ఎట్టివైనా పరస్పరం ఆనందాన్నే కలిగిస్తాయి. భర్త యేదో అంటే భార్య ఆశబ్దాన్ని కొంత పెడగా విరచి వక్రంగా సమాధానం చెప్పడం సాధారణంగా కనిపిస్తూ ఉంటుంది. అయితే ఈ వక్రత భార్యాగతమైనది కావడంవల్ల పురుషుని మానసంలోని శృంగారభావాన్ని తరంగితం చేస్తుంది.

"ఆలుమగలు పరస్పరం దగ్గరగా కూర్చుండి ఉన్నారు. ఆమె మెడలో హారాలు, కాళ్ళకు అందెలు ధరించి ఉన్నది. ఆ సమయంలో ప్రియుడు ఊరకనే – నీమెడలోని నగ పేరేమిటి ? అన్నాడు. ఆమె కేవలం నవ్వులాటకై నామెడలోనిది హారం అనడానికి బదులుగా- మెడలోని నగ 'నూపురం' అంటే "అందె" అన్నది. అయితే నీకాలికున్న నగ పేరేమిటి ? అన్నాడు భర్త. ఆమె కూడ తడుముకోకుండా-అదా, అది కంకణం, అన్నది తన సమాధానాని తానే నవ్వుకొంటూ.

ప్రియురాలి యీసమాధానానికి నవ్వుతూ ప్రియుడామె బుగ్గపై సన్నగా గిల్లేడు. ఆమె బుగ్గను చేతితో రాసుకొంటూ ఏమిటిది ? అన్నది. వెంటనే ప్రియుడు- ఇదా, ఇది చుంబనం, అంటే ముద్దు - అన్నాడు. నవ్వుతూ - ఆమె నవ్వింది, అతడామెను కౌగలించుకొన్నాడు.

ఇదుగో ! ఇట్టి చేష్టకే వికృతమని పేరు.

**10 మదము** - కొంతమంది స్త్రీల శరీరంలో యౌవనం సన్నసన్నగా ప్రవేశిస్తుంది. అధికంగా విజృంభించదు. కొంతమంది స్త్రీల

విషయంలో అలా కాక యౌవనం వస్తూనే ఉద్ధృతంగా వస్తుంది. ఉద్వేలంగా విజృంభిస్తుంది. నిన్నకాక మొన్నటిది. రెండు నెలలేకదా అయింది. దీనిని చూచి, అప్పుడే ఎంత మారిపోయింది. ఎంత మనిషి అయింది- అన్నమాటలు ఉద్ధృతంగా యౌవనం ప్రవేశించగా మారిన వారిని గూర్చి లోకం అంటూ వుంటుంది. అట్టి స్త్రీలయందు మద్యము త్రావినవారియొక్క- లక్షణాలతో సమానమైన లక్షణాలు కొన్నిగోచరిస్తాయి. ఇదుగో ! ఈ లక్షణ సముదాయమునకే మదము అని పేరు. "మదవతి" అనగా నాలుగు అంచులా సందు లేకుండా వ్యాపించిన యౌవనంవల్ల పిటపిటలాడుతూ, కనులకు నిండుగా సుపుష్టంగా కానవచ్చే యువతి, యువతీ శరీరంలో గోచరం అయ్యే యీమదం అనగా యౌవనంయొక్క- అధికస్ఫూర్తి పురుషుని మానసంలో శృంగారభావానికి అధికమైన దీప్తి కలిగిస్తుంది.

"ఏమేవ్ ! నీవు చాలా మారేవు. నిన్న మొన్నటిదాకా నీ యీ మార్పు నేను గమనించనేలేదు. నీవు మాటాడుతూ ఉండగా తెల్లని నీ పలువరుస వెన్నెలలు కురిపిస్తూ వున్నట్లున్నది అనిపిస్తోంది. నీ చూపులలో మంచి దీప్తి ఏర్పడ్డది. బుగ్గలు నున్నగావుండి నాకే ఒకసారి ముద్దుపెట్టుకోవాలి అనిపిస్తోంది. కనుబొమలకు నాట్యంలో పాండిత్యం అలవడినది. నడకలో ఒయ్యారాలు ప్రవేశించాయి. స్వభావంలో చాంచల్యం ఏర్పడినది. నీవు మన్మథుని చేతిలోని సానపెట్టిన ఖడ్గంలావున్నావు. ఇక నీపతి ఎలాటివాడైనా నీఆన మీరలేడు.

ఇట్టిమాటలు మదంఅనే శృంగారచేష్టను ప్రదర్శించే వనితలను గూర్చి లోకం అంటూవుంటుంది.

**11 మోట్టాయితము :-** ప్రియునిగూర్చినవిషయాలు ఎవరైనా చెబుతూవుంటే వింటూ వనిత ఒడలు విరచుకొనడం, ఆవులించడం, చెవులలో వ్రేళ్లుంచుకొని ఇటునటుకదపడం జరిగితే ఆ చేష్ట 'మోట్టాయితము' అనబడుతుంది.

ఈ చేష్ట వివాహానికి పూర్వదశయందు లేదా విరహావస్థ యందు పతియందనురక్తులైన స్త్రీలలో గోచరిస్తుంది. అనగా–తల్లి దండ్రులు తమకన్యకు తగినవరుడుగా ఎవరినో తీసికొని వచ్చినారు. ఆ వరుడువచ్చి యీ పెండ్లికూతురును చూచేడు; వెళ్లేడు. వివాహం సిద్ధారణ అయినటులేతోస్తోంది. ఇక్కడ ఈపెండ్లికూతురుకూడ ఆ వరుని తిలకించి వున్నదికదా! అతడు సుందరుడు. ఈమె కంటికి నచ్చేడు. ఇంటిలో ఈ వివాహాన్ని గూర్చి తల్లి దండ్రి మాటాడు కొంటున్నారు. వారు వరునిగూర్చి – అతనికి సంగీతంలోకూడ మంచిప్రవేశం వున్న దట! ఎంతో బాగా పాడగలడట! ఎంతో వినయం కలవాడు. వాళ్లకు తోటలు, దొడ్లు ఉన్నాయి. ఇంతమంచి సంబంధం కుదరడం అమ్మా యి అదృష్టం–ఇత్యాదిగా ఆ వరుని గుణగణాలను సంపదనుగూర్చి చె ప్పకొనే సమయంలో ఆమెచెవులు దోరపెట్టుకొని వింటుంది. వినుట యేకాక అత్యధికానురాగంలో ఒడలు విరుచుకొంటుంది. ఆవులిస్తుంది. ఈచేష్ట విరహిణి అయిన యువతికూడ ప్రియకథాశ్రవణవేళ ప్రద ర్శిస్తుంది.

హిమవంతుని ఇంటిలో పార్వతిపెరుగుతుంది. పార్వతికి తగిన వరుడు పరమశివుడే అన్నవిషయం నిశ్చయం అయింది. అంతా ఆ పర మశివునిగూర్చియే మాటాడుకొంటున్నారు. ఆశివునిపాదాలకు మహా ర్షులుకూడ తలలువంచి నమస్కరిస్తారనేవారు కొందరు. ఆయనకు తెలి యని విషయమేలేదు, ఆయన సర్వజ్ఞుడ అని కొందరు, అంతేకాదు, ఆ యన మృత్యువునికూడ జయించేడట, ఇంతవరకు ఆయనకు పెండ్లికా లేదు, అనికొందరు హిమవంతుని కుటుంబంలోనివారు చెప్పకొంటు న్నారు. పార్వతీదేవి ఆమాటలను కుతూహలంతో వింటోంది. వినాలని వున్నా లజ్జకారణంగా విననటులే వినాలన్న ఆసక్తిలేనటులే చరిస్తోంది. కాని మనసులోనికోరిక ఆమెను ఆమాటలు వినబడేచోటికి లాగుతూనే వున్నది. వెళ్లివిన్నపుడల్లా ఆమెమానసంలో ఏవో మధురములైన ఊహ

హాలు మెదలుతూనేవున్నాయి. ఈస్థితిలో ఒకసారి యిట్టిపరమశివగుణ గానం విని ఆమె ఒడలు విరచుకొన్నది. ఆపులించినది. ఆచేష్ట నెర జాణలైన ఆమె చెలులకంటబడ్డది. వారునవ్వేరు. పార్వతిమొగం సిగ్గు తో ఎఱ్ఱతామరమొగ్గ అయినది." ఇదుగో! ఇట్టిచేష్టకే మోట్టాయి తము అనిపేరు.

**12. కుట్టమిత — :—** తాను మిక్కిలిగా వలచిన ప్రి యుడు ప్రేమతో తన్ను సమీపించి తన స్తనాలను, కేశాలను గ్రహించి ఆలింగనం చేసికొన్నపుడు కలిగిన అధికానందంలో యువతి అప్పుడప్పుడు బాధను వ్యక్తపరచడం అబ్బ! అయ్యో! అనడం జరు గుతుంది. ప్రియురాలి నోటినుండి వచ్చే యీ మాటలవలన ప్రియుని యందలి శృంగారభావం ఉత్తేజితం అవుతుంది. ఇట్టిదైన దుఃఖా విష్కరణ చేష్టయే 'కుట్టమితము' అనబడుతుంది.

'అబ్బా! చేతులతో అంతగట్టిగా నొక్కితే సహించుకొన గలనా? అంతమోటదనమైతే ఎలా? అనేమాటలు భార్యపలుకగా పురుషుడు వినడం, విని అధికమైన ఉత్సాహాన్ని పొందడం సాధా రణంగా జరుగుతూనే వుంటుంది.

ఇదుగో! వనితలొనరించే యిట్టిచేష్టయే 'కుట్టమితము' అన బడుతుంది.

**13. మౌగ్ధ్యము :-** ఇప్పుడిప్పుడే యౌవనావస్థలో అడు గుపెట్టిన వనితను 'ముగ్ధ' అంటారు. ఆమె మన్మథవ్యాపారం ఎరు గనిదై అమాయికయై వుంటుంది. ఆమెలో లోకజ్ఞత తక్కువగా వుంటుంది. లజ్జ మిక్కుటంగా వుంటుంది. ఇట్టివనితయొక్క స్వభా వమునకే 'మౌగ్ధ్యము' అనిపేరు. అమాయికములైన ఆమెపనులు మాటలుకూడ భర్త్రమానసంలోని శృంగారభావానికి చక్కిలిగిం తలు పెట్టజాలినవై వుంటాయి.

"ఒక ముగ్ధరాలు ప్రియునియొడిలో తలనిడుకొని శయనించినది. సిగ్గువల్ల ఆమెకు అలా శయనించకుండా వుండాలని వున్నా భర్త

చేతులలో ఆమె పరవశ అయివున్నది. ఆమె చేతులకు మంచిముత్యములు పొదగబడిన బంగారుగాజులున్నాయి. అవి ఆమెయొక్క కోమల హస్తాలకు ఎంతో అందాన్ని చేకూర్చాయి. అవి ప్రియునిదృష్టిని ఆకర్షించాయి. అతడామె కంకణాలను పరిశీలిస్తూ-ఈ ముక్తాఫలాలు చాలా ఉత్తమమైనవి."-అన్నాడు. ముక్తాఫలం అంటే మంచిముత్యమే. అవి సముద్రంలో ముత్తెపుచిప్పలలో దొరుకుతాయి. కాని ఈ విషయం ఆముద్దరాలికి తెలియదు. ముక్తాఫలం అంటే ఆమె ఏదోపండు అని అనుకొన్నది. అవి ఏవోచెట్లను పండుతాయని, ఆఫలాలే తనచేతి గాజులలో మెరుస్తున్నాయని అనుకొంటోంది ఆమె.

అందుచే వెంటనే ఆమె తనప్రియునితో-ముక్తాఫలాలు పండే చెట్లు ఎక్కడవుంటాయి? నేనెప్పుడూ ఆచెట్లను చూడనేలేదు-అన్నది ఆమెయొక్క యీ అమాయికత అతని ఉత్సాహానికి దీప్తినికలిగించింది. అతడునవ్వుతూ ఆమెను అక్కునజేర్చుకొన్నాడు. ఇదిగో ! ఇట్టి అమాయికతా లక్షణమునకే మౌగ్ధ్యము అనిపేరు.

**14. తపనము :-** ప్రియుడు అర్ధరాత్రముపరకు రాకపోయినచో ప్రియురాలు మిక్కిలిగా తాపానికి లోనుకావడం 'తపనము' అనబడుతుంది. ఈసమయంలో స్త్రీలు ఎక్కువగా నిట్టూర్చుట, కన్నీరుపెట్టుకొనుట, తమ దురదృష్టాన్ని నిందించుకొనుటద్వారా తమ తాపాన్ని వ్యక్తపరుస్తారు. తనకై యింతగా తపించే ప్రియురాలిని చూచేసరికి ప్రియునకు కలిగే ఆనందం వర్ణనాతీతంగా ఉంటుంది. ప్రియునితో శృంగారరసానికి యీ విధంగా దోహదంచేసే చేష్టకే 'తపనము' అనిపేరు.

అర్ధరాత్రం కావస్తోంది. వచ్చెదనన్న ప్రియుడు రాలేదు. తానేమో అలకరించుకొని కూర్చున్నది. శయ్యాగారం సుసజ్జితంగా ఉన్నది. వెలిగించిన అగురువత్తులుకూడ మేమింక నిరీక్షించలేమన్నట్లు నివురుగక్కి చల్లారిపోయాయి. సాయంవేళ అరవిరసిన బొడ్డుమల్లెలను

తాను సిగలో తురుముకొన్నది. అవి క్రమంగా వికసించడమే కాక రేకలను రాల్చే దశకుచేరుకొంటున్నాయి. ప్రియుడు వస్తాడన్న ఊహతో మనస్సులోని కోరికలు రెపరెపలాడగా తనూతాపం పెరిగింది. ఆ ప్రియుడు రాలేదు ఆమె తన నితంబాన్ని చేతితోనొక్కుకొని నిట్టూర్చింది, శయ్యపై నిద్రిద్దామని ఇటునటు పొరలాడింది. తాపం పెరుగుతోంది ప్రియుడు రాలేదన్న బాధవల్ల కన్నులలో నీరు చిప్పిలుతోంది.

ఈస్థితిలో ప్రియుడు వచ్చేడు. తనకై తపించే ప్రియురాలి యీ తపన ఆతనికంటబడ్డది. ఆతని పెదవుల్పై దరహాసం. మనసులో ఉత్సాహం వెల్లివిరిశాయి. అతడామెను కౌగలించుకొన్నాడు. ఆమె అలుకతో-"ఇదిగో ! ఇప్పుడేవస్తానని ఇంతఆలస్యంగానా రావడం? అన్నది. ఈమాటకూడ ఆమెలోని తాపాన్నే వ్యక్తంచేసింది.

అతడు-ఆలస్యమైనది అపరాధిని దండించు. బాహువులతో బంధనం, బొడ్డుమల్లెలు తురుముకొన్న జడతో దండనం - నేనుసిద్ధంగా ఉన్నాను - అన్నాడు. ఆమెనవ్వింది. అతనిఒడిలోనికి ఒరిగిపోయింది.

ఇదిగో ! ఇట్టిచేష్ట 'తపనం' అనబడుతుంది.

**15. లలితము :-** పరమసుకుమారముగా కన్నులను, కనుబొమలను, చేతులను కదల్చుట 'లలితము' అనబడుతుంది. ప్రియురాలి సర్వశరీరము ప్రియునిలోని శృంగారరసాన్ని తరంగితం చేసేదై వుంటుంది. ఆప్రియురాలే పరమసుకుమారంగా తన కాళ్ళు చేతులను కదలిస్తూ కనుబొమలను సుందరంగా పైకెత్తి క్రీగంట చూడడం జరిగితే ఆ చేష్టను ప్రియునిలోనికామం మరొకమెట్టు పైకి ఎక్కుతుంది.

"ప్రియురాలు ఇంటిలో ఏదోపని చేస్తోంది. ఆమెశరీరం మెఱుపుదీవలా మెఱుస్తోంది. పొడవైనజడ పిరుదలపై నాట్యం చేస్తోంది. ప్రియునకామెను ముద్దాడవలెననిపించింది. అతడామెకు వెనుకగవెళ్లి

ఒకచేతితో ఆమెజడనుపట్టుకొని వేరొకచేతితో ఆమెముఖమును తన వంకకు త్రిప్పుకొని ముద్దుపెట్టుకొన్నాడు. అప్పుడామె కనుబొమలను పైకెత్తి విస్ఫారితములు, చంచలములుఅయిన నేత్రాలతో కోపముకాని కోపమును వ్యతిరేకత కాని వ్యతిరేకతను ప్రదర్శిస్తూ చూచింది. ప్రియునకాచూపు మదనుని తూపు (బాణం) అయింది. అతడు ఆదేశముతో విహ్వలుడై ఆమెను గాఢంగా కౌగలించుకొన్నాడు.

ఇదుగో! ఇట్టి చేష్ట 'లలితము' అనబడుతుంది.

**16. బిబ్బోకము** - భర్త అధికంగా తన్ను ప్రేమిస్తున్న కారణంగా మిక్కిలి గర్వముకలదై వనిత తనకిష్టమైన వస్తువునందు అప్పుడప్పుడు భర్తయందు ఆనందం చూపడం లేదా అతనియొక్క ప్రణయకోపాన్ని లక్ష్యంచేయకపోవడం 'బిబ్బోకము' అనబడుతుంది.

సాధారణంగా భర్త ఎవరి వశమందుంటాడో అట్టి స్త్రీలయందు మాత్రమే ఈ విబ్బోకం అనే శృంగార చేష్ట వ్యక్తం అవుతుంది.

"ఇదిగో! యీ సన్నగడి చీర నీకై తెచ్చాను. అబ్బ! ఎన్ని కొట్లు తిరిగేనని; రంగుబాగున్నచోట నేత బాగులేదు. నేతబాగున్నచోట రంగుబాగులేదు. రెండూ బాగున్నచోట అంచు నచ్చలేదు. దాదాపు రెండుగంటలు వెదుకగా వెదుకగా యీచీర ఒకదుకాణంలో కనబడ్డది. ఆమధ్య నీవిట్టిచీర కావాలి అన్నావుకదా? అని అచ్చం నీవు కోరినరకం చీరకై శ్రమించి తెచ్చాను' - అన్నాడు భర్త భార్యతో.

భర్తకుతనమీదగల ప్రేమాధిక్యానికి గర్విస్తూవున్న ఆ భార్య ఆఁ! చాల శ్రమపడ్డారు! ఎలాగైతేనేం తెచ్చారు ఇన్నాళ్లకి ఒకనూలు చీర-అన్నది.

ఈమాటతో అతడు నీరసపడిపోయాడు. తానింత శ్రమపడి తెచ్చిన వస్తువుమీద, తనమీద ఇంత అనాదరం చూపినందులకు భార్యమీద కొంత అలుకకూడ వచ్చింది. కాని అలుకను ప్రదర్శించడానికి సమయం కాదనుకొన్నాడతడు.

రాత్రిఅయింది. ముందుగా పడకటింటికి చేరుకొన్న ప్రియుడు భార్యరాకకై మనసులో నిరీక్షిస్తూ శయ్యమీద పెడమొగంపెట్టుకొని శయనించాడు అలుకను ప్రదర్శించడానికి వీలుగా. కొంతసేపటికి – ఆభార్యవచ్చింది. కోపకారణం ఆమెకు తెలియనిదికాదు. ఆమెకు ఏదో ప్రళయం జరుగుతుందన్న జంకులేదు. భర్తయొక్క స్వభావం ఆమెకు తెలియనిదికాదు. తాను భర్తను సులభంగా ప్రసన్నుని చేసికొనగలనన్న ధైర్యం ఆమెయందున్నది.

“శ్రీవారికి అలుకవచ్చిందా ! పెడమొగంపెట్టుకొని శయనించారు”—అన్నదామె నవ్వుతూ.

భార్యకు సమాధానం చెప్పలేదు భర్త అతనిబిగింపు ఎంతటిదో ఆమెకు తెలుసు “అప్పుడే నిద్రపట్టిందికాబోలు ! అంతా దొంగ నిద్ర !”—అంటూ అతనికి చక్కిలిగింత పెట్టిందామె.

వస్తూవున్న నవ్వును ఆపుకొనడానికి వ్యర్థప్రయత్నం చేస్తూ నవ్వితే బిగింపుపోతుందని అతడు—ఏమిటది ? నన్ను తాకకు— అన్నాడు లేనికోపాన్ని ప్రదర్శిస్తూ.

ఆమె అతని కోపాన్ని లక్ష్యపెట్టక తిరుగ అతనికి చక్కిలిగింత పెట్టింది. అతడీమారు గట్టిగా కసరేడు.

ఈపర్యాయమామె – అంతాగొప్ప ! పోనీయండి” !–అంటూ తానుకూడ కోపాన్నే ప్రదర్శిస్తూ అతనివీపుకు తనవీపునాన్చి శయనించింది. పదినిముషాలు గడిచాయి, భార్యయొక్క శరీరసన్నికర్షకు భర్తయొక్క మనస్సులోని కోరిక పట్టుతప్పి విజృంభింపసాగింది. అతడు నెమ్మదిగా ఆమెవంకకు తిరిగేడు. ఆమెపై చేయివైచాడు. ఆమె తన విజయాన్ని గుర్తించింది. అతనిచేతినామె తొలగించలేదు, అతనివంకకు తిరుగనూలేదు. అతడే ఆమెను తనవంకకు త్రిప్పుకొన్నాడు. ఆమెఒక బొమ్మవలె ఇటుతిరిగింది.

ఏబిగింపు తాను ప్రదర్శించాలని ఆభర్త భావించాడో ఆబిగింపు భార్య చక్కగా ప్రదర్శిస్తోంది. అతనిలో కోరిక విజృంభించింది. దానికే

అనుగుణంగా భార్యకూడ ఆవేశంతో తన్ను ఆలింగనం చేసికొనేలా చెయ్యాలని అతని తాపత్రయం. ఆమెలోని కామాగ్నిని మండింపడానికై అతడేదేదో చేశాడు. కాని ఏం ప్రయత్నించినా ఆమెలోని కామాగ్ని లోలోపల ఏమిమండుతూవున్నదో కాని పైకి దానిజాడకనబడడంలేదు. అతని విషయం దీనికి భిన్నంగా ఉన్నది. భార్యామానసంలోని కామాగ్నిని దీప్తంచెయ్యాలని ప్రయత్నించినకొలది అతని మానసంలోని కామం సెగలెగయిస్తు విజృంభించింది.

భర్తయొక్క ఉద్ధృతమైన ఆవేశాన్ని చూచి ఆమెనవ్వుతూ— ఇందాక అలుకవచ్చిందా ? ఇప్పుడు అలుక తీరిందికాబోలు ! నన్ను తాకనే తాకకు నాతోమాటాడకు అన్నారు. ఇప్పుడిదేమిటి? —అన్నది అనుగ్రహిస్తు. ఆభర్త చెప్పగల సమాధానంలేదు. అతడామెను పొదవుకొన్నాడు. ఆమె అనుగ్రహించిందికదా ? వారిరువురు గాఢాలింగనంలో ఏకీకృత శరీరులయ్యారు.

ఇదికో ! జిబ్బోకం అనేచేష్ట ఈవిధంగావుంటుంది.

యీ శృంగార చేష్టలన్నిటిని గూర్చిన ఎఱుకనాగరకులుగా మనగోరే— స్త్రీ పురుషులకు మిక్కిలి వుసరం. దీనివలన వారు తమ ప్రియులయందు శృంగార భావం ఏ స్థాయిలో వున్నదో అన్నవిషయము తెలిసికొని వర్తించగలుగుతారు.

## -: స్త్రీ పురుష జాతిభేదములు :-

లోకంలో స్త్రీజాతి ఉన్నది. పురుషజాతి ఉన్నది. "స్తనకేశవత్ స్త్రీస్యాత్ లోమశః పురుషః స్మృతః" అన్నారు. అనగా స్తనములు, కేశములు స్త్రీజాతిలక్షణాలు. రోమసంపద (గడ్డము, మీసము) పురుషలక్షణములు యిలా రెండుగావున్న యీజాతులయందు ప్రధానలక్షణాలు సమంగావున్న కొన్ని కొన్ని భేదాలు కనబడుతూ వుంటాయి. ఆ భేదాలనుబట్టి యీ రెండుజాతులను తిరుగ మూడేసి తెగలుగా విభజించారు,

ఈ విభాగానికి ప్రధానలక్షణాలు పురుషాంగము, స్త్రీయొక్క యోని అయిఉన్నాయి. పురుషులందరియొక్క పురుషాంగములు సమానమైన పరిమాణం (పొడవు) కలిగిఉండవు. ఇట్లే స్త్రీలయొక్క యోనులుకూడ అన్నీ ఒకేవిధంగాఉండవు. వానియొక్క లోతులలో తేడాలు ఉంటాయి. కొందరు పురుషులకు పురుషాంగము ఆరుఅంగులముల పొడవుకలదిగావుంటే కొందరి పురుషాంగము తొమ్మిదిఅంగుళముల పొడవు కలిగివుంటుంది. కొందరి పురుషాంగము సుదీర్ఘమై పండ్రెండు అంగుళముల పొడవుకలిగివుంటుంది. ఇందు ఆరుఅంగుళముల పొడవుగల పురుషాంగముకలవారు శశజాతి పురుషులు అనబడతారు. తొమ్మిది అంగుళముల పురుషాంగములవారు వృషభజాతి వారనబడతారు. పండ్రెండు అంగుళముల పురుషాంగములవారు అశ్వజాతి పురుషులుగా పేర్కొనబడతారు.

ఇట్లే ఆరుఅంగుళములు మాత్రమే లోతైన యోనికల స్త్రీలు హారిణీ జాతివారనియు, తొమ్మిది అంగుళముల లోతైన యోనికల స్త్రీలు బడబాజాతి స్త్రీలనియు, మిక్కిలి యెక్కువగా 12 అంగుళముల వరకు లోతైన యోనికలస్త్రీలు హస్తినీజాతి స్త్రీలనియు చెప్పబడతారు.

అయితే యీలక్షణాలు ఆ స్త్రీ పురుషులను చూచీచూడగానే తెలియబడేవి కావుకదా ! అందుచే ఆయా జాతులయొక్క ప్రధాన లక్షణాలు గుహ్యావయవ పరిమాణములే అయిఉనప్పటికి కొన్ని బాహ్య లక్షణాలుకూడ చెప్పబడుతున్నాయి.

**శశజాతిపురుషులు** :— ఈజాతిపురుషుల శరీరం కాంతిమంతమై ఉంటుంది. వీరుఎల్లప్పుడు సంతోషంగావుండే స్వభావంకలవారై చిరునవ్వు నవ్వుతూవుంటారు. వీరి పలువరుస చక్కగా ఎగుడు దిగుడులులేక సమంగా ఉంటుంది. మధురంగా మాటాడడం వీరిపొత్తు. వీరి ముఖం గుండ్రంగావుంటుంది. చేతివ్రేళ్లు చాచినప్పుడు ఆవ్రేళ్లసందులు కనబడక మాంసలములై వుంటాయి. పలుచని పాదాలు,

పలుచని నడుము, పలుచనైన చెవులు కలిసి వీరుమిక్కిలి సుకుమారంగా వుంటారు. వీరియొక్క వీర్యం సువాసనా భరితమైవుంటుంది.

వృషభజాతి పురుషులు :- ఈ జాతి పురుషుల శరీరముకూడ కాంతిమంతముగానే ఉంటుంది. కాని వీరు శశజాతి పురుషులవలె సుకుమారంగా కాక తగినంత పుష్టికలవారై ఉంటారు. వీరి మెడ స్థూలంగా ఉంటుంది. వీరి చేతులు పాదాలు కూడ ఎఱుపులు చిమ్ముతూ ఉంటాయి. వీరి నేత్రాలలో చాంచల్యం ఉండదు. కన్నులలో స్థిరత్వమే ఎక్కువ కనబడుతుంది. కంటి రెప్పలకు దట్టముగ రోమాలు ఉంటాయి వీరికడుపు తాబేటి కడుపును పోలిఉంటుంది. మాటలు మృదువుగా ఉంటాయి. మొత్తానికి శరీరంలోని అన్ని భాగములయందు క్రొవ్వునిండి ఉండి వీరు చాల పుష్టిగా కానవస్తారు.

**అశ్వజాతిపురుషులు:** పై శశజాతి వృషభజాతి పురుషుల కంటె వీరు భిన్నంగా ఉంటారు. వీరి శరీరం కాంతిమంతమై ఉండదు. శరీరములో తగినంత పుష్టికూడ ఉండదు. వీరి శరీరావయవాలు మిక్కిలి పొడవుగా ఉండి తగినంత మాంసములేనివై కృశించినట్లు ఉంటాయి. ముఖ్యంగా ముఖము, చెవులు, శిరస్సు, పెదవులు వీనియందు ఈ దీర్ఘత్వము కృశత్వము గోచరిస్తాయి. వీరి తలమీద జుట్టు దట్టంగా వుంటుంది. అవయవాలన్నీ కూడ కొంతకు కొంత వంకరగా వుంటాయే కాని చక్కగా తీర్చి దిద్దినటులుండవు. కాలి పిక్కలయందు, పాదముల యందు ఈ వక్రత అధికంగా కానవస్తూంది. వీరివేళ్ళు పొడవుగా వుంటాయి. కంఠధ్వని మేఘధ్వనిని (ఉరుము) పోలి వుంటుంది. నేత్రాలు చంచలంగా వుంటాయి. తొడలు బలిసివుంటాయి వీరు వేగంగా నడచేవారై వుంటారు. ఈ లక్షణాలుకలవారిని అశ్వజాతి పురుషులుగా గుర్తించాలి.

**హరిణీజాతి స్త్రీలు:-** ఈ జాతి స్త్రీలు లలితమైన శరీరము కలిగివుంటారు వీరిశరీరము సన్నగా ఉంటుంది. శరీరచ్ఛాయ సాధార

ణంగా చామనచాయ అయివుంటుంది. చంద్రదర్శనంవలె వీరిదర్శనం కన్నులకు మనస్సుకు చల్లదనం చేకూర్చేదై వుంటుంది. వీరి దంతాలు మాత్రం పెద్దవిగా వుంటాయి. కంఠధ్వని పెద్దదిగా ఉండదు, శిరస్సుపై జుట్టు దట్టంగావుంటుంది. శరీరం శ్లేష్మతత్వ ప్రధానమై వుంటుంది. ఈ జాతి స్త్రీలు ఆహారం స్వల్పంగా స్వీకరించేవారై వుంటారు. వీరికపాల భాగము గూఢంగా వుంటుంది. ముఖము నున్నగా వుంటుంది, రతివేళ వీరియోనినుండి స్రవించేరజస్సు సువాసనలు చిమ్ముతుంది. ఇట్టిలక్షణాలుకల స్త్రీలను హరిణీజాతి స్త్రీలుగా గుర్తించాలి.

**బడబాజాతి స్త్రీలు:-** ఈజాతి స్త్రీల శరీరం పచ్చగా వుంటుంది వీరి శరీరము పిత్త (పైత్య) తత్వప్రధానమైనది. బలిసి కఠినంగా వుండే స్తనద్వంద్వం కలిగి వుండడం యీ జాతిస్త్రీల సహజలక్షణం. వీరి చేతి యెముకలు, కాలి ఎముకలు, మడతకీళ్ళు, మడములు కొంచెం వంకర తిరిగి వుంటాయి. చేతులు మృదువుగా మాంసలములై పుష్టిగా వుంటాయి వీరికి చెమట యెక్కువ. సన్నని నడుము సమానములైన అవయవములు కలిగి యీజాతి స్త్రీలు మెరుపు దీవలవలె మన్మథుని చికిలిచేసిన శస్త్రాలవలె మెఱుస్తూ ఉంటారు. రతివేళ వీరియోనినుండి స్రవించేరజస్సు మాంసముయొక్క వాసనవంటి వాసనకలదిగాఉంటుంది.

**హస్తినీజాతి స్త్రీలు:-** యీజాతి స్త్రీలు మిక్కిలిపొడవుగా వుండరు, కొంతకుకొంత పొట్టివారనియే నిర్ణయం. లావుగా మాత్రం వుంటారు. వీరితలమీద వెంట్రుకలు నల్లగా వుంటాయి. అంతేకాదు ప్రతి వెంట్రుక మిక్కిలి లావుగా వుంటుంది. వీరి శరీరచ్ఛాయ ఎఱుపు, శరీరతత్వం వాత ప్రధానంగా వుంటుంది. బలిసినచేతులు, పాదాలు కలవారై ఒకప్పుడు చల్లగా. వేరొకప్పుడు వెచ్చగా వుండే శరీరము కలవారై, యెక్కువగా మాటాడే స్వభావము కలవారై యీజాతి స్త్రీలు చంచలంగా వుంటారు. వీరిశరీరంలో క్రొవ్వుచాల ఎక్కువగావుంటుంది. వీరియోని అధికమైన రోమపంక్తితో నిండివుం

టుంది. రతివేళ వీరియోనినుండి స్రవించే రజస్సు ఏనుగుమదముయొక్క వాసనకలిగివుంటుంది. ఇట్టిలక్షణాలుకల స్త్రీలను హస్తినీజాతి స్త్రీలుగా గుర్తించాలి,

యీ బాహ్యాలక్షణాలు ఆధారంగా శశ-వృషభ-అశ్వజాతి పురుషులను, హారిణీ-బడబా-అశ్వజాతి స్త్రీలను సులభముగా గుర్తించి తెలిసికొనవచ్చును. కాని యీ లక్షణాలుకంటె గుహ్యావయవ పరిమాణాలే ప్రధానమైనవి.

ఒకపురుషుని బహిరాకారం అశ్వజాతి పురుషుని లక్షణాలు కలిగివున్నది. కాని రతివేళ పరిశీలింపగా అతని పురుషావయము స్థూలము, సుదీర్ఘముకాక కోమలంగా ఆరుఅంగుళముల పొడవుకల దిగా గోచరించింది. అప్పుడాతని బాహ్యాలక్షణాలు ఎలావున్నా అతడు శశజాతి పురుషుడనియే నిర్ణయించాలి.

అట్లే బాహ్యాలక్షణములన్నియు హస్తినీ జాతిస్త్రీకి తగివున్న ప్పటికి చిన్నవైన కక్షభాగములు (చంకలు) చిన్నవైన పాదములు కలిగి పెద్దముఖము, పెద్ద స్తనములు ఆమెకు అమరివుంటే ఆమెను హస్తినిగాకాక, హారిణీజాతి స్త్రీగా గుర్తించాలి.

## -: రతి భేదములు :-

వెనుక ప్రకరణంలో మూడేసిరకాలుగా చెప్పబడిన యీ స్త్రీ పురుష జాతులమధ్య యేర్పడే రతిభేదాలు ప్రధానంగా ఐదురకాలుగా ఉన్నాయి. ఈభేదములు వీరి గుహ్యావయవ ప్రమాణములు భిన్నంగా వుండుటవలన ఏర్పడతాయి. యీ రతిభేదములు 1 సమరతి 2 ఉచ్చరతి 3 నీచరతి 4 అత్యుచ్చరతి 5 అతినీచరతి అని పిలువబడతాయి.

**1 సమరతి :-** హారిణీజాతి స్త్రీతో శశజాతి పురుషుని సంయోగము సమరతి అనబడుతుంది. ఎందుచేతననగా హారిణీజాతి వనిత యోనియొక్క లోతు ఆరుఅంగుళములుకాగా, శశజాతిపురుషుని పురుషాంగముకూడ ఆరు అంగుళములే ప్రమాణము కలదై వుంటుంది. అం

దుచే పీఠరతి సమరతి అనబడుతుంది. ఇట్లే బడబాజాతి స్త్రీలకు, వృషభ జాతిపురుషులకు మధ్యఏర్పడేరతి, హస్తినీజాతి స్త్రీలకు, అశ్వజాతి పురుషులకు మధ్య యేర్పడేరతి కూడ – సమరతులనియే అనబడతాయి. కారణము వారి గుహ్యాంగముల ప్రమాణము సమానముగనుండుటయే, ఈవిధముగ యీసమరతి మూడురకాలుగా కానవస్తుంది.

2 **ఉచ్చరతి :-** హరిణీజాతిస్త్రీ తనతో సమానుడైన శశజాతి పురుషునితో గాక ఇంచుకమీదివాడైన వృషభజాతి పురుషునితో కలసినపుడు ఏర్పడేరతి ఉచ్చరతి అనబడుతుంది. ఎందువల్లననగా ఇచ్చట హరిణీజాతి స్త్రీయొక్క యోని ఆరు అంగుళములు మాత్రమే లోతుకలదికాగా అందు సంవిశితం చేయబడే వృషభజాతి పురుషుని పురుషాంగము తొమ్మిది అంగుళములు పొడవు కలదై వుంటుంది. యీ విధముగనే బడబాజాతి స్త్రీ తనకు సమానుడైన వృషభజాతి పురుషునితోగాక ఇంచుకమీదివాడైన అశ్వజాతి పురుషునితో కలిసి రమించినపుడు ఆ రమణముకూడ ఉచ్చరతి అనియే అనబడుతుంది. యోనికంటె పురుషాంగము పెద్దదగుటయే ఇచ్చటను కారణము. ఈ విధముగా ఉచ్చరతులు రెండురకాలుగావున్నాయి.

3 **నీచరతి –** శశజాతి పురుషుడు తనకు సమానమైన హరిణీజాతి స్త్రీతోకాక ఇంచుక మీదిదైన బడబాజాతి స్త్రీతో కలిసి రమించినపుడు ఆ రతి నీచరతి అనబడుతుంది. ఇచ్చట పురుషాంగము ఆరుఅంగుళముల ప్రమాణముకలదికాగా యోని తొమ్మిది అంగుళముల లోతుకలదై ఇంచుక పెద్దదైయున్నందున యీరతి నీచరతి అనబడినది. ఇట్లే వృషభజాతి పురుషుడు హస్తినీజాతి స్త్రీతో సంగమించగా ఏర్పడే రతికూడ నీచరతి అనియే అనబడుతుంది ఇచ్చటకూడ పురుషాంగముకంటె స్త్రీయొక్క యోని ఇంచుక ఎక్కువ లోతుకలదిగా నుండుటయే కారణము. యీవిధముగా నీచరతికూడ రెండురకములై ఉన్నది.

**4 అత్యుచ్చరతి :-** అశ్వజాతి పురుషుని పురుషాంగము పండ్రెండు అంగుళముల ప్రమాణముకలదైఉంటుందని వెనుక చెప్పబడినది. ఆ పురుషుడు యోనియొక్క లోతు కొంచెము తక్కువకాక బాగా తక్కువ, ఆరుఅంగుళములు మాత్రమే లోతుకల హరిణీజాతి స్త్రీతో సంగమించినపుడు ఆరతి అత్యుచ్చరతి అనబడుతుంది. యోనికంటె పురుషాంగము రెట్టింపు ప్రమాణముకలదై ఉండుట దీనికి హేతువు. యీ అత్యుచ్చరతి యీ ఒక్కచోట మాత్రమే ఏర్పడుతుంది.

**5 అతినీచరతి –** శశజాతిపురుషుని పురుషాంగము ఆరు అంగుళముల ప్రమాణముకలదై ఉంటుందని వెనుక చెప్పబడినది, అట్టి పురుషుడు తన పురుషాంగముకంటె రెట్టింపులోతు (పండ్రెండు అంగుళములు) యోనికలదైన హస్తినీజాతి స్త్రీతో కలిసి రమించినపుడు ఆ రతి అతినీచరతి అనబడుతుంది. ఇచ్చట యోనికంటె పురుషాంగము ప్రమాణములో మిక్కిలి చిన్నదికదా ! అందుచేతనే ఇది అతినీచరతి అనబడినది. ఈరతిభేదము యీ ఒక్కచోటమాత్రమే ఏర్పడుతుంది.

ఇట్లున్న యీరతిభేదాలు మొత్తము తొమ్మిది రకాలుగా ఉన్నాయి.

| సమరతి | ఉచ్చరతి | నీచరతి | అత్యుచ్చరతి | అతినీచరతి |
|---|---|---|---|---|
| హరిణీ-శశ 6 - 6 | హరిణీ-వృషభ 6 - 9 | బడబా-శశ 9 - 6 | హరిణి-అశ్వ 6 - 12 | హస్తిని-శశ 12 - 6 |
| బడబా-వృషభ 9 -9 | బడబా-అశ్వ 9 - 12 | హస్తినీ-వృషభ 12 - 9 | | |
| హస్తినీ-అశ్వ 12 - 12 | | | | |

అయితే యీ రతులన్నిటియందు స్త్రీపురుషులకు ఉభయులకు సర్వథా సుఖాన్ని అందించే రతిఏది ? అన్నప్రశ్న కలుగడం సహజం. దీనియొక్క సమాధానము తెలియుటకు ముందు స్త్రీయొక్క యోనిని గూర్చి కొంత తెలియాలి.

స్త్రీల యోనియందు వారి నెత్తుటినుండియే పుట్టినవైన సూక్ష్మ క్రిములు ఉంటాయి. అవి యోనియందొక రకమైన దురదను కలిగిస్తాయి. ఆ దురద పురుషాంగముయొక్క ఘట్టనవల్ల తొలగేదై వుంటుంది. ఈ దురద తత్కాలంలో పూర్తిగా తొలగినప్పుడు స్త్రీ యోని నుండి రజస్సు స్రవిస్తుంది. యీ రజస్సు స్రవించినంతనే స్త్రీలు తృప్తి చెందుతారు. తత్కాలములో రతిని కోరుకొనరు. అయితే యోని యందు జన్మించే సూక్ష్మక్రిములకు దురదను కల్పించే శక్తిలోకూడ తేడా వుంటుంది. కొన్ని క్రిములు సాధారణమైన దురదనుమాత్రమే కలిగిస్తాయి, కొన్నిటియొక్క శక్తి అంత తక్కువగాకాక మధ్యమంగా వుంటుంది. కొన్ని తీవ్రమైన శక్తికలవై యోనియందు ఎక్కువ దురదను జనింపజేస్తాయి.

ఇలా యీ క్రిములు మూడురకాలుగా ఉన్నాయి. వీనిలో అల్పమైన దురదను జనింపజేసే క్రిములుకలిగిన యోనికల - స్త్రీ రతివేళ తొందరగా తృప్తిచెందే లక్షణం కలదై వుంటుంది. అనగా తొందరగా రజస్సును స్రవిస్తుంది. మధ్యమమైన దురదను కలిగించే క్రిములు కలిగిన యోనికల స్త్రీలు అంత తొందరగా తృప్తిచెందరు; కాని మరీ సుదీర్ఘమైన రతినికూడ వాంఛింపరు. మధ్యమంగా తృప్తిచెందుతారు.

ఇక తీవ్రమైన దురదను జనింపజేసే క్రిమిజాతముతో నిండిన యోనికల స్త్రీలు దీర్ఘకాలిక రతికిగాని తృప్తి చెందజాలనివారై ఉంటారు.

సమరతులయందు స్త్రీయొక్క యోనికి తగిన పరిమాణములో పురుషాంగము ఏర్పడిఉంటుంది. అందుచే స్త్రీయొక్క యోని యందలి దురద సుఖంగా తొలగుతుంది. పురుషునకు కూడ ఆరతి మిక్కిలి సుఖకరంగా వుంటుంది. యీ కారణముచే సమరతి ఉత్తమ మైనది; స్త్రీపురుషుల కిద్దరకు సమాన సుఖకరము అయివున్నది.

ఉచ్చరతియందు స్త్రీయొక్క యోనికంటె పురుషాంగము పెద్దదై వున్నందున యోనియందలి దురద తొలగుటలో కొంత సుఖము ఏర్పడి వున్నప్పటికి స్త్రీ కొంత బాధనుకూడ అనుభవించేదై వుంటుంది. పురుషునకు కూడ సమరతివలె యీ వుచ్చరతి చాలినంత తృప్తిని కలిగించదు. అందుచే యీ వుచ్చరతి సమరతి తరువాత పేర్కొనదగినదై వుంటుంది.

ఇక నీచరతియందు పురుషాంగముయొక్క ప్రమాణము మిక్కిలి తక్కువై వుండుటచే స్త్రీయొక్క యోనియందు తగినవిధంగా ఘట్టనం ఏర్పడే అవకాశమే లేదు. అందుచే అచ్చట పురుషుడు ఎంతశ్రమించినా స్త్రీయొక్క యోనియందలి దురద తీరదు. ఆమె తృప్తి చెందుటకు అవకాశము వుండదు.

అత్యుచ్చరతియందు స్త్రీకి కేవలము బాధమిగులుతుంది. అతి నీచరతియందు ఆమెకు తృప్తికలిగే అవకాశము అసలేలేదు.

అందుచే సమరతి ఉత్తమమైనదని, వుచ్చరతి ద్వితీయ పక్షమని మిగిలిన రతులు వుభయ సుఖకరములు కావని గుర్తించాలి. పురుషుడు కామశాస్త్రములు చదివినవాడై తానేజాతికి చెందినవాడో గుర్తించి, తనకు తగిన జాతిస్త్రీని పరిణయమాడినపుడు మాత్రమే నిజమైన దాంపత్య సుఖము అనుభవింప గలుగుతాడు.

రతియందు తనకు తృప్తికలిగించే పురుషునియందు స్త్రీ మిక్కిలి మక్కువకలదై వుంటుంది; నగలు, సొమ్ములు మొదలుగునవి ఎన్ని ఇచ్చినప్పటికి రతియందు తనను తృప్తి పరుపజాలని భర్తయందు స్త్రీలకు అనురాగం వుండదు. ఎవని సాంగత్యములో స్త్రీ పరవశయై రజస్సును స్రవిస్తుందో ఆ పురుషునియందు దామెయొక్క ప్రేమ అనంతమై వుంటుంది. అట్టివాడైన భర్తయొక్క వియోగాన్ని ఆమె క్షణకాలముకూడ సహించలేదు. ఒకవేళ విధివశమున వారికి

వియోగమే ఏర్పడితే ఆ స్త్రీ జీవింపదు. వెంటనే కాకపోయినా కొలది కాలానికే మరణిస్తుంది.

ఇక ఆమెకు భర్తవలన రతియందు తృప్తి లేనప్పుడు ఆమె భర్తను ప్రేమించదు. సరికదా అతని హితాన్ని కూడ కోరదు, మీదు మిక్కిలి అతని వినాశాన్ని కోరుకొంటుంది. కొన్ని కొన్ని చోట్ల అట్టి స్త్రీలు భర్తను చంపినట్లు కూడ ప్రాచీన కామశాస్త్రాలు తెలుపుతున్నాయి.

అందుచే పురుషుడు రతియందు కేవలము తన తృప్తిని మాత్రమే కాక భార్యయొక్క తృప్తినికూడ గమనించి వర్తించాలి. తాను మృదువై, పొట్టిదైన పురుషాంగము కలవాడైనపుడు. తొందరగా వీర్యస్రావం చేసేవాడైనపుడు - తన పురుషాంగము దృఢముగా వుండుటకు, తనవీర్యము తొందరగా స్ఖలితముకాకుండ కాపాడుకొనుటకు తగిన వైద్యునితో సంప్రదించుట అవసరం. ఈ విషయమై యీ శాస్త్రములో కొన్ని ఔషధ ప్రక్రియలు చెప్పబడ్డాయి. కాని అవి అందుబాటులో వుండేవికావు, పైగా వానియొక్క ఉపయోగములో ఇంచుక తేడావస్తే ప్రమాదించే పరిస్థితులున్నాయి. అందుచే వానిని యీ అనువాదములో చెప్పుటలేదు.

కాగా పురుషుడు రతియందు భార్యను తృప్తిపరుపజాలనివాడైనపుడు సంకోచింపక తగినవైద్యునియొక్క సహాయం అర్థించడం అవసరం.



## -: మన్మథావస్థలు :-

స్త్రీని పొందవలెనని పురుషుని మనస్సులోను, పురుషునిపొందు బడయవలెనని స్త్రీ మనస్సులోను ప్రాదుర్భవించే కోరికకు కామము అని పేరు. ఈ కామమన్న గుణం పుట్టుకనుండి అజ్ఞాతంగా స్త్రీ పురుషుల మానసంలో బీజప్రాయంగా ఉండి యౌవనోదయముతో

స్ఫుటంగా వ్యక్తం అవుతుంది. ఆలుమగలు తమ సంతానానికి ఎదుటనే విచ్చలవిడిగా సంచరించేచోట్ల యీగుణము యౌవనము యొక్క రాకకు పూర్వమే వారిమనస్సులో రూపొంది వారి స్వభావానికీ వర్తనానికి చేటు తెస్తుంది. అందుచే ఆలుమగలు తమసంతానమునకు మూడేండ్లు వచ్చినది మొదలు వారియెదుట విచ్చలవిడిగా శృంగార భావభావితులై చరింపరాదు.

కామము అనే యీగుణముయొక్క దైవభావనయే మన్మథుడు. ఈమన్మథుడు లేక కామముయొక్క శరీరములోపదిరకాలు అవస్థలు యేర్పడతాయి. వానికే మన్మథావస్థలని పేరు. అవిక్రమంగా వివరింపబడుతున్నాయి. యీ అవస్థలన్నిటియందు పూర్వావస్థ ప్రబలంగా ఉన్నప్పుడుమాత్రమే వుత్తరావస్థ జనిస్తుంది. పూర్వావస్థ దుర్బలంగా వుంటే తరువాతి అవస్థ జనించదు.

**1 అభిలాష :—** వయస్సులోవున్న సుందరివంక పురుషుడు, లేదా సుందరుడైన పురుషునివంక యువతి కోరికతో చూడడం జరిగితే ఆ అవస్థకు అభిలాష అని పేరు. ఇక్కడ కామము లేక మదనుడు మొదటి మెట్టుమీద వున్నట్లులెక్క.

**2 చింత :—** స్త్రీ పురుషులు తమకంటికి మనస్సుకు నచ్చిన స్త్రీమూర్తులను ఎందరినో చూస్తూ ఉంటారు. కాని వారు తత్కాలంలో కొంత అభిలాష కలవారైనప్పటికి తరువాత ఆ సుందరులనే తలచుకొంటూ కూర్చుండరు. మరచిపోతారు అలా మరచిపోవుట జరిగితే "అభిలాష" అనే అవస్థ దుర్బలమైనదని గ్రహించాలి. కాని కొన్నిచోట్ల అలాకాక తాము సాభిలాషగా చూచిన సుందరాకారం వారిమనస్సులో నిలచిపోయి వారికి మాటి మాటికి గుర్తువస్తుంది అలా గుర్తువచ్చినప్పుడు వారియందలి కోరిక కొంతబలాన్ని పొంది రెపరెపలాడుతుంది. ఇదిగో! కామముయొక్క ఈస్థితి 'చింత' అనబడుతుంది.

**3 అనుస్మరణము -** ఏదో ఒకటి రెండుసార్లు గుర్తువచ్చి కోరిక కొంతబలాన్ని పుంజుకొన్నప్పటికి సాధారణంగా అది అంతటితో

ముగుస్తుంది. కాని కొన్నిచోట్ల తాము మొదట చూచిన రూపము, తమమనస్సులో కోరిక పుట్టించిన రూపము మనస్సునుండి తొలగిపోక మాటిమాటికి కల్లోలాన్ని సృష్టిస్తూ దానినిగూర్చియే భావించేటట్లు చేస్తుంది. ఈవిధంగా మాటిమాటికి ఆరూపాన్ని భావించుటవలన మనస్సులోని కోరిక పూర్వముకంటె బలముకలదిగా మారుతుంది. ఇట్టిస్థితి 'అనుస్మరణము' అనబడుతుంది.

**4 గుణకీర్తనము :-** అనుస్మరణస్థితి ప్రబలముగా ఉన్న స్త్రీ పురుషులు తాము ప్రేమించిన వారినిగూర్చి భావించుటతో మాత్రమే తృప్తి చెందరు. వారు తమ ప్రియతములయొక్క గుణాలను, వర్తనమును తెలిసి కొనుటయందు, తెలిసిన గుణవర్తనములను తమలో తామైకాని, లేక సాన్నిహితుల యెదుటకాని మాటిమాటికి కొనియాడుటయందు ఆసక్తి చూపుతారు ఇట్టిపరిస్థితి "గుణకీర్తనము" అనబడుతుంది

**5 ఉద్వేగము -** గుణకీర్తనమువలన కూడ కోరికకు బలం పెరుగుతుంది. అలాకోరిక మిక్కిలి బలముకలదైనపుడు అది తీరితేసరే! అదితీరకపోతే అట్టి ప్రబలమైన కోరికగల స్త్రీ పురుషులు ఏదో ఆవేశాన్ని ప్రదర్శిస్తూవుంటారు. వారి మనస్సులోని ఈకోరికయొక్క స్వరూపం తెలిసినవారు మాత్రమే వారి ఆవేశానికి కారణం గ్రహించగలుగుతారు. ఇతరులకు వారి ఆవేశము కారణరహితమనిపిస్తుంది. ఇట్టిస్థితి 'ఉద్వేగము' అనబడుతుంది.

**6 విలాపము -** ఉద్వేగావస్థయందు కూడ కోరిక తీరక ఆ ఉద్వేగము ప్రబలముగా ఉన్నప్పుడు ఆ అవస్థకు చిక్కిన స్త్రీ పురుషులు ఏకాంతములో విలపిస్తారు. ఇట్టిఅవస్థ 'విలాపము' అనబడుతుంది.

**7 ఉన్మాదము :-** ఉన్మాదము అనగా పిచ్చి. విలాపావస్థయందుకూడ కోరికతీరక ఆ విలాపావస్థ ప్రబలంగా వుంటే ఆ స్త్రీ పురుషులు ఉన్మత్తులు (పిచ్చివారు) అవుతారు. ఈ అవస్థ ఉన్మాదావస్థ అనబడుతుంది.

**8 వ్యాధి :-** ఉన్మాదావస్థ యందైనను కోరికతీరనిచో ఆ స్త్రీ పురుషులు వ్యాధిగ్రస్తులు అవుతారు. ఇట్టి అవస్థకే 'వ్యాధి' అని పేరు.

**9 జడత్వము :-** 'వ్యాధి' అనే అవస్థకు చిక్కిన స్త్రీ పురుషులు కొలదికాలములో జడులు (మందులు మూర్ఖులు) అవుతారు. అనగా పిలిస్తే పలుకరు. ఒకదానికొకటి సమాధానము చెప్పతారు. ఈ అవస్థకు 'జడత్వము' అని పేరు.

**10 మరణము :-** జడావస్థ క్రమముగా మరణమునకు దారితీస్తుంది. అలా ఎవరైనా తాము ప్రేమించినవారిని పొందజాలక జడులైనపుడు కొలదికాలంలో వారు మృతిచెందుతారు.

ఈ మన్మథావస్థలు 'రతిరహస్యము' మున్నగు గ్రంథముల యందు దీనికంటె కొంత భిన్నముగా చెప్పబడ్డాయి. ఏమైనా అన్నిటి సారము ఒక్కటే. కామము ప్రబలమై వున్నప్పుడు అది నెరవేరాలే కాని నెరవేరకపోతే మృత్యువుదాకా మెట్లుకడుతుంది. అది అలా మెట్లు కడుతూ ఉన్నప్పుడు వీనికి చివరిమెట్టు మృత్యువే అనిగుర్తించి ఎల్లరు జాగ్రత్తపడుట అవసరం. కాని తాము అనుభవించే అవస్థ తీవ్రంగా ఉండనపుడు అది అంతటితో ముగుస్తుందే కాని ముందుకు పోదు. ఈవిషయమెరిగి వివేకముతో వ్యవహరించాలి.

---

## —: బాల - యువతి - ప్రౌఢ - వృద్ధ :—

వెనుక చెప్పిన హరిణీ - బడబా - హస్తినీ జాతిస్త్రీలు వయోభేదమునుబట్టి ఒక్కొక్కరు 'బాల - యువతి ప్రౌఢ - వృద్ధ' అని నాలుగు రకములుగా ఉంటారు.

**బాల :-** పదునారు సంవత్సరములకు లోపు వయస్సుకల బాల అనబడుతుంది.

**యువతి :–** పదునారు సంవత్సరములుదాటి ముప్పది సంవత్సరములకు లోపు వయస్సుకల ✎ యువతి లేక తరుణి అనబడుతుంది.

**ప్రౌఢ :–** ముప్పది సంవత్సరములుదాటి ఏబది సంవత్సరములకు లోపు వయస్సుకల వనిత "ప్రౌఢ" లేక అభిరూఢ" అనబడుతుంది.

**వృద్ధ –** ఏబది సంవత్సరములు దాటినమీదట వనితకు వార్ధక్యము వచ్చినటులే. ఆమె వృద్ధ అనబడుతుంది.

ఇట్లు వయోభేదము ననుసరించి నాలుగు రకములుగా ఉన్న వనితలయందు బాల – గ్రీష్మ శరత్కాలములయందు (జ్యేష్ఠ ఆషాఢ మాసములు – ఆశ్వయుజ కార్తిక మాసములు) భర్తకు మిక్కిలి సుఖాన్ని అందిస్తుంది.

స్త్రీలకు పదమూడు పదునాలుగు సంవత్సరములు వచ్చునరికే పురుషాంగత్యమునకు అర్హమైన శరీరపుష్టి అవయవస్థితి ఏర్పడుతుంది. ప్రాచీనులు కన్య రజస్వలయగుటకు పూర్వమే ఆమెనువివాహం చేసెడివారు. రజస్వల అయినంతనే ఆలుమగలకు సాంగత్యము (శోభనము) ఏర్పరచేవారు. అట్టివైన ప్రాచీన వివాహ పరిస్థితులయందు పురుషుడు బాలను అనుభవించుటకు అవకాశము ఉంటుంది. ఇప్పుడు అట్టి వివాహాలు అరుదు అయ్యాయి. కానిఅసలే నశించిపోలేదు. అట్టి వివాహితులైనవారు గ్రీష్మ శరత్కాలములు తమకు అధిక ఆనందజనకములని గ్రహించాలి. ఎందువల్లననగా బాలయొక్క శరీరము పల్చగా ఉంటుంది. గ్రీష్మమునందు ఎండ వేడిమి ఎక్కువగా ఉంటుంది. అందుచే ఆసమయంలో మిక్కిలి పుష్టికలిగి బలిసిన శరీరముకల యువతికంటె బాలయొక్క పొందు ఆనందాన్ని కలిగిస్తుంది. అట్లే శరత్తునందు ఎండలు వెనుకబట్టినను చలిపూర్తిగా ప్రవేశించనందున పృథుశరీరము (పెద్దశరీరము) కంటె అల్పశరీరము సుఖకరమై వుంటుంది. ఒకవిధంగా చూస్తే బాల సాంగత్యమునకు సమయనియము లేదనియే చెప్పాలి. బాలా సాంగత్యమునకు ఏసమయమున ఆచరించినను, పురుషునకు

ఆనందమే కలుగుతుంది. దీనివలన పురుషుని బలము తరుగదు. పైగా పెరుగుతుంది.

యువతి లేక ప్రౌఢ అయి ఉన్న భార్య హేమంత – శిశిరముల యందు (మార్గశిర పుష్యమాసములు – మాఘ ఫాల్గున మాసములు) భర్తకు మిక్కిలి సుఖం కలిగిస్తుంది. ఏమంటే యువతీ శరీరము ప్రౌఢ యొక్క దేహము మిక్కిలి పరిపుష్టంగా ఉంటుంది. ఆకాలముకూడ విపరీతమైన మంచుకు, చలికి నెల్వైపై దేహపుష్టికల భార్యాసాంగత్యము మిక్కిలి సుఖాన్ని అందిస్తుంది. కాని యువతీ సాంగత్యమువలన పురుషుని బలం తగ్గుతుందని, ప్రౌఢాసాంగత్యము భర్తకు వార్ధక్యాన్ని (ముసలితనము) దగ్గరచేస్తుందని శాస్త్రకారుల అభిప్రాయము. భార్యకు వయస్సు గడుస్తూవుంటే భర్తకుకూడ వయస్సు గడవడం, ఆవిధంగా వార్ధక్యానికి సన్నిహితుడు కావడం సత్యదూరం కాదు.

ఇక యేబదియేండ్లు దాటినవనిత స్వయంగానే మన్మథవ్యాపారానికి అంతఉత్సాహము కలిగివుండదు. ఆమెతోబాటు సమానంగా పండుతూ వచ్చిన ఆమెభర్తయందు కూడ భార్యను కలియవలెనన్న కోరిక సన్నగిలుతుంది. అట్టిదంపతులు ఎడనెడ శారీరకంగా కలుస్తూ వున్నా, వారు తాము యౌవనంలో అనుభవించిన సుఖానందముల సంస్మరణతోడనే ఎక్కువగా ఆనందించేవారై, ఆయా విషయాలు త్రవ్వి చెప్పుకొంటూ ఒకనిండైన శరీరసాంగత్య రహితమైన సుఖాన్ని అనుభవించడం జరుగుతుంది.

బాల అయి ఉన్న భార్యను ఆమె కూర్చుండివున్న సమయము నందే భర్త యేవో మాటలుచెప్పి, లేదా అల్పములైన ఆలింగన చుంబనాదులచే రతికి ఉన్ముఖురాలుగా చేసుకోవాలి. యేమంటే ఆ వయస్సులో ఆమెకు లజ్జ ఎక్కువగా వుంటుంది. స్వయంగా వచ్చి భర్త శయనించిన శయ్యపై శయనింపదు. అందుచే ఆమెను కూర్చుండి ఉన్నపుడే లాలించి అనుకూలంగా చేసికొనడం తగివుంటుంది.

యువతి బాలవలె కాక సిగ్గును పెడగానెట్టి భర్తతోడి పొందు సకు పరిచిత అయివుంటుంది. అందుచే ఆమెను భర్త, శయ్యపై శయనించి వున్నపుడే ఆలింగన చుంబనాదులనే లాలించి రతిక్రీడకు వున్ముఖురాలుగ చేసికొనడం తగివుంటుంది.

ఇక ప్రౌఢావస్థలో అడుగుపెట్టిన వనితయందు లజ్జకాదు కాని, అట్టిదైన లక్షణం కనబడుతుంది. ఆమె భర్తశయనించిన శయ్యపై స్వేచ్ఛగా వచ్చి కూర్చుంటుంది. కాని అతనిలో ఆమెను కలియవలెనన్న లక్షణం కనబడినంతనే 'ఎల్లప్పుడు ఇదేపనియా ?' లజ్జా మధురంగా తిరస్కరించి వెళ్లిపోయే లక్షణం ఏర్పడుతుంది. అప్పుడు పురుషుడు ఆమెలేచివున్న అస్థితియందే ఆలింగన చుంబనాదులనే ఆమెను అంకెకు తెచ్చుకొనాలి.

ఏపరిస్థితియందును పురుషుడు భార్యయందు రతికి తగినఆవేశము యేర్పడుటకుముందు రతికి ఉపక్రమించరాడదు. బాగా చలిగా వున్న ప్పుడుమాత్రమే ఎండవలన సుఖం. ఆచలి లేనపుడు ఎండవలన సుఖ మేర్పడదు సరికదా దుఃఖము కలుగుతుంది. అట్లే మనస్సులో తగినంత కోరిక ఉన్నపుడే రతివలన సుఖము. ఆకోరిక లేనపుడు రతివలన సుఖముండదు. బాధకలుగుతుంది. ప్రియురాలి మనస్సులో రతియందు కోరికలేనపుడు ప్రియుడు రతికి ఉపక్రమిస్తే ఆమెకు సుఖముండదు. ఆమె బాధపడుతుంది. అట్లు బాధపడుతూవున్న వనితతోడి సాంగ త్యమైనందున ఈ పురుషునకు తగినంత సుఖముండదు. అందుచే భార్యలో కోరికలేనపుడు పురుషుడు ఆలింగనాదులచే మొదట ఆమెలో బాగా కోరికను ప్రేరేపించి పిమ్మటనే రతికి ఉపక్రమించాలి.

మిక్కుటమైన కోరిక మనస్సులో కలిగినపుడు స్త్రీలు అంత వరకు ప్రదర్శించిన లజ్జను పరిత్యజిస్తారు. దీర్ఘంగా నిట్టూరుస్తారు. వారి ముఖంమీద చిరుచెమట పొటమరిస్తుంది. వారు యేదో అనిర్వచనీయమైన వికారభావాన్ని పొందినట్లు కానవస్తారు. అప్పు

డప్పుడు అబ్బా ! అయ్యో ! అన్నమాటలుకూడ పలుకుతారు. వీనిని బట్టి భార్యామానసంలో కోరిక సెగలు ఎగయుస్తోందని గ్రహించి పురుషుడు రతికి వుపక్రమించాలి.

అలా భర్తచే లాలింపబడిన వనితకు రతియందు తృప్తి తొందరలో కలుగుతుంది. అంతేగాదు, ఆమె అనుభవించే సుఖ పారవశ్యముకూడ ఎక్కువగా వుంటుంది. ఇట్లు భర్తచే లాలింపబడి సుఖించే వనిత భర్తను ప్రాణాధికంగా ప్రేమిస్తుంది. ఆమె భర్తకొరకు ప్రాణాలనుకూడ తృణప్రాయంగా అర్పించగలదై వుంటుంది చనిపోయిన మీదటకూడ ఆమె ఆపరలోకాలలో తనభర్త ఎక్కడ వున్నాడో వెదకికొని అక్కడకే చేరుకొంటుంది – అని ప్రాచీన కామశాస్త్రకారుల మాట. లాలించి రమించే భర్తపై వనితకు యేర్పడే అనురాగం ఇంతటిది. పురుషు డీవిషయమును గుర్తించి తాను సుఖించి ఆమెకు సుఖమును కల్పించాలి.

# ఆలింగన భేదములు

ఆలింగనము అనగా కౌగలింత. కౌగిలి రతిలో తొలిమెట్టు వంటిది. ఆలింగనము వలన స్త్రీ పురుషుల శరీరము ఉద్రిక్తము అవుతుంది. వారు రతికి వున్ముఖులవుతారు. ఈ ఆలింగనములు అవియేర్పడే స్థితి భేదమునుబట్టి పదిరకములుగా వున్నాయి.

**1. స్పృష్టకము :—** 'స్పృష్టకము' అనగా తాకుట. ఆలుమగలు ఒకరినొకరు కేవలము తాకుటతో యేర్పడే ఆలింగనమైనందున దీనికీపేరువచ్చినది. నవవివాహితులైన వధూవరులు ఒకరినొకరు గాఢముగా కౌగలించుకొనుటకు పెద్దలయెదుట తగినంత అవకాశము లేనివారైనపుడు, మనస్సులోని కోరిక ప్రబలంగా ఉన్నప్పుడు, యేదో పనిమీద ఇటునటు సంచరించుచునే ఒకరినొకరు రాసుకొని వెళ్ళుట లేక వచ్చుట ఆచరిస్తారు. ఇట్టిదైన శరీర సన్నికర్ష క్షణికమే అయినప్పటికి

నవదంపతులకది మిక్కిలి ఆనందాన్ని చేకూరుస్తుంది. వారిలో సంగమాశయాన్ని పెంపొందిస్తుంది. నవదంపతులయందేకాక కొంతకాలం వియోగాన్ని అనుభవించివున్న దంపతులయందుకూడ ఈ ఆలింగనం యేర్పడుతుంది. స్వేచ్ఛగా ఒకరినొకరు కలిసి అనుభవించుటకు అవకాశముండి పరిచయాధికతవలన లజ్జాదులు తొలగిన వారియం దీస్పృష్టకాలింగనము యేర్పడదు.

**2. పీడితము :-** పీడితము అనగా పీడింపబడినదని అర్థము. భార్యాశరీరాన్ని భర్త తనశరీరముతో మిక్కిలిగా నొక్కి పీడించుట జరిగితే అది పీడితము అనే ఆలింగనము అనబడుతుంది. ఈ ఆలింగనముకూడ నవ వివాహితులయందే అధికముగా యేర్పడుతుంది. వారికి యౌవనోదయమైనప్పటికి పెద్దలు వారిసాంగత్యానికి ఇంకా యేర్పాటు చేయనపుడు ఏ తీర్థములయందో, ఏజనసమ్మర్ద ప్రదేశములందుందో తొసిల్లినపుడు ఈ ఆలింగనం వారిమధ్య ఏర్పడే అవకాశంకలుగుతుంది.

అట్టి పరిస్థితిలలో పురుషుడు భార్యమీాది మక్కువతో ఆ సమ్మర్దములో భార్యవున్నచోటుకు ఎట్లోచేరుకొని - జనసమ్మర్దము కారణముగా అన్నట్లు ఆమెశరీరాన్ని ఏగోడకో ఆన్చి తనశరీరముతో మిక్కిలిగా పీడించుట జరిగితే - ఇట్లు ఒరసుకొని నిలచినవాడు భర్త అయినందున అతనిమీాద తనకును ప్రేమ ఏర్పడి వున్నందున ఆ భార్య ఈ పీడితాలింగాన్ని ఏవో మధురభావనలు భావించుకొంటూ లజ్జతో అనుభవిస్తుంది.

స్వేచ్ఛగా ఒకరినొకరు పొందుటకు తగిన అవకాశమున్న వారు పీడితాలింగనమునకై యత్నింపరు.

**3. లతావేష్టితము :-** "లతావేష్టితము" అనగా లతవలె చుట్టబెట్టుకొనుట. లోకంలో ఏమ్రానిచెట్టు మొదటనో ఏదో ఒక లత బయలుదేరి ఆ చెట్టును చుట్టుకొంటూ క్రమంగా పైకి

వ్యాపించి తన తీవలచే ఆ వృక్షముయొక్క కొనగొమ్మలను క్రిందికి వంచడం చూస్తూవుంటాము.

సరిగా అటులే భార్య తన సర్వశరీరముతోడను భర్త యొక్క శరీరాన్ని చుట్టుకొన్నదై ఉన్నతమైన ఆతని ముఖాన్ని చుంబించుటకు క్రిందికి వంచుట జరిగితే అది లతావేష్టితము అన బడుతుంది. వివాహితులై పరస్పరం బాగా పరిచయాన్ని పొందిఉన్న దంపతులయందే ఆలింగనం ఏర్పడుతుంది. మనస్సులో కోరిక తీవ్రంగా ఉన్నపుడుమాత్రమే భార్య ఈ విధమైన లతావేష్టితాన్ని ఆచరిస్తుంది.

**4. వృక్షాధిరూఢము :–** వృక్షాధిరూఢము అనగా చెట్టు ఎక్కినటులు వర్తించుట. భర్త నిలువబడియుండగా అతని యొక్క ఒకపాదమును భార్య తన ఒకపాదముతో త్రొక్కి – రెండవపాదము నాతని తొడపైనుంచి, అతని నడుము నొకచేతి తోడను, మెడను వేరొకచేతితోడను పట్టుకొని, అతని ముఖాన్ని వంచి ముద్దుపెట్టుకొనుటకు యత్నిస్తే అది వృక్షాధిరూఢము అన బడుతుంది.

అలా తాను నిలువబడి యుండగా ఏ కొబ్బరిచెట్టుమీదకో ఎక్కుతూవున్నట్లు తనమీదకు ఎక్కి నిలచి, తన ముఖాన్ని ముద్దు పెట్టుకొనుటకు యత్నించే పలుచని శరీరంకల భార్యను చూచి నవ్వుతూ భర్త తన ముఖాన్ని సహజంగా ఆమెకు ముద్దు పెట్టు కొనుటకు చిక్కనీయకపోవడం కూడ జరుగుతూ వుంటుంది. అప్పుడామె అతని ముఖాన్ని అందుకొనడానికై యత్నించి, తన యత్నాన్ని విఫలంచేసే భర్తనుచూచి గారం గుడుస్తూ దైన్యాన్ని ప్రదర్శించడం ఆమె దైన్యాన్ని చూచి భర్త ఆమెను పొదవుకొనడం కూడ జరుగుతూ ఉంటుంది. ఇట్టి ఆలింగమునకే "వృక్షాధిరూఢ" మని పేరు. భర్త సమున్నతమైన దేహము కలవాడై నపుడు, భార్యయొక్క

మనస్సులో కోరిక తీవ్రముగా ఉదయించినపుడు ఇట్టి ఆలింగనము ఏర్ప డుతుంది.

**5 తిలతండులము :-** తిలలు అనగా నువ్వులు. తండు లములు అనగా బియ్యము. వీనిని రెంటిని కలబోసినపుడు ఒకదాని నుండి వేరొకదానిని విడదీయుట సుఖసాధ్యము కాదు. అట్లే భార్యా భర్తలు శయ్యపై మిక్కిలి అనురాగముతో ఒకరిశరీరాన్ని ఒకరు పొదవుకొని గాఢాలింగనంలో ఏకీకృత శరీరులై ఉంటే ఆ స్థితి తిల తండలము అనబడుతుంది.

**6. క్షిరనీరము :** క్షీరము అనగా పాలు. నీరము అనగా నీరు. పాలలో నీరు కలిపినపుడు ఇవిపాలు, ఇదినీరము అని విడదీయుట సాధ్యముకాదు. అట్లే భార్యా భర్తను, అతని శరీరములో లీనమగు చున్నదేమో అనునటులం గాఢంగా ఆలింగనం చేసికొని, అతని శరీ రంతో కలిసిపోయి ఒకటిగావున్న తన శరీరమును ఆ ఆలింగనస్థితియందే ఇంచుక కదల్చుట జరిగితే అది "క్షీరనీరము" అనబడుతుంది. భార్యా భర్తలు గాఢాలింగిత శరీరులై నిశ్చలంగా ఉండుట జరిగితే తిలతండు లము. గాఢాలింగన స్థితియందు నిశ్చలంగాకాక ఇంచుక కదలేవారైతే క్షీరనీరము అని గ్రహించాలి. ఏమనగా క్షీరనీరములు ద్రవములగుటచే ఒకదానితో నొకటి కలిసినపుడు వానియందు తరంగమువంటి చలనము యేర్పడుతుంది. తిలతండులములయందది ఉండదు.

**7. జఘనోప గూహనము :-** జఘనము అనగా మొల. భార్యా తన భర్తయొక్క జఘనభాగమునకు తన జఘనభాగము నాన్చి అతనిని బలముతో ఆక్రమించుకొని జారుచున్న పైటకల్గి గతంలో భర్త తన శరీరముపై ఆచరించిన నఖక్షతాలను (గోటి నొక్కులను) వెల్లడించే శరీరముతో ఆలింగనము చేసికొనుట జరిగితే అది "జఘనోప గూహనము" అనబడుతుంది.

**8 కుచోపగూఢము** – కుచములు అనగా చనులు. భార్య తన బలిసిన స్తనములతో భర్తయొక్క విశాలమైన వక్ష స్థలాలిన్ని కుమ్ముచు వానిని మిక్కిలిగా అదిమి ఆలింగనం చేసికొంటే అది కుచోప గూఢము లేక కుచోపగూహనము అనబడుతుంది.

**9. ఊరూపగూఢము :-** ఊరువు అనగా తొడ, భార్య యొక్క లలితములు, సుందరములు అయిఉన్న తొడలను భర్త తన తొడలతో మిక్కిలిగా నొక్కుచు ఆలింగనం చేసుకొంటే ఆ ఆలింగనము ఊరూపగూఢము అనబడుతుంది.

**10. లాలాటికము :-** లాలాలాట మనగా నుదురు. భర్త భార్యయొక్క కన్నులలోనికి లాలసతో చూచుచున్నవాడై ఆమె నుదుటిని తన నుదిటితో ఢీకొనుట జరిగితే అది లాలాటికము అనబడుతుంది. భార్యా భర్తలయొక్క మిగిలిన శరీరము ఒకదానితో ఒకటి ఒరసుకొనుట జరిగినను జరుగకున్నను ఆ లాలస తోడి చూపు, లాలాటముతో ఢీకొనుట వారి హృదయాలలో కామభావాన్ని దీప్తంచేస్తాయి.

ఇట్టివైన ఈ ఆలింగనములు భార్యా భర్తలను రతిక్రీడకు ఉన్ముఖులను చేస్తాయి. భార్య లేక భర్త తామొదటి కోరికకల వాడైనను ఆభర్తయందు లేక భార్యయందు కోర్కెను రగిలించక రతికి ఉపక్రమింపరాదని వెనుక ప్రకరణములో చెప్పుట జరిగినది.

నాగరులు ఈ ఆలింగనభేదములు తెలిసినవారై తమప్రియులను రతికి ఉన్ముఖులను గావించి పిమ్మట రతిక్రీడాపరులై సుఖించాలి.

---

## చుంబనభేదములు :

స్త్రీ పురుషుల శరీరములోని నాడీమండలమునందు రతికి అభిముఖమైన ఒక ఆవేశము లేక ప్రేరణ ముందు ఏర్పడాలి. అనంతరం రతిక్రీడ ఏర్పడాలి. రతిక్రీడకు పూర్వాంగముగా జరిగితే ఆలింగన–

చుంబన–నఖక్షత– దంతక్షతాదులు బాహ్యారతి అనబడతాయి. చుంబనం అనగా ముద్దు, అత్యధికమైన ఆకర్షణకలచోట యీచుంబనం తనంతతానుగా ప్రవర్తిల్లుతుంది. భార్యాసౌందర్యముచే ఆకృష్టుడై భర్త ఆమెను చుంబించినపుడు – అంతవరకు ఏవిధమైన ఆవేశమును పొందనిదైనప్పటికి ఈ చుంబనముతో ఆభార్యయొక్క నాడీమండల ములోకూడ రతికి అభిముఖమైన స్పందనము, ఆవేశము ఏర్పడతాయి.

కాముకుడైన పురుషునకు భార్యయొక్క సర్వశరీరము చుం బించదగినదిగానే తోస్తుంది. అయినా శరీరంలో స్పర్శగుణం ఎక్క డెక్కడ అధికంగా ఉంటుందో అక్కడక్కడ చేయబడిన చుంబన ములే యోగ్యమైన ఫలితాన్ని యిస్తాయి. ఆవిధంగా స్థానభేదమును బట్టి నిశ్శబ్దము, సశబ్ద అయిన క్రియనుబట్టి చుంబనభేదాలు ఏర్పడ తాయి. ముద్దుపెట్టుకొనుటయందు పెదవులయొక్క స్పర్శయేకాని ధ్వని ఉండని చుంబనములు నిశ్శబ్ద చుంబనములనియు, ధ్వనితో కూడిన చుంబనములు సశబ్ద చుంబనములనియు చెప్పబడతాయి.

(ఆలుమగలలో కామభావము పరమ తీవ్రముగా ఉన్నప్పుడు వారి చుంబనములు నిశ్శబ్దముగానే సాగుతాయి, అనగా ఒకరి ముఖముపై నొకరి ముఖమును పెదవులను ఉంచుకొని నిశ్శబ్దము గానే నిట్టూరుస్తూ పారవశ్యాన్ని పొందేవారు అవుతారు. ఒకవేళ నినియందు ధ్వనియేర్పడినను అది మిక్కిలి అల్పమై గణనకు రానిదై ఉంటుంది. అట్టిచుంబనములు నిశ్శబ్దచుంబనములు అనబడతాయి. ఇక ధ్వని ప్రధానముగా సాగే చుంబనములు సశబ్ద చుంబనములు అనబడతాయి. వానిలో మొదట సశబ్ద చుంబనములు వివరింప బడుతూ ఉన్నాయి. ఇవి మొత్తం ఏడురకాలుగా ఉన్నాయి.

నిశ్శబ్ద చుంబనములు :–

# నిశ్శబ్ద చుంబనములు

**1. నిపీడితచుంబనము :-** భార్యా స్తనద్వంద్వాన్ని నాభీదేశాన్ని కొలదిగా నొక్కుతూ ఉన్నవాడై భర్త ఆమెయొక్క పెదవులపై పెదవులు ఉంచితే అది "నిపీడితచుంబనము" అనబడు తుంది. ఇందు భర్తయొక్క గాఢస్పర్శ నాభీదేశమున, స్తనముల యందు అనుభవించుటయేకాక అతని ముఖగంధములతోబాటు అతని పెదవులు తనపెదవులపై వచ్చినిలచుటతో భార్యయొక్క నాడీమండ లము రతీకి అభిముఖమైన ఆవేశముతో ఒక్కసారిగా కదలిక పొందు తుంది. 'నిపీడితము' అనగా పీడింపబడినది. నాభి స్తనములు పీడింప బడిన మీదట జరిగే చుంబనంఅయినందున దీనికీపేరువచ్చినది.

**2. భ్రామిత చుంబనము -** భ్రామితము అనగా త్రిప్ప బడినది. ప్రియురాలు ఏదోపనిచేయుచుండగా భర్త ఆమెను వెనుకగా వచ్చి చేతులతో ఆమె ముఖమును వెనుకకుత్రిప్పి ఆమె నొసటి యందు లేదా పెదవులయందు ముద్దుపెట్టుకొనుట జరిగితే అది "భ్రామితచుంబనము" అనబడుతుంది. సహజంగా తాను అభిము ఖంగా నిలచివున్నప్పుడుకాక, ఏదోపని చేసుకొంటూ ఉండగ ఆక స్మికంగా వెనుకకువచ్చి ఆవేశంతో కొంత బలాత్కారంగా భర్త తనను చుంబించినపుడు ఆప్రియురాలి మనస్సులో, శరీరములో ఒక వింతకదలిక మెరుపువలె మెరుస్తుంది. ఇట్టి యీచుంబనమునకే భ్రామిత చుంబనము అనిపేరు,

**3. ఉన్నమిత చుంబనము :-** ఉన్నమితము అనగా ఎత్తబడినది. ప్రియురాలు తలవంచుకొని ఉండగా ప్రియుడామెను సమీపించి ఒకచేతితో గడ్డమును, ఒకచేతితో శిరస్సును పట్టుకొని ఆమె ముఖమును పైకెత్తి - ఆమెయొక్క నేత్రములయందు (కనురె ప్పలమీద) బుగ్గలమీద చుంబించుట జరిగినచో అది ఉన్నమిత చుంబనం అనబడుతుంది. భర్త ఆచరించిన ఇట్టి చుంబనమువలన అంత

వరకు రతిక్రీడా విషయమున ఉదాసీనురాలైనప్పటికి ఆ భార్యయందు తీవ్రమైన ఉత్కంఠ ఏర్పడుతుంది.

**4. స్ఫురిత చుంబనము :** అంతవరకు తనయౌవనమును ఎక్కడను కొల్లబెట్టనివాడైన పురుషుడు నిష్కంచుకము, నిశ్చేలము (రవికలేనిది, చీరలేనిది) అయిన భార్యాశరీరాన్ని తొట్టతొలిసారి చూచినపుడు విభ్రాంతుడవుతాడు. అతని శరీరంలో ఆవేశము పట్టరానిదిగా ఉంటుంది. ఆ ఆవేశములో అతని సర్వశరీరము కంపిస్తుంది. అనగా అదురుతుంది. ఈ కంపలక్షణము అతని చేతివ్రేళ్ళ కొనలయందు, పెదవులయందు స్ఫుటంగాకనిపిస్తుంది.

అట్టిసమయమునందు పురుషుడు తన అదురుతూఉన్న పెదవులను భార్యయొక్క బుగ్గలమీద స్తనములమీద ఉంచుటజరిగితే భార్యయొక్క సర్వశరీరము పులకిస్తుంది. ఇట్టిదైన చుంబనమునకు స్ఫురిత చుంబనము అని పేరు. స్ఫురణము (అదరుట) తోడి యీ చుంబనము, నవదంపతులయందే కాక దీర్ఘకాలవియోగాన్ని అనుభవించి కలసికొన్న దంపతులమధ్యకూడ ఏర్పడుతుంది. రతిరహస్యమునందే చుంబనము భిన్నముగా చెప్పబడినది. "మహామునీనాం మతయోపి భిన్నాః". చూ: రతిరహస్యం.

**5 సంహతోష్ఠము :** భార్యయొక్క హృదయభాగమున, మొలయందు, తొడలయందు స్ఫురిత చుంబనమునందువలెనే పెదవులను రెంటిని దగ్గరగాచేర్చి కొంత గాఢముగ చేయబడిన చుంబనము 'సంహతోష్ఠము' అనబడుతుంది. స్ఫురిత చుంబనమునందు అదురుచున్న పెదవులు రెండును దగ్గరగా చేర్చబడవు. మరియు దానియందు నిక్కిలి అల్పమైన స్పర్శ ఏర్పడుతూంది. ఈ చుంబనమునందట్లు కాక, పెదవులు రెండును సంశ్లిష్టములై ప్రవర్తించుట, గాఢత అనే రెండు లక్షణాలు ఉంటాయి. దగ్గరగాచేర్చబడిన పెదవులతో చేయబడిన చుంబనమైనందున ఈ చుంబనమునకు సంహతోష్ఠము అని పేరు.

**6. వైకృతికము :** ప్రియురాలు తనయొక్క పార్శ్వ భాగమున కూర్చుండి యుండగా ఆమెను తనయొడిలోనికి అడ్డముగా వంచి ఆమెయొక్క బుగ్గలను, కంఠమును, కుచములను చుంబించుట వైకృతిక చుంబనము అనబడుతుంది, "వైకృతము" అనగా వ్యతిరేకముగా చేయబడినది. భార్యాభర్తలు ఒకరికొకరు ఎదురు ఎదురుగా నున్నపుడు జరుగు చుంబనము సహజము. అట్లు కాక భార్య అడ్డముగా పురుషుడు నిలువుగా ఉన్నప్పుడు చేయబడు చుంబనమైనందున దీనికి "వైకృతిక" మని పేరేర్పడును.

**7. నతగండచుంబనము :** భర్త శయనించిన శయ్యయొక్క పార్శ్వభాగమునకు భార్యవచ్చి నిలచి ఉండగా - శయనించినవాడై యున్న ఆభర్త ఆమెయొక్క ముఖమును బాగుగా వంచి ఆమె బుగ్గలను చుంబించినచో అది 'నతగండము' అనబడుతుంది. నతము - అనగా వంచబడినది. 'గండము' అనగా బుగ్గ. ఈ చుంబనమునకు బుగ్గలే ప్రధానస్థానమైనను భార్యయొక్క సర్వశరీరము ఈ చుంబనమునకు తగినదే అని శాస్త్రకర్తల అభిప్రాయము. అయినను ప్రధానస్థానము బుగ్గలగుటచే దీనికి 'నతగండము' అను పేరు వచ్చినది.

ఇంతవరకు చెప్పబడిన యీ ఏడు చుంబనములు నిశ్శబ్దచుంబనములు అనబడతాయి. వీనియందు ధ్వని ఉండదు. ఉన్నను అది మిపుల అల్పంగా ఉంటుంది. సశబ్దచుంబనములు ధ్వని ప్రధానంగా సాగుతాయి. అవికూడ సఖ్యచే ఏడుగానే ఉన్నాయి.

## సశబ్దచుంబనములు :

**1. సూచీచుంబనము** . సూచి అనగా సూది. ప్రియుడు తన నాలుక చివరను సన్నగా నుండునట్లొనరించి ప్రియురాలి పెదవుల గుండా ఆమె నోటిలో సూదిదూర్చినట్లు దూర్చుట జరిగినచో అది

సూచీచుంబనము అనబడుతుంది. కాముకుల చేష్టలకు అర్థముండదు. ఎందుకో ప్రియురాలి పెదవులను బిగించి కూర్చుండవచ్చును. ప్రియు డామెయందున్న కోర్కెతో బిగించియున్న ఆ పెదవులలోనుండి దారి చేసికొనుటకు తగినంత దృఢముగా నాలుకను బిగించి, అనగా దానికి దృఢతను కల్పించి - మెత్తనైన ప్రియురాలి పెదవులగుండా ఆమె నోటిలోనికి చొప్పించవచ్చును. ప్రియునియొక్క యీచేష్టవలన అప్రియురాలి నాడీమండలము కూడ రతికి అభిముఖమైన ఆవేశమును పొందుతూంది. ఈ చుంబనమునందు ధ్వని కూడ యేర్పడుతుంది. ఇట్టి యీచుంబనమునకు సూచీచుంబనము అని పేరు.

**2. ప్రతతాచుంబనము :** ప్రతత అనగా విస్తరించినది. నాలుక యొక్క చివరను కోరినపుడు సన్నగా చేయుట. వెడల్పుగా పల్చగా చేయుటయందు అందరకు నేరుపు సహజంగా ఉంటుంది. వెనుక చెప్పిన సూచీచుంబనమునందు నాలుక సన్నగాచేయబడి ప్రియురాలి పెదవులయందు ప్రవేశింపజేయుట జరిగితే ఈ చుంబనమునందు నాలుకను వెడల్పుగాచేసి ప్రవేశింపజేయుట జరుగుతుంది. నాలుకను వెడల్పుగాచేసి ప్రియురాలి పెదవులలోనికి ప్రవేశింపజేయుటకే ప్రతతా చుంబనమని పేరు.

**3. వాళలీ చుంబనము :** ప్రియురాలి నోటిలోనికి ప్రవేశ పెట్టబడిన తన నాలుకను ప్రియుడు ఇటు నటు కదిపినపుడు "వాకలీ" అన్న శబ్దమునకు సన్నిహితమైన ధ్వని ఏర్పడుతుంది. అట్టి చుంబనము నకు వాకలీ చుంబనమని పేరు.

**4. ఓష్ఠవిమృష్టచుంబనము :** ప్రియురాలి పెదవులనుగాక కేవలమామెయొక్క నాలుకను ప్రియుడు తన పెదవులతో గ్రహించి నాలుకతో పీల్చుట వంటి క్రియ నాచరించినచో అది 'ఓష్ఠవిమృష్టము' అనబడుతుంది.

**5. చుంబితకము :** ఏమామిడి పండునో పీల్చినట్లు తాంబూలరాగారుణమై, సువాసనాపూర్ణమైయున్న ప్రియురాలి నాలుకను వేగముగ పీల్చినచో అది 'చుంబితకము' అనబడుతుంది. దీనికిని

'ఓష్ఠవిమృష్టము'నకును అధికవేగ – అల్పవేగములు మాత్రమే భేదము.

**6. అర్ధ్రచుంబనము :** ప్రియుడు తన భార్యయొక్క క్రింది పెదవిని తన మునిపంటితో కొద్దిగా నొచ్చునట్లు కొరికి ఆమె యొక్క ఆ పెదవినే తన పెదవులతో గ్రహించి పీల్చినచో అది అర్ధ్ర చుంబనము అనబడుతుంది. ప్రియురాలి పెదవిని ఈవిధముగా మునిపంటితో కొరుకునప్పుడు ప్రియుడు తనక్రిందపండ్లను తనక్రింది పెదవితో కప్పియుంచి కేవలము పైపంటితో మాత్రమే కొద్దిగా గాటుపడునటులు కొరుకవలెనేకాని ఈ క్రియయందు క్రింది పండ్లను, మీదిపండ్లను కలిపి ఉపయోగించరాదు. ప్రియాశరీరము సర్వము మధురము. ఉత్తేజకరము అయి ఉంటుంది. అందుచే ప్రియుడు కేవలము చుంబించుటయేకాక కొన్ని కొన్ని శరీరభాగములయందు చూషణక్రియ (పీల్చుట) అచరించి కాని తృప్తిపొందజాలనివాడవుతాడు.

**7. సంపుటకము :** భర్త, భార్యయొక్క పై పెదవిని తన పెదవులతో గ్రహించి చుంబించుచుండగా – భార్య తన రెండు పెదవుల మధ్యకు చేరిన భర్తయొక్క క్రింది పెదవిని చుంబించుట జరిగినచో ఆచుంబనము సంపుటకము అనబడుతోంది. ఇది కేవల చుంబనము గాక చూషణ క్రియతో (పీల్చుట) కూడి ఉంటుంది. ఒకే సమయమున భార్యాభర్తలు ఇద్దరియందు ఈక్రియ ప్రవర్తిల్లుతుంది. అందుచే దీనికి సంపుటి చుంబనమని పేరు వచ్చినది.

ఈ చుంబనము లేదును సశబ్ద చుంబనము లనబడతాయి, వీనియందు ధ్వని ఏర్పడుటయే దీనికి కారణము. నిశ్శబ్దచుంబనము లేదును క్రొత్తజంటలయందును, వియోగానంతరము కలిసికొన్న వారియందును ఏర్పడతాయి. ఈ సశబ్ద చుంబనము లేదును నిరంతరము కామక్రీడాపరులై తృప్తిచెందని దంపతులయందేర్పడతాయి, ఈచుంబనము లన్నియు ఆలుమగలను రతికి అభిముఖులుగా చేయుటయందు తోడ్పడతాయి.

# నఖక్షతములు :

నఖము అనగా గోరు. క్షతము అనగా గాయము. ప్రియురాలి యొక్క శరీరమున కాంతి మంతములై మాంసలములైన భాగములను భర్త కేవలము స్పృశించి, ముద్దు బెట్టుకొని తృప్తి చెందక ఆయా మాంసల భాగాలను గోళ్ళతో సన్నగా నొక్కి తృప్తి చెందే వాడై ఉంటాడు. అట్టివైన గోటి నొక్కులకే నఖక్షతములని పేరు. భర్త తన యొక్క శరీరమును జూచి ఆవేశముతో నఖక్షతము లాచరించినపుడు భార్యయందు రతికి సుముఖమైన ఆవేశము కలుగుతుంది. అయితే ఈవిధంగా భార్యా శరీరముపై నఖక్షతముల నాచరింపగోరు పురుషుడు తన గోళ్ళను మిక్కిలి శుభ్రంగా ఉంచుకోనాలి. వాని యందు పోరలు, మాలిన్యము లేకుండ చూచుకొనాలి. లేకున్నచో అతని గోటిలోని మాలిన్యము ప్రియురాలి నెత్తుటియందు ప్రవేశించి పుండుపడవచ్చును. ఈ నఖక్షతములు మొత్తము ఎనిమిది రకములుగా ఉన్నాయి.

**1. ఉచ్ఛురితము:** భార్యయొక్క స్తనములయందు, బుగ్గల యందు లేదా చెంపల యందు ప్రియుడు తనచేతి గోళ్లు ఐదింటితోడను ఆమె శరీరము గగుర్పాటు చెందునట్లు, వీణవాయించినట్లు రేఖలు స్పష్టంగా గోచరింపనటులు గీరినచో అది ఉచ్ఛురితము అనబడుతుంది. గోళ్ళయొక్క యీవిధమైన అల్పస్పర్శవలన ఆమెయొక్క శరీరం పుల కిస్తుంది. సాధారణంగా లోకంలో అందరకు వెన్నుపూసమీద పొడ వుగా వేలితో అల్పస్పర్శ కలిగించినపుడు చక్కిలి గింతవంటి స్థితి ఏర్పడి నాడీమండలమునందొక వింత కదలిక ఉదయిస్తుంది. అట్లేప్రియా శరీరమున గూడ ఉచ్ఛురిత నఖక్షతము అల్పస్పర్శతో ఆచరింపబడి ఆమె శరీరమును జలదరింపజేస్తుంది.

**2. అర్థచంద్రము:** అర్థచంద్రము అనగా సగమైయున్న చం ద్రునివలె వంకరగా నున్నది అని అర్థము. ప్రియుడు ప్రియురాలి మెడమీద, స్తనములమీద అర్థచంద్రాకృతి ఏర్పడునట్లు గోటితో

నొక్కుట అర్ధచంద్రము అనబడుతుంది. సహజముగా ఏ గోటితో నొక్కి-నను అర్ధచంద్రాకృతి ఏర్పడుతుంది. అందుచే ఈనఖక్షత మాచరించుట సులభము. ఉచ్ఛురితము మాత్రమట్టిదికాదు. దాని నాచరించుటకు పురుషుని యందొకింత నేర్పు అవసరము. వీణవాయించునప్పుడువోలె పురుషుడు తనచేతి వేళ్ళను వదులుగా ముడిచియుంచి బొటనవ్రేలిని, భార్యా శరీరమునందాన్చియుంచి వీణతీగను మీటినట్లు మిగిలిన నాలుగు వేళ్ళను చటచట ధ్వనితో బొటనవ్రేలిమీదుగా భార్యా శరీరమును తాకునట్లు చేయుట "ఉచ్ఛురితము" అప్పుడు బొటనవ్రేలిగోటి రేఖ కొంత స్పష్టముగా నున్నను, మిగిలిన గోళ్ళయొక్క- రేఖలు అల్పస్పర్శతో అభిరామముగ అస్పష్టముగ ఉదయిస్తాయి. అందుచే ఉచ్ఛురితము నాచరించుటకు కొంత ఊహతోడి నేర్పు అవసరము. అర్ధ చంద్రమునకు ఊహతో నేర్పుతో పని యుండదు.

**3. మండలకము:** మండలకము అనగా గుండ్రనిది. అర్ధచంద్రములను రెండింటిని ఒకదాని కొకటి అభిముఖంగా రేఖలను కలుపుతూ ఆచరించినపుడు మండలకము ఏర్పడుతుంది. బొటనవ్రేలిగోటితో మరియొక వ్రేలి గోటిని దగ్గరగా చేర్చి నొక్కుట వలన మండలకము ఏర్పడుతుంది. భార్యయొక్క- కంఠము స్తనములేకాక పిరుదులుకూడ ఈ మండలకమునకు తగిన స్థానములై ఉన్నాయి.

**4. వ్యాఘ్రపదము:** వ్యాఘ్రమనగా పెద్దపులి. అది ఒక చోట నుండి మరియొక చోటునకు పొడవుగా లంఘించు (దాటు) స్వభావము కలదై ఉంటుంది. అట్లే భార్యయొక్క- తొడలపై, పిరుదులపై పురుషుడు కొలది పొడవైన గోటి గీరల నేర్పాటుచేసినచో అది వ్యాఘ్రపదము అనబడుతుంది. పెద్దపులి యొక్క- పాదముల గుర్తులవోలె దీర్ఘములైన గుర్తులు దీనియందేర్పడుతాయి. అందుచే దీనికి వ్యాఘ్రపదమని పేరు వచ్చినది.

**5. రేఖాక్షతి :** భార్యయొక్క తొడలపై పిరుదులపై వెనుక చెప్పిన వ్యాఘ్రపదము కంటె పొడవైన రేఖల నేర్పరచినచో అది రేఖాక్షతి అనబడుతుంది. ఈ క్షతి కొంచెము లోతుగా చేయబడు తుంది. భర్త యేదైన గ్రామాంతర మేగునపుడు పూర్వరాత్రిమున భార్యయొక్క శరీరమునందిట్టి రేఖల నేర్పరచినచో ఆతడు వచ్చువరకు ఆ రేఖలు ఆమె కింటబడినపుడెల్ల ఆమెయందొక మధురానుభూతి కలుగుతుంది.

**7 శశప్లుతము :** భార్యయొక్క పిరుదులమీద, స్తనముల మీద, మోకాలి వెనుక భాగమున పురుషుడు తన చేతి గోళ్ళనైదింటిని కలిపి ఒకేసారి గుచ్చినచో అది శశపుతము అనబడుతుంది. శశ మనగా కుందేలు. కుందేలు గెంతినపుడు దాని పాద చిహ్నములు నేల మీద ఏర్పడతాయి. సరిగా అట్టిదైన ఆకృతి ఐదుగోళ్ళనుకలిసిగ్రుచ్చుటవలన ఏర్పడుతుంది. అందుచే దీనికి శశప్లుత మని పేరు వచ్చినది.

**7 ఉత్పలపత్రము :** ఉత్పలము అనగా కలువపూవు. పత్రం అనగా రేక. కలువ రేకలు మిక్కిలి దూరముకాక మిక్కిలి దగ్గరకాక దొంతులు దొంతులుగా ఉంటాయి. భార్యయొక్క స్తనములయొక్క అడుగుభాగమునందు పురుషుడు గోళ్లతో దగ్గర దగ్గరగా గుచ్చి అట్టి రేఖలను ఏర్పరచినచో అది ఉత్పల పత్రము అనబడుతుంది.

**8 మయూరపదము :** మయూర పదము అనగా నెమలి కాలు. భార్యయొక్క స్తనములయందు లేక బుగ్గలయందు పురుషుడు. తన చిటికెనవ్రేలిని విడచిపెట్టి మిగిలిన నాలుగు వ్రేళ్ళతోడను పరస్పరము కలియునట్లు రేఖల నేర్పరచినచో అది మాయూరపదము అనబడుతుంది. అనగా బొటనవ్రేలిని భార్యా శరీరభాగమునందాల్చియుంచి, మిగిలిన మూడు వ్రేళ్లను దూరముగాచాచి వానియొక్క గోళ్ళ ను కూడ శరీరభాగమునందాల్చి ఆమూడు వ్రేళ్లను, ఈబొటనవ్రేలిని కూడ పరస్పరము దగ్గరగా లాగవలెను అప్పుడు మయూరముయొక్క

పాదచిహ్నమువంటి గోటి గీరలు భార్యా శరీరమునందేర్పడుతాయి. భార్యయొక్క స్తనములయందైనచో ఈ మయూరపదరేఖలు చూచుకము (చనుమొన) దగ్గర కలుస్తాయి.

ఇట్టివైన నఖక్షతములను ఎనిమిదింటిని నాగరజనులు ఔచిత్య మెరిగి ఆచరించే నేర్పు కలవారై ఉంటారు. వీని వలన భార్యామానసములో ఉల్లాసం కలుగుతుంది.

## దంతక్షతములు

పరమసుందరములైన భార్యాశరీరభాగములను కేవలము తాకి, చుంబించి, గోటితో గిల్లి పురుషుడు తృప్తి పొందజాలనివాడై ఆయా సుకుమార భాగములయందు పంటితో గాటుపరచి ఆనందించే లక్షణం కలవాడై ఉంటాడు. ఇట్లు పండ్లతో గాటుపరచుట సహజమే కాని అసహజముకాదు. సౌందర్యాన్ని అనుభవించుటయందు దంతములతో క్షతం అనగా గాటు కలిగించుట పురుషునియందలి తీవ్రావేశాన్ని సూచిస్తుంది. అట్లు ఆవేశముతో పురుషుడు దంతక్షతం ఆచరించినంతనే స్త్రీయందుకూడ రతికి అభిముఖమైన స్పందనం ఏర్పడుతుంది.

ఈ దంతక్షతాలు మొత్తం ఏడు రకాలుగా ఉన్నాయి. ఈ క్షతాలు ఆచరించుటకు పూర్వం పురుషుడు తన దంతములయొక్క శుభ్రతపవయమున శ్రద్ధవహించినవాడై ఉండాలి. మలినరహితములై తెల్లగా మెరసే దంతపంక్తి పురుషుని అందాన్ని ఇనుమడింపజేస్తుంది. మరియు అట్టి దంతాలు దంతక్షతాచరణానికి యోగ్యములై ఉంటాయి. దంతములయందిట్టి స్వచ్ఛత సంపాదించుటకు పండ్లు తోముకొనుటయందే కాక అజీర్ణాదిరోగములు సంభవించుటకు వీలులేని మితాహార నియమమునందుకూడ శ్రద్ధ అవసరము. దంతక్షతములయందు మొదటిది గూఢకము.

**1. గూఢకము :** గూఢ శబ్దమునకు రహస్యమైనదని అర్థము. ప్రియురాలి క్రిందిపెదవియందు పురుషుడు తన పైపంటితో క్రింది

పెదవితో కొంచెమెరుపుచిందునట్లు నొక్కుట జరిగితే అది గూఢకము అనబడుతుంది. అది కేవలము ఎఱ్ఱదనము అనగా కందియుండుటచే మాత్రమే గుర్తించదగిన స్థితిలో ఉండాలి. లోతుగా గాటుపడరాదు. ఇట్లు నిగూఢమైన స్థితికలిగిన దంతక్షతము 'గూఢకము' అనబడుతుంది.

**2. ఉచ్ఛూనకము :** ఉచ్ఛూనము అనగా ఉబ్బినది. ప్రియురాలు సమీపమునందుండగా పురుషుడు ఒక్కొక్కప్పుడు ఉన్మత్తమైన ఆవేశానికి లోనై ఆమెయొక్క రమ్యశరీరభాగములను లలితముగా కాక ఇంచుక ఉబ్బినట్లు గాఢంగా మునిపంటితో పీడించుటకూడ జరుగుతూఉంటుంది. భార్యయొక్క క్రిందిపెదవియందు, ఎడమ బుగ్గయందు పైనచెప్పినరీతిగా ఉబ్బునట్లు పంటితో నొక్కుట ఉచ్ఛూనకము అనబడుతుంది. ఉబ్బుట దీని ప్రధానలక్షణము. అయినను భార్యయొక్క మిగిలిన శరీరభాగములను విడచి క్రిందిపెదవిని, ఎడమబుగ్గనుమాత్రమే దీనికి తగిన స్థానములుగా శాస్త్రకర్తలు నిశ్చయించారు.

**3. ప్రవాళమణి :** ప్రవాళమనగా పగడము. పగడము ఎఱ్ఱగా ఉంటుంది. ఉచ్ఛూనకమే మిక్కిలి నేర్పుతో భార్యయొక్క యెడమబుగ్గయం దాచరింపఁబడినప్పుడు ప్రవాళమణి అనబడుతుంది. నేర్పులేకుండ ఈ దంతక్షతము ఆచరింపరాదు.

**4. బిందువు :** భార్యయొక్క క్రిందిపెదవిని పురుషుడు తన ముందుపండ్లతో (క్రిందిపండ్లతోడను, మీదిపండ్లతోడను) రెంటితో మాత్రము గాటుపరచినచో అచ్చట ఒకచుక్క ఏర్పడుతుంది. అట్టి క్షతమునకు బిందుక్షతమని పేరు. ఈ నాగరసర్వస్వమునందు బిందుక్షతము మాత్రమే చెప్పబడినది. కాని రతిరహస్యమునందిట్టి బిందువులను వరుసగా ఏర్పాటుచేయుట "బిందుమాల" అనబడుతుందని వేరొక దంతక్షతముకూడ వివరింపబడినది. చూ. రతిరహస్యం.

**5 మణిమాల :** భార్యయొక్క కంఠము, బుగ్గలు, గుండెలు ఈక్షతమునకు తగినవి. ఈస్థలములయందు పురుషుడు తనయొక్క క్రింది

పండ్లను మీదిపండ్లను అన్నిటిని వినియోగించి కొంచెము గాఢముగ క్షత మొనర్చినచో ఆపంటిగాట్లు వరుసగా యేర్పడతాయి. అవి ఎఱ్ఱగా పూసలమాలవలె మెరుస్తాయి. అట్టి దంతక్షతమునకు మణిమాల అని పేరు.

**6 గండకము :** దీనికే ఖండకము లేక ఖండాభ్రికము అని పేరు. ఖండకము అనగా ముక్క. అభ్రిము అనగా మేఘము. ఖండాభ్రికమునకు మేఘఖండమని అర్థము. ఆకాశమునందప్పుడప్పుడు దొంతులు దొంతులుగా ఒకేదానిమీద ఒకటి పేర్చినట్లు మేఘఖండాలు కనిపిస్తాయి. సరిగా అట్టి రూపము యేర్పడునట్లు పురుషుడు భార్య యొక్క బలిసిన చనుగవ చుట్టూ వృత్తాకారములో పంటిగాటులను యేర్పరిస్తే అది 'గండకము' అనబడుతుంది.

**7 వరాహచర్వితము :** వరాహమనగా పంది. చర్వితమనగా తినబడినది. పందులు యేతుంగముస్తెలనో తినుటకై భూమిని ముట్టెతో పెల్లగించుట చూస్తూ ఉంటాము అట్లే పురుషుడు భార్యయొక్క బలిసి ఉన్న చనుగవ మీదను, పిరుదులమీదను దీర్ఘరేఖలు యేర్పడునట్లు పండ్లతోగాటు పరచినచో అది 'కోలచర్వితము' అనబడుతుంది.

లోకమునందు భార్యాభర్తలు కామభావ ప్రేరితులైనపుడు ఆలింగన – చుంబన – నఖక్షత – దంతక్షతాదులు వాని అంతట అవే యేర్పడుతూ ఉంటాయి. కాని శాస్త్రము లలితములు, సుందరములు అయిన విధానాలను ప్రస్తావిస్తుంది. నాగరకజనం సర్వవిషయాలను లలితంగా సుందరంగా ఉపాసిస్తారేకాని ఎందునా మోటుదనం కనబరచరు.

పైన చెప్పబడిన దంతక్షతాదుల వలన స్త్రీ పురుషులలోని కామాగ్ని ప్రజ్వరిల్లి వారిలో అభ్యంతరరతికి తగిన ఉద్వేగం జనిస్తుంది. ఆలింగన – చుంబన నఖక్షత – దంతక్షతములనే యీ నాలుగింటికి బాహ్యరతి అని పేరు. సహజంగా పురుషునియందు కంటె స్త్రీయందు

కాముము ఎక్కువ. అందుచే పురుషుడు బాహ్యారతి పూర్వకంగానే వర్తించాలికాని ఆరంభమందే అభ్యంతరరతికి ఉపక్రమిస్తే ఆమెలో సంతృప్తి యేర్పడదు. పురుషాంగము స్త్రీయొక్క యోనియందు సం నివిష్టము చేయబడే అభ్యాంతరరతిని గూర్చి తెలిసికొనుటకు ముందు స్త్రీయొక్క యోనిస్వరూపమును గూర్చి తెలియుట అవసరము.

# యోని స్వరూపము - నాడీభేదములు

స్త్రీయొక్క మర్మావయవమునకే యోని అనిపేరు. "యాతి శిశ్నేన ఇతి యోనిః" అనగా "శిశ్నముతో (పురుషాంగముతో) కూడు కొనునది" అని యోని శబ్దమునకు ఉత్పత్తి. కామభావము ఇక్కడ ఫలించుచుండుటచే దీనికి మదనమందిరము, మన్మధగృహము మొదలగు పేర్లుకూడ యేర్పడ్డాయి.

స్త్రీయొక్క మదన మందిర ముఖద్వారమునందు ఒక సన్నని మెత్తని చర్మఖండము యేర్పడి ఉంటుంది. దీనికి మదనచ్ఛత్రిము అని పేరు. ఛత్రిము అనగా గొడుగు. మన్మధగృహద్వారమును కప్పియుంచునదగుటచే దీనికి మదనచ్ఛత్రిము అను పేరేర్పడెను.

ఉ మదనచ్ఛత్రిమునందు స్త్రీయొక్క శరీరములో కామభావమును జ్వలింపజేసే ఇరువది నాలుగు నాడులు సంగమిస్తున్నాయి. ఇన్ని మదనాడులకు కూడలియై యున్నదగుటచే ఈమదనచ్ఛత్రిము అభ్యంతరరతి యందు స్త్రీయొక్క తృప్తిలో ప్రధానస్థాన ఆక్రమిస్తుంది.

అభ్యంతర రతిని ఉపక్రమిస్తూ పురుషుడు మొదట ఈమదనచ్ఛత్రాన్ని తన చేతి వ్రేలితో కలచాలి. బాలను పదునారేండ్లలోపువయసు కలది కలియునపుడే మదనచ్ఛత్రిమును చేతివ్రేలితోడనే కలచవలసి ఉంటుంది. కాని ప్రౌఢ అయిన వనితా విషయమున చేతి వ్రేలినే ఉపయోగించవలెనన్న నియమం లేదు.

అచ్చట పురుషుడు తన పురుషాంగముతోడను లేదా తన చేతి వ్రేలితోడను కలచవచ్చును. ఇట్లు కలచుట వలన స్త్రీయోనియం దలి నాడీ సముదాయ మంతయు వింతగా కదిలి ఆమెలో పారవశ్యము యేర్పడుతుంది.

ఆభ్యంతర రతివేళ స్త్రీయొక్క సర్వశరీరము పురుషునిచే ఆక్రమింపబడుతుంది, స్త్రీయొక్క తృప్తికి హేతువులైన నాడులు యోనియందేకాక శరీరమునందంతటను ఉన్నాయి. పురుషుడు వనిత యందు రతికి నలసిన ఉత్కంఠను పెంపొందించి ఆమెలో పార వశ్యమును జనింపజేయుటకు కేవలము మదనచ్ఛత్రమునే కాక ఇతరనాడులనుకూడ కలచవలసివుంటుంది. అయితే ఆనాడులు స్థానాలు తెలియవలెనుకదా!

స్త్రీయొక్క రెండు నేత్రములందు రెండునాడులున్నాయి. ముఖ మందు (నుదుట) రెండునాడులున్నాయి. నోటియందొకనాడి ఉన్నది. కాలి బొటనవ్రేలి మొదటిభాగమునందొకనాడి ఉన్నవి.

పురుషుడు మదనచ్ఛత్రమును కలచువేళ ఈ నాడీ స్థానము లయందు చుంబనాదులచే కదలిక కలిగించుట అవసరము. వనిత కాలిబొటనవ్రేలి మొదటనున్న నాడీస్థానమును పురుషుడు తనకాలి బొటనవ్రేలితో నొక్కుటవలన ఆనాడియందొక వింత కదలిక ఉదయిస్తుంది.

కొందరు రతిశాస్త్ర కోవిదులు ఈనాడులనేకాక వనితయొక్క తొడలను, చెవులను, ప్రక్కలను (పార్శ్వము) త్రికమును (వెన్నెముక తుదిభాగము) శిరస్సునుకూడ పురుషుడు తనచేతితో తాకుట అవసరమనియు, అట్లు తాకినగాని వనితలయందు అచ్చమైన పారవశ్య ఉదయించదనియు చెప్పుచున్నారు.

స్త్రీయొక్క యోనియందు ప్రధానములైన నాడులు ఆరు ఉన్నాయి. 1. సతీనాడి, 2. అసతీనాడి, 3. సుభగానాడి, 4 దుర్భగానాడి, 5. పుత్రీనాడి, 6. దుహిత్రిణీనాడి. అని వానిపేర్లు.

ఇందు సతీ - అసతీనాడులు స్త్రీయొక్క యోని పై చర్మమునందే ఉన్నాయి. సతీనాడి యోనికి ఎడమభాగముల అసతీనాడి కుడిభాగమున ఉంటాయి. "సుభగ, దుర్భగ" అనేనాడులు యోనియొక్క కొంత లోపలిభాగములో ఉన్నాయి. సుభగానాడి యోనిలో కుడివైపునవుంటుంది. ఇక పుత్రీ దుహిత్రిణీనాడులు యోనియొక్క మిక్కిలి లోపలిభాగంలో ఉంటాయి. పుత్రీనాడి యోనియొక్క మిక్కిలి లోపలిభాగంలో ఎడమవైపునవుంటే దుహిత్రీనాడి దానికి ఎదురుగా కుడివైపునవుంటుంది.

పురుషుడు తన పురుషాంగముతో ఈ నాడిస్థానములందు గాఢమైన స్పర్శ కలిగించాలి. సతీ అనే నాడీస్థానమునందు పురుషాంగ స్పర్శచే కులస్త్రీలు ఆనందిస్తారు. అసతీఅనేపేరుతో యోనియొక్క పైచర్మమున కుడిభాగమునందుండే నాడిని స్పృశించుట వలన వేశ్యలు, వ్యభిచారిణులు ఆనందిస్తారు. ఇది వ్యత్యస్తమైనపుడు అనగా కులస్త్రీయొక్క అసతీనాడికి. కులటయొక్క సతీనాడికి పురుషాంగముద్వారా ప్రేరణ కలిగినపుడు వారిలో రతికి సంబంధించిన ఉత్సాహము దీప్తము కాకపోవుటయేకాక వారాపురుషునియందు ద్వేషముకూడ వహిస్తారు.

స్త్రీ యోనియొక్క కొంత లోపలిభాగమునందు (ఎడమ - కుడిభాగములందు ఉండే సుభగా దుర్భగా నాడులలో పురుషుడు తనయొక్క అంగముచే సుభగానాడియందు మాత్రమే గాఢస్పర్శ కలిగించేవాడైనపుడు స్త్రీ మిక్కిలి తృప్తిని అనుభవించుటయేకాక, కాలంగడచేకొలది ఆమెశరీరం నునుపుదేరుతుంది. ఆమెశరీరంలో లావణ్యస్థానం ఏర్పరచుకొంటుంది, ఆమెయొక్క స్తనద్వయం

బలుస్తుంది. ఆమెలో యాౌవనం స్థిరనివాసం ఏర్పరచుకొంటుంది. అందుచేపురుషుడు స్త్రీ యోనిలో వామభాగమున నెలకొనివుండే సుభగా నాడిని దృష్టియందుంచుకొని దానియందు గాఢస్పర్శ ఏర్పటవలెనన్న సంకల్పముతో తనఅంగముతో యోనిలోని వామభాగమును కలచాలి.

అట్లుకాక పురుషుడు స్త్రీ యోనిలో సుభగా నాడికిఎదురుగా కుడివైపున ఉండే దుర్భగానాడియందు ప్రేరణ కలిగించుటవలన కాలంగడచేకొలది ఆమెలోని లావణ్యం అంతరిస్తుంది. ఆమె శరీరం కర్కశంగా ఎండిన కట్టెలా తయారవుతుంది. ఆమె దేహచ్ఛాయ కూడా నశిస్తుంది. అకాలంలోనే వార్ధకం ఆమె శరీరంలోకి తొంగిచూస్తుంది. అంతేకాక ఆమె ఎల్లపుడు ఏదో ఒక రోగముతో బాధపడేదవుతుంది. అందుచే పురుషుడు దుర్భగానాడియందెన్నడును ప్రేరణ కలిగింపరాదు,

ఇక యోనియొక్క అధస్తలమందున్న పుత్రీ దుహిత్రిణీ నాడులలో పుత్రీనాడి యోనియందు ఎడమభాగమున దుహిత్రిణీనాడి కుడివైపున ఉన్నవని చెప్పబడెను కదా! ఈ పుత్రీనాడియందు పురుషుడు తన పురుషాంగముద్వారా ప్రేరణ కలిగించినపుడు స్త్రీ గర్భమును ధరిస్తే పుత్రునే ప్రసవిస్తుంది. ఇక దుహిత్రిణీనాడి యందుపురుషాంగము ద్వారా ప్రేరణ కలిగినపుడు స్త్రీ గర్భమును ధరిస్తే 'దుహిత' అనగా కూతురు జన్మిస్తుంది. ఈ కారణముచే తనకు పుత్రులు జన్మింపవలెనని కోరువాడు తనభార్యతో కలసినపుడు రతివేళ తన అంగముద్వారా ఆమెయొక్క యోనికి లోతట్టున ఎడమవైపున మాత్రమే గాఢస్పర్శ కలిగించాలి. అట్లుకాక తనకుపుత్రిక జన్మింపవలెనని కోరువాడు భార్యయొక్క యోనిలోకుడిభాగమున ప్రేరణ కలిగించవలసి ఉంటుంది.

పద్మశ్రీయొక్క అభిప్రాయానుసారము ఈ చెప్పబడిన ఆరు నాడులకును యోనియే స్థానమైఉన్నది. కాని కొందరు దీనికి భిన్నముగా వీని స్థానములను పేర్కొనుచున్నారు. ఈ విషయమునుకూడ పద్మశ్రీ 'కొందరిట్లనుచున్నారని' తన గ్రంథమున మతాంతరమును పేర్కొనెను.

ఆ కొందరి అభిప్రాయము ననుసరించి సతీనాడికి స్త్రీయొక్క స్తనములును, అసతీనాడికి చంకలును, సుభగానాడికి పెదవులును, దుర్భగానాడికి వెన్నుపూస తుదిభాగమును, పుత్రీనాడికినోరును, దుహిత్రిణీనాడికి నితంబమును (పిరుదులు) స్థానములై ఉన్నాయి.

ఈ మతము ననుసరించి పురుషుడు సతీనాడీచోదనము చేయ దలచినపుడు భార్యయొక్క స్తనములను మర్దింపవలెను. అసతీనాడిని ప్రేరేచదలచినపుడు చంకలయందు నఖక్షత మాచరింపవలెను. (ఇట్లు ఆచరించినపుడు కులస్త్రీలకు, కులటలకు అధికానందము కలుగుతుంది స్వాత్మ్య స్తమైనపుడు వారియందుబా ఆనందము కొంత లోపించునే కాని నానా పురుషుని ద్వేషించుట జరుగదని- ఈ మతమువారి అభిప్రాయముగా గ్రహింపవలెను.) సుభగానాడీచోదనము చేయదలచినపుడు పెదవులను ముద్దుకొనవలెను. దుర్భగానాడిని ప్రేరేచదలచినపుడు వెన్నుపూస తుదిభాగమును చేతితో మర్దింపవలెను. జిహ్వా ప్రవేశముచే పుత్రీనాడిని, పిరుదులను మర్దించుటచే దుహిత్రిణీనాడిని ప్రేరేచవలసిఉంటుంది. ఇది మతాంతరము.

వనితయొక్క యోనిలో అధోభాగమునందున్న పుత్రీ దుహిత్రిణీ నాడులకు రెండింటికి పురుషుడు తన పురుషాంగముచే ఏకకాలమున ప్రేరణ కలిగించుట జరిగి ఆ సమయమునందే స్త్రీ గర్భమును ధరించే స్థితి ఏర్పడితే ఆమెకు నపుంసకుడు జన్మిస్తాడు.

అయితే లోకంలో అందరకును ఈ నాడీభేదం అవగతం అయి నందువల్లనే పుత్రులు లేక పుత్రికలు జన్మించడం జరుగుతూ ఉన్నదా? అన్న శంక అసహజం కాదు, ఈ నాడీభేదం తెలియకపోయినా స్త్రీ పురుషులు సంగమవేళ ఈనాడుల యందేదో ఒకదానికి మాత్రమే ప్రేరణ కలుగుట, గర్భధారణ జరుగుట, పుత్రుడో పుత్రికయో జన్మించుట జరుగుతూ ఉంటుంది. ఉభయనాడులకు ఒకే సమయంలో ప్రేరణ అనేది ఎప్పుడో, ఎక్కడనో కాని జరుగని కృత్యం. అట్టివ

జరిగినను ఆ సమయంలో స్త్రీయందు గర్భోత్పత్తికి అనుకూలమైన స్థితి ఏర్పడకపోవచ్చును. ఇట్టిది అరుదుగా ఏర్పడి లోకమునందు సహజంగానే నపుంసకుల జననం అగుదుకావడానికి కారణమైఉంటుంది.

పైనచెప్పిన నాడీభేదమును గుర్తించి వర్తించే పురుషునకు పుత్రీ పుత్ర ప్రాప్తి లేకాక స్త్రీకూడ వశవర్తిని అవుతుంది. ఆమె ఎంతగా వశవర్తిని అవుతుందంటే ఆమె ఎన్నడును పరపురుషుని వాంఛింపదు. ఈ నాడీభేదము నెరిగి తన్ను తృప్తిపరచిన భర్త కాలాంతరంలో శరీరములోని సత్తువ నశించి నపుంసక స్థితివంటి స్థితిని పొందినప్పటికి ఆమె హృదయము మాతనియందు మాత్రమే లగ్నమై అన్యపురుషుల యందు విరక్తమై ఉంటుంది. అందుచే ఈ నాడీ పరిజ్ఞానము సర్వులకు అవసరమై ఉన్నది.

జరిగినను ఆ సమయంలో స్త్రీయందు గర్భోత్పత్తికి అనుకూలమైన స్థితి ఏర్పడకపోవచ్చును. ఇట్టిది అరుదుగా ఏర్పడి లోకమునందు సహజంగానే నపుంసకుల జననం అగుదు కావడానికి కారణమైఉంటుంది.

పైన చెప్పిన నాడీభేదమును గుర్తించి వర్తించే పురుషునకు పుత్రీ పుత్ర ప్రాప్తి లేకాక స్త్రీకూడ వశవర్తిని అవుతుంది. ఆమె ఎంతగా వశవర్తిని అవుతుందంటే ఆమె ఎన్నడును పరపురుషుని వాంఛింపదు. ఈ నాడీభేదము నెరిగి తన్ను తృప్తిపరచిన భర్త కాలాంతరంలో శరీరములోని సత్తువ నశించి నపుంసక స్థితివంటి స్థితిని పొందినప్పటికీ ఆమె హృదయ మాతనియందు మాత్రమే లగ్నమై అన్యపురుషుల యందు విరక్తమై ఉంటుంది. అందుచే ఈ నాడీ పరిజ్ఞానము సర్వులకు అవసరమై ఉన్నది.

గలడనుటలో సందేహంలేదు. అయితే స్త్రీ పురుషులు తమ శరీరములను ఏయే స్థితులయందుంచి రమించుటద్వారా ఎక్కువ ఆనందాన్ని పొందడానికి వీలుఉన్నదో అన్న విషయం ఈ ప్రకరణంలో చెప్పబడుతూ ఉన్నది.

సంభోగ సమయములో స్త్రీ పురుషుల శరీరములు (యోని పురుషాంగముతో సహా) పరస్పర సక్తములై ఉండే స్థితి భేదములనే 'సంభోగాసనములు, బంధములు. కరణములు' మొదలగు పేర్లతో వ్యవహరిస్తూ ఉంటారు. భిన్నజాతి స్త్రీపురుషులు కలిసినపుడు బాధారహితంగా సుఖించుటకు, సమానజాతి స్త్రీపురుషుల రతియందు నవ్యతను కల్పించుట శాస్త్రములయం దీ కరణభేదములు (బంధభేదములు చెప్పబడ్డాయి. రతివేళ స్త్రీయొక్క శరీరస్థితి ననుసరించి ఈ ఆసన భేదములు ప్రధానంగా ఐదు రకాలుగాఉన్నాయి. 1. ఉత్తానకరణము 2. తిర్యక్కరణము 3. ఆసీనకరణము (స్థితకరణము) 4. ఉత్థితకరణము 5. వ్యానత కరణము అని వానిపేర్లు.

**1. ఉత్తానకరణము:-** ఉత్తానమనగా వెలికిల పడియున్నది. భార్య వెలికిలిగ పరుండియున్నపుడు (నడుమును సెజ్జపై ఆన్చి పరుండుట) పురుషుడామెను గూడినచో అది 'ఉత్తానకరణము' అనబడుతుంది.

**2. తిర్యక్కరణము:-** తిర్యక్ అనగా 'ఏటవాలు' అని అర్థము. శయ్యపై భార్య ప్రక్కవాటుగా కుడిప్రక్కకున్నైనను లేక ఎడమప్రక్కకున్నైనను వ్రాలి పరుండియుండగా పురుషుడామెనుకూడి రమించినచో అది 'తిర్యక్కరణము' అనబడుతుంది.

**3. ఆసీనకరణము:-** భార్య కూర్చుండియున్నపుడు పురుషుడామెతో గలిసి రతిక్రీడాసక్తుడైనచో ఆస్థితి ఆసీనకరణము అనబడుతుంది.

**4. ఉత్థితకరణము:-** భార్య నిలచిఉండగా, పురుషుడామె నే గోడకో స్తంభమునకో ఆన్చి రమించుట 'ఉత్థితకరణము' అనబడుతుంది.

**5 వ్యానతకరణము:-** 'వ్యానతము' అనగా మిక్కిలి వంగినది. భార్య తన చేతులను పాదములను క్రింద ఆన్చి యుంచినదై నాలుగుకాళ్ళ జంతువువలె వంగియుండగా పురుషుడామెను వెనుకనుండి కూడి రమించుట 'వ్యానత కరణము' అనబడుతుంది.

ఇట్లేర్పడిన ఈ కరణ భేదములందు తిరుగ అవాంతరభేదము లెన్నియో ఉన్నాయి. ఆ భేదములకే చౌశీతి బంధములు (84 బంధములు) అని లోకములో వాడుక వచ్చినది. కాని అవి అన్నియును శిష్టజన సమ్మతములు కానందున నాగరిక జనతలో ఆచరణలో ఉన్న బంధభేదములు మాత్రమే (35) ఇందు తెలుపబడుతున్నాయి.

## -: ఉత్తానకరణ భేదములు -

భార్య శయ్యపై వెల్లకిలా శయనించియుండగా పురుషుడామెను గూడి రమించు విధానము ఉత్తానకరణము. దీనియందు శిష్ట సమ్మతమైన భేదములు ఇరువది. వానిలో మొదటిది స్వస్తిక బంధము.

**1. స్వస్తిక బంధము:-** భార్య శయ్యపై వెల్లకిలగా (నడుమును శయ్యపై ఆన్చినదై) శయనించినదై తన కుడితొడను తన ఎడమతొడమీద చేర్చియుండగా భర్త ఆమెనుకూడి రమించుటను స్వస్తికబంధ మనిపేరు. ఇట్లు ఎడమతొడపై తన కుడితొడను చేర్చియున్నవేళ స్త్రీయొక్క యోనియందు కొంతబిగువు ఏర్పడి, ఆస్థితిలో చేయబడిన రతిక్రీడ ఆమెకు భర్తకుకూడ ఒక వింత ఆనందాన్ని కలిగిస్తుంది.

**2. మాండూకబంధము:-** భార్య శయ్యపై వెలకిలగా శయనించినదై తన్ను కలియవచ్చిన భర్తయొక్క తొడలమీద

తనతొడలను చేర్చగా భర్త ఆమెనుగూడి రమించుట 'మాండూక బంధము' అనబడుతుంది. ఈ బంధమున స్త్రీ శయనించియుండగా పురుషుడు కూర్చుండియుండును. 'మండూకము' అనగా కప్ప. కప్ప యొక్క రతిక్రీడవంటి దగుటచే దీనికీపేరు వచ్చినది.

4 **జానుపాదబంధము:-** చెక్కిలి (బుగ్గ) యొక్కమీది భాగమునకే హనువనిపేరు. భార్యశయ్యపై వెలికిలగా శయనించి యుండి తనకాళ్లను పైకెత్తి - తన్నుకలియవచ్చి తనయోనియందు సంసక్తమైన పురుషాంగముకలవాడై, శయ్యపై తనకెదురుగా కూర్చుండియున్న భర్తయొక్క భుజములమీదుగా - పైకెత్తిన తనకాళ్ళను పోనిచ్చి - తనపాదములతో అతని చెక్కిళ్ల మీది భాగములను తాకుచుండగా రమించు స్థితికి "హనుపాదబంధము" అనిపేరు. భర్తయొక్క చెక్కిళ్ళ మీదభాగమునందు భార్యయొక్క పాదములస్పర్శ ఏర్పడుటవలన ఈబంధమునబడెను.

**5. పద్మాసనబంధము:-** భార్యశయ్యపై వెలికిలిగా శయనించినదై తనకాళ్ళను మోకాళ్ళ దగ్గరమడచి, ఎడమకాలి పిక్కపై కుడికాలి పిక్కకుచేర్చి (బాసికపట్టువేసి కూర్చున్నట్లు) ఉండగా - భర్త ఆమెయొక్క ఈ ఆసనస్థితిని విడదీయకయే ఆమె కాళ్ళనుపైకెత్తి ఆమెయొక్క రెండుమోకాళ్ళయొక్క సందులలోనుండి తనచేతులను పోనిచ్చి - ఆమెకంఠమును గ్రహించినవాడై రమించుట 'పద్మాసనము' అనబడుతుంది. బాసికపట్టు వేసి పరుండియున్న భార్యయొక్క రెండుమోకాళ్ళ సందులలోనుండియు చేతులనుపోనిచ్చి కంఠమును గ్రహించుటవలన భార్యయొక్క పాదపీఠము (తొడల లోసహా) సహజముగనే పైకిలేచి పురుషాంగము యోనియందు ప్రవేశించుటకు వీలుకలుగును. ఆసమయమున భార్య తనమీదకు వ్రాలియున్న భర్తను మడువబడియున్న తనకాళ్ళయొక్క మధ్య

భాగముతో ఇంచుక వెనుకకు నెట్టుచుండగా - చేతులతో గ్రహించిన భార్యాకంఠమాధారముగా భర్త ఆమెమీదకు తూగుచుండును.

**6. అర్థపద్మాసనము :-** వనిత శయ్యపై వెలికిలిగా శయనించియుండి - తనయొక్క ఒక్కకాలినిమాత్రము మోకాలి దగ్గర మడచి పైకెత్తి యుంచగా - పురుషుడామెనుగూడి క్రీడించు స్థితికి 'అర్థపద్మాసనము' అని పేరు ఇందు పురుషునియొక్క ఒక్క చేయిమాత్రము - స్త్రీయొక్క మడచియుంచిన మోకాలియొక్క సందునుండి ముందుభాగమునకు చొచ్చుకొనివచ్చును. తనమీదకు వ్రాలియున్న భర్తను భార్య తనయొక్క మడచివుంచిన ఒకకాలి తొడనే వెనుకకు నెట్టుచుండుట ఇందేర్పడును. పద్మాసనస్థితి పూర్తిగా కాక సగముగాఏర్పడుటచే దీనికి అర్థపద్మాసనము అని పేరువచ్చెను.

**7. పిండితబంధము :-** వనిత శయ్యపై వెలికిలిగా శయనించియున్నదై తనకాళ్ళను పైకెత్తి - తన్ను కలియవచ్చిన భర్తయొక్క వక్షముపై తనపాదములను రెంటిని ఆన్చియుండగా భర్త ఆమెనుకూడి రమించుటకు పిండితబంధమని పేరు.

**8. అర్థపిండితబంధము -** ప్రియురాలు తన రెండుపాదములను గాక ఒకపాదమును మాత్రమే ప్రియునివక్షమునందు ఆన్చియుంచగా (అనగా ఒకకాలు పూర్తిగాచాచియుంచబడును) ప్రియుడామెను గలసి రమియించుట 'అర్థపిండితమనబడును.

**9. జృంభితబంధము :-** శయ్యపై వెలికిలిగాశయనించియున్న యువతి తన తొడలను పైకెత్తి, తన్ను కలియవచ్చి తనకు అభిముఖుడై కూర్చుండియున్న భర్తయొక్క భుజములమీద చేర్చగా ఏర్పడు కూటమికి 'జృంభితబంధము' అని పేరు. రతిరహస్యమునందీ బంధము భిన్నముగా చెప్పబడెను.

భార్య తన తొడలనుపైకెత్తి. చేతుల సహాయమునుగూడ అవలంబించి రెండుతొడలను బాగుగావిడఁదీసి—రెండుకాళ్ళను రెండు వైపులకుచాచి యుంచగా—ఆవులించిన నోటివలె విడియున్న భార్య యొక్క యోనియందు—భర్త తనపురుషాంగమును సంవిశితముగావించి రమించుట జృంభితబంధమనియు, జృంభ అనగా ఆవులింత, ఇందు యోని ఆవులించిన నోటివలె నుండుటచే దీనికీపేరు తగియున్నదనియు రతిరహస్యకర్త రతిరహస్యకర్త చెప్పెను. చూ. రతిరహస్యం.

**10. వేణువిదారణ బంధము :** జృంభితబంధమునందువలె భార్య తన రెండుతొడలను పైకెత్తి భర్తయొక్క భుజములపై నుంచుటకు మారుగా — తన ఒకకాలిని శయ్యపై పూర్తిగా చాచి ఉంచినదై — ఒక కాలినిమాత్రము పైకెత్తి తొడను భర్తయొక్క భుజమునందాన్చియుంచి కూడుటకు వేణువిదారణబంధమని పేరు. వేణు వనగా వెదురు. విదారణమనగా చీల్చుట. వెదురును చీల్చువేళ ఒక పాయను నేలపై త్రొక్కిపట్టి, ఒకపాయను చేతఁబట్టి పైకెత్తిచీల్చుట లోకసాధారణము. సరిగా దానినిపోలిన ఆకృతి స్త్రీయొక్క కాళ్ళకు ఈబంధమునం దేర్పడును. అందుచే దీనికి 'వేణువిదారణ'మను పేరు వచ్చెను.

**11. ఇంద్రాణీబంధము :** వనిత శయ్యపై వెలకిల గా శయనించినదై తన కాళ్ళను మోకాళ్ళయొద్ద మడచి — ఆ మడత చెడకుండ తొడలయొద్దకూడ మడచి — మోకాళ్ళు తనయొక్క స్తనపార్శ్వభాగ ములను తాకుచున్నస్థితియందుండగా — పురుషుడామెయొక్క మోకా ళ్ళకు తనమోకాళ్ళు తాకుచున్నస్థితిలో ఆమెను పైకొని రమించుట 'ఇంద్రాణీబంధము' అనబడును.

**12. సూచీబంధము :** ఇంద్రాణీబంధమునందువలె వనిత తన రెండుకాళ్ళను కాక, ఒకకాలినిమాత్రమే — మోకాలు స్తన

పార్శ్వ దేశమును తాకునట్లుమడచి - వేరొక కాలిని సరళముగా చాచి యుంచగా - పురుషు డామె కంఠమును కౌగలించుకొని రమించుట 'సూచీబంధము' అనబడును.

**13. నాగరకబంధము** : పురుషుడు శయ్యపై వెలికిలగా శయనించియున్న భార్యయొక్క రెండుతొడలమధ్యకును చేరి, ఆమె తొడలను తన పాదములమీదుగా చేర్చి రమించుటకు నాగరకబంధమని పేరు. ఇందు స్త్రీయొక్క తొడలు పురుషుని కటిభాగమునకు (నడుమునకు) బహిర్వ్యాతములగును. ఈ బంధమునందు స్త్రీ సుకుమారముగా చూడబడుటచే దీనికి నాగరకబంధమని పేరువచ్చెను. రతిరహస్యమునందీ బంధము కొంత భిన్నముగా చెప్పబడెను. చూ. రతిరహస్యం.

**14. గ్రామ్యబంధము** : నాగరకబంధమున వనితయొక్క తొడలు పురుషుని పాదములయందుండునేకాని, పురుషుని మోకాళ్లు వంచబడి ఆమె శరీరమునందానుట జరుగదు. అట్లుకాక పురుషుడు తనపాదములపై భార్యయొక్క తొడలను జేర్చి రమించుచు, తన మోకాళ్ళను ఆమె తొడలమీదుగా వాల్చి ఆమె కటిభాగమును (నడుమును) తనమోకాళ్ళతో పీడించుచు రమించుట గ్రామ్యబంధమనబడును. దీనియందు స్త్రీయెడ పురుషునివర్తనము నాజూకైనది గాక కొంత మోటదనముతోకూడినదై యున్నందున దీనికి గ్రామ్య బంధమనుపేరు వచ్చెను.

**15. కార్కటబంధము** : వనిత శయ్యపై వెలికిలగా శయనించి తన పాదములను భర్తయొక్క నాభిదేశమునందు (బొడ్డు) ఉంచగా ఏర్పడు రమణమునకు కార్కటబంధమనిపేరు. ఇందు భార్యయొక్క పాదములు భర్తయొక్క నాభీదేశమును తాకుచుండగా - అర్త ఆమెను కూడవలెను గనుక ఆమె తనకాళ్ళను మడచి ఇంచుక

పైకెత్తవలసియుండునని గ్రహింపవలెను. కర్కటమనగా పీత. పీతల కలయిక ఇట్టిదగుటచే దీనికి కార్కటబంధమను పేరువచ్చెను.

**16. ప్రేంఖణబంధము :** "ప్రేంఖణము" అనగా విసరుట. కార్కటబంధమునందువలెనే భార్యాభర్తలుకూడి రమించుచుండగా- భార్య భర్తయొక్క నాభిదేశమునందుంచిన తనపాదములతో నాతనిని పైకెత్తి విసరుచు కూడినచో ఆ స్థితి 'ప్రేంఖణబంధము' అనబడును.

**17. మార్కటకబంధము** భార్య శయ్యపై వెలికిలగా శయనించియుండగా – పురుషుడును చాచబడిన కాళ్ళుకలవాడై ఆమె శరీరమును తనశరీరముతో నాక్రమించుకొని – తన ఎడమచేతి నామె నడుముక్రిందనుండి పోనిచ్చి – ఆమెను గాఢముగా కౌగలించుకొని – కుడిచేతితో ఆమెయొక్క స్తనమునుగ్రహించి కూడగా – భార్య తన చాచబడిన కాళ్ళను భర్తయొక్క కాళ్ళక్రిందనుండి తొలగించి–ఆతని పిక్కలపై తన పాదములను జేర్చి మెలివేసినట్లు పట్టి యుంచినచో ఆ స్థితి మార్కటకబంధము అనబడుతుంది.

**18. ఉద్భుగ్నబంధము :** ఉన్నతముగానుండి కొంచెము వంగియుండుటను ఉద్భుగ్నము అంటారు. శయ్యపై వెలికిలగా శయనించియున్న భార్యయొక్క తొడలను భర్త తనచేతులతో పైకెత్తి-క్రిందకు వంచియుంచి – చేతులతో నొక్కుచు రమించుట ఉద్భుగ్న బంధమని పేరు. ఇందు భార్యయొక్క తొడలు పైకెత్తబడి వంచ బడును గనుక దీనికీపేరు వచ్చెను.

**19. అయతబంధము** భార్యశయ్యపై వెలికిలగా శయనించినదై – భర్తయొక్క శిరస్సుమీద తనకాలి నొకదానిని (కాలి పిక్క శిరమునకు తగునట్లు) చాచి, వేరొకదానిని శయ్యమీద నేచాచి యుంచగా ఏర్పడు కూటమికి ఆయతబంధ మనిపేరు. రతిరహస్య కారుడు ఈ బంధమును 'శూలచితబంధము' అనుపేరుతో పేర్కొనెను.

**20. నాగపాశబంధము :** యువతి శయ్యపై వెలికిలగా శయనించినదై తనకాళ్ళను మోకాళ్ళదగ్గర మడచి, తిరుగ వానిని తొడలయొద్ద మడచి – తన మోకాళ్ళు తన స్తనములయొక్క పార్శ్వ భాగములను తాకుచున్నస్థితిలో తన రెండు చేతులను తన రెండు మోకాళ్ళ సందులలోనుండియు రానిచ్చి – ఆ చేతులను రెంటిని తన యొక్క కంఠముయొక్క దిగువభాగమున ఉగ్గిలిపట్టుగా బంధించి యుంచినపుడు పురుషుడామెను కూడుట నాగపాశబంధ మనబడును. రతిరహస్యమునందీ బంధము భిన్నముగా చెప్పబడెను. చూ. రతిరహస్యం

---

## తిర్యక్కరణ భేదములు

భార్య శయ్యపై ప్రక్కవాటుగా శయనించియుండగా పురుషు డామెను కూడి రమించుట తిర్యక్కరణమనబడునని వెనుక చెప్పబడి నది. ఈస్థితియందేర్పడే ఉత్తమబంధ భేదములు ఏడు. అందు మొద టిది సంపుటబంధము.

**1. సంపుటబంధము :** భార్య శయ్యపై ప్రక్కవాటుగా శయనించియుండగా భర్త ఆమె కభిముఖముగా ఆమెవలెనే ప్రక్క వాటుగా శయనించినవాడై ఆమెనుకూడి రమించుటకు 'సంపుటక బంధము' అని పేరు. ఇందు ఆలుమగల శరీరములు ప్రక్కవాటుగా నున్నను సరళముగా చాచబడి యుండును, దీనిని రతిరహస్యకర్త 'ఉత్తానకరణ భేదములందు' 'పార్శ్వసంపుటక బంధము' అను పేరుతో పేర్కొనెను. చూ. రతిరహస్యం.

**2. పీడితబంధము :** ఆలుమగలు సంపుటబంధమునందువలె నే ప్రక్కవాటుగా శయనించినవారై రమించుచుండగా – భార్య తన తొడలతో భర్తయొక్క తొడలనునొక్కి పీడించుట జరిగినచో – ఆ స్థితి 'పీడితబంధము' అనబడుతుంది.

**3. ముద్గకబంధము :** భార్య శయ్యపై ప్రక్కవాటుగా శయనించి - తన తొడలను దగ్గరగాచేర్చి - యోని ద్వారమును బిగించియుంచగా - పురుషుడామె కభిముఖుడై ప్రక్కవాటుగా శయనించి రమించు స్థితికి ముద్గకబంధమని పేరు. సంపుటకబంధమున యోని ముఖము బిగింపబడియుండదు. దీనియందు బిగింపబడియుండును - అని గ్రహింపవలెను.

**4. పరావృత్తకబంధము** : యువతి శయ్యపై భర్తకు అభిముఖముగా కాక పెడమొగమై ప్రక్కవాటుగా శయనించి తన తొడలను దగ్గరగాజేర్చి యోనిముఖమును బిగించియుంచగా భర్త ఆమెను వెనుకనుండియే కూడి రమించుటకు పరావృత్తకమని పేరు.

**5. వేష్టితకబంధము** భార్య శయ్యపై ప్రక్కవాటుగా శయనించియున్నదై - ఆస్థితియందు తనకభిముఖుడై శయనించి తన్ను గూడిన భర్తయొక్క పిక్కలతో తనపిక్కలను మెలివేయుట జరిగినచో అది 'వేష్టితకబంధము' అనబడుతుంది. 'వేష్టనము' అనగా చుట్టుట. పిక్కలను పిక్కలతో చుట్టుట యిందేర్పడును గాన దీనికి వేష్టితబంధమను పేరేర్పడెను.

**6. బాడబకబంధము** . ఆలుమగలు ప్రక్కవాటుగా శయనించినవారై రమించుచుండగా - స్త్రీ తన యోనిముఖముచే పురుషాంగమును బిగియ నొక్కినచో ఆస్థితి 'బాడబికము' అనబడుతుంది. బడబ అనగా ఆడగుఱ్ఱము(ఆడగుఱ్ఱము రతివేళ ఇట్లాచరిస్తుంది అందుచే దీనికీపేరువచ్చినది.

**7. యుగ్మపాదము :-** ఆలుమగలు శయ్యపై ప్రక్కవాటుగా శయనించి రమించుచుండగా - వనిత తనయొక్క తొడనొకదానిని భర్తయొక్క కటిభాగమునకు క్రిందుగాపోవనిచ్చి- వేరొకదానిని ఆతని కటిభాగమునకు పైనుండి పోవనిచ్చి తనపాదములను

రెండింటిని భర్తయొక్క వెన్నుపూస చివర కలిపియుంచినట్లై రమించుచో ఆస్థితి 'యుగ్మపాదము' అనబడుతుంది. యుగ్మము అనగా జంట. పాదములజంట ఇందేర్పడుచున్నది. అందుచే దీనికీ పేరువచ్చినది. రతిరహస్యమునందు బాడబక-వేష్టితబంధములు ఉత్తానకరణము నందు పేర్కొనబడ్డాయి. యుగ్మపాదము నాతడు దీనికి కొంత భిన్నమైన రీతిలో ఆసీనకరణములందు పేర్కొన్నాడు. చూ. రతిరహస్యం.

---

## -: ఆ శీ న క ర ణ భే ద ము లు :-

భార్య శయ్యపై కూర్చుండియుండగా ; భర్త ఆమెనుకూడి రమించుట ఆసీనకరణము. ఈ కరణమునందు భార్య నెపలి మున్నగువానివలె కూర్చుండగా పురుషుడామెను ముందునుండియే కాక వెనుకనుండి కలిసి రమించుటకూడ లోకమందున్నది. ఇక్కడ ఆశీన కరణభేదములందు 'లలితబంధము' అను ఒక్క బంధముమాత్రమే తెలుపబడుచున్నది.

1. **లలితము :-** యువతి శయ్యపై కూర్చుండీయున్నది. పురుషుడామెకెదురుగా తానును కూర్చుండియే ఆమెను కలియుటకు సంసిద్ధుడయ్యెను. అప్పుడాయువతి తనతొడలను విడదీసియుంచి భర్తకు తావిచ్చుటయేకాక భర్తయొక్క వెన్నుపూస తుదిభాగమున తనయొక్క అందెలతో మెరసే పాదములను జేర్చి, ఆతనిని తనకు మిక్కిలి సమీపముగా లాగుకొనెను. భర్తయు ఆమెకంఠమును గాఢముగా కౌగలించుకొని రతిక్రీడకు ఉపక్రమించెను. ఇదుగో ఇట్టి ఆసీనబంధము 'లలితము' అనబడుతుంది. ఆశీనకరణము లన్నిటియందును ఇది ఉత్తమమైనది.

## ఉత్థితకరణభేదములు :

భార్య ఏగోడనో స్తంభమునో ఆధారముగా చేసికొని నిలచి యుండగా పురుషుడామెనుగూడి రమించుట ఉత్థితకరణము. ఈ ఉత్థితకరణము, దీని తరువాతదైన వ్యానతకరణము చిత్రరతములు అనబడతాయి, వీని నాచరించుటకు దంపతులు శక్తి, చురుకుతనము శరీరలాఘవము కలవారయి ఉండాలి, అట్టి తగినంత శరీరలాఘవము లేనివారికీ కరణభేదములు సాధ్యములు కావు. ఈ కరణభేదముల యందు అరు మాత్రమిచ్చుట తెలుపబడుచున్నవి. వీనిలో మొదటిది 'హరివిక్రమబంధము.

**1. హరివిక్రమబంధము :-** భార్య తనవీపును ఏ గోడకో ఆన్చి పాదములను గోడకు కొంచెము దూరములోనుంచి - ఏటవాలుగానున్న శరీరముకలదై నిలచియుండగా - పురుషుడామెయొక్క ఒకకాలిని ఆమె మొగము మీదుగా పోవునట్లు పైకెత్తి ఉన్నతమైన పురుషాంగము కలవాడై రమించుట 'హరివిక్రమబంధము' అనబడును ఈ బంధమునందు భార్యయొక్క ఒకపాదము నేలను తాకుచుండ వేరొకపాదము ఆమెయొక్క ముఖమును తాకుచుండును. హరివామనావతార సమయమున ఒకపాదముతో భూమినాక్రమించి, వేరొకదానితో ఊర్ధ్వలోకముల నన్నిటిని, (ఆకాశమును) ఆక్రమించెను కదా ! అట్టిరూపము వనితకీబంధము నందేర్పడుతుంది, అందుచే దీనికి హరివిక్రమని పేరువచ్చినది.

**2. వ్యాయతబంధము :-** యువతి హరివిక్రమబంధమునందువలెనే నిలచినదై - ఉన్నతమైన పురుషాంగముతో తను గూడిన భర్తయొక్క వెన్నుపూస తుదిభాగమును తనయొక్క ఒకపాదముతో తాకుచుండగా ఏర్పడు కూటమి 'వ్యాయతబంధము' అనబడుతుంది. దీనియందు వనితయొక్క ఒకపాదముమాత్రము నేలమీదఉంటుంది. రెండవపాదము పైకెత్తబడి భర్తయొక్క నడుమును చుట్టి ఆతని పిరుదులను తాకుతూవుంటుంది.

**3. అర్పితబంధము :-** భార్యకు బదులు భర్తయే గోడనుఆనుకొని నిలచియుండగా - భార్య ఆతనికంఠమును కౌగలించుకొని - ఆతని అరచేతులలో తనపాదములనుంచి ఎక్కి నిలచినదై - తనమోకాళ్ళను భర్తయొక్క ఇరుపార్శ్వములనుండియు పోనిచ్చి కొంచెము వంచియుండగా పురుషుడామెను కలియుటకు - అర్పితబంధమని పేరు. ఇట్లు ఆచరించుటకు భార్యా శరీరభారము నరచేతులయందు మోయుగల శక్తికలవాడై యుండాలి. దీనినే రతి రహస్యకర్త 'ద్వితలబంధము' అనెను.

**4. దోలాబంధము :-** భార్యకు బదులుగా భర్తనే గోడనానుకొని నిలచి కుడిచేతివ్రేళ్ళ సందులనుండి ఎడమ చేతివ్రేళ్ళను పోవనిచ్చి ఉగ్గిలి పట్టుగా బిగియుపట్టి దోసిలిని ఏర్పరచవలెను. అప్పుడు భార్య తనపృష్ఠము నాదోసిలియందాల్చి కూర్చుండి - తనకాళ్ళను భర్తయొక్క నడుమునకుచుట్టక - భర్తయొక్క వక్షము మీదుగా పైకి పోవనిచ్చి - తాను చేతులతో ఆతని కంఠమును గ్రహించినదై యుండగా ఉన్నతమైన పురుషాంగముకల భర్త - ఉగ్గిలిపట్టుగానున్న తనచేతులతో భార్యా పృష్ఠమును పైకెత్తి క్రిందికి దించుచు రమించుట 'దోలాబంధము' అనబడుతుంది. ఈ బంధము నాచరించుటకు పురుషుడు తగినంత బలశాలియై యుండు టయేగాక స్త్రీయొక్క శరీరముకూడ తగినంత పలుచనదై లఘువుగా ఉండుట అవసరము. దోల అనగా ఊయెల ఊయల ఊగుటవంటి స్థితి ఇందుండుటచే దీనికీపేరువచ్చెను.

**5. విలంబితబంధము :-** దోలాబంధము నందువలెనే పురుషుడు గోడనానుకొని నిలచియుండ
గట్టిగా కౌగలించుకొన్నదై తనరెండుకాళ్ళను పైకెత్తి వానితో ఆతని నడుమునుచుట్టి - తనయోనితో ఆతని పురుషాంగమును సంసక్తం పరచుచుండగా ఏర్పడు రతిక్రీడను 'విలంబితబంధము' అని

పేరు. విలంబితము అనగా వ్రేలాడునది. ఇందు భార్య భర్తయొక్క కంఠమును గ్రహించి వ్రేలాడుచు రమించును. అందుచే దీనికీ పేరువచ్చెను.

**6. జానుకూర్పరబంధము :-** భార్యనగోడనో ఆనుకొని కొంచెము ఏటవాలుగా నిలచియుండగా - భర్త ఆమెను సమీపించి- చేతులతో ఆమెకంఠమును కౌగలించుకొని - తనకాళ్ళతో ఆమె మోకాళ్ళను పెనవైచి - ఉన్నతమైన పురుషాంగము కలవాడై రమించుచో ఆస్థితి 'జానుకూర్పము' అనబడుతుంది. జాను, కూర్పర. శబ్దములకు రెండిటికి మోకాలు అనియే అర్థము, ఇందు ఆలుమగల మోకాళ్ళు పెనవైచుకొని ఉంటాయి.అందుచే దీనికీపేరువచ్చినది.

## వ్యానతకరణభేదములు.

వనిత తనచేతులను తనపాదములపై ఆన్చి వంగినిలచియుండగా (ఈస్థితియందామె పై శరీరము మిక్కిలిగా వంగుతుంది. దిగువ శరీరము సటారుగా నిలచి ఉంటుంది.) పురుషుడామెను వెనుకనుండి సమీపించి చేతులతో ఆమె కడుపును పట్టుకొని వెనుకనుండియే అంగమును యోనియందు సంవిశితముగావించి రమించుటకు 'వ్యానతకరణము' అనిపేరు. పశువుల రతిక్రీడవంటిదగుటచే దీనిని 'పశుకరణము' అని కూడ పేర్కొంటారు,

ఇట్టిదైన రతిక్రీడ మరుదేశమునందును (నేటిరాజస్థానము సింధుదేశమునందును (నేటి పంజాబుదేశము. పశ్చిమపాకీస్థానము) కురుదేశమునందును (నేటికురుక్షేత్రమునకు సమీపదేశము మిక్కిలిగా ఆచరణలో ఉన్నది. ఇవికాక మిలిన ప్రాంతములయందిట్టి రతిక్రీడ అరుదుగా కానవస్తుంది. ఈకరణభేదములు ధేనుకబంధము (ఆవువలె కలయుట) ఐభబంధము (ఏనుగులవలె రమించుట) మొదలగు పేర్లతో ప్రసిద్ధములై ఉన్నాయి. కాని ఇందు 'వ్యాఘ్రస్కందము' అనే బంధ భేదము ఒక్కటి మాత్రమే తెలుపబడినది.

**1. వ్యాఘ్రస్కంధబంధము :-** ఈ బంధము వ్యానతేకరణములలో చేరినదైనను ఆలుమగలు శయ్యను విడువనక్కరలేదు. వనిత శయ్యపై వెలికిలగా శయనించి యున్నదై తన పార్ష్ణి భాగములను (తొడలయొక్క ప్రక్కభాగములు, చట్టలు) చేతులతో గ్రహించి తన జఘనభాగమును (మొలయొక్క ముందుభాగమును, యోని ద్వారదేశమును) బాగుగా వెల్లడియగునట్లుచేయగా-పురుషుడామెను తొడలను ఆమె ముఖముమీదుగా బాగుగావంచి రమించుటను వ్యాఘ్రస్కంద మనిపేరు. దీనియందు స్త్రీకి క్లేశము ఎక్కువ. అయినను అభ్యాసముచే సుసాధ్యం అవుతుంది. పులుల రమణ మిట్లుండుటచే దీనికీపేరు వచ్చినది.

ఇట్టివైన ఈ ఐదు కరణములయందు మొదటిదైన ఉత్తాన కరణమునందే స్త్రీకి ఆనందము ఎక్కువ. ఎందువల్లననగా ఉత్తాన కరణమునందు పురుషాంగముచే యోనియు పురుషుని చేతులచే స్తనాములుకూడ ఒకేసమయమున మర్దింపబడతాయి. అంతేకాక దీనియందు స్త్రీకి క్లేశముకూడ తక్కువ. నీచరతులయందు సర్వదా ఉత్తానకరణమే ఆచరింపదగినది.

ఇక రెండవదైన తిర్యక్కరణమునందు భార్య ప్రక్కవాటుగా శయనించి ఉంటుంది. అందుచే ఆమెయొక్క పిరుదుల బరువుచే యోని ముఖమునందొక బిగువేర్పడి, ఆస్థితియందు భర్త కలియగా ఆతని పురుషాంగము యోని పార్శ్వములను మిక్కిలిగా ఒరసుకొనుటచే ఏదో తెలియని వింత ఆనందము కలుగుతుంది. స్త్రీ యోని కంటె పురుషాంగము పెద్దదైన ఉచ్చరతుల యందిది మిక్కిలి సుఖాన్ని అందిస్తుంది.

మూడవదైన ఆసీనకరణమునందు ఆలుమగలు కూర్చుండి రమించుట జరుగును గనుక - ఒకరినొకరు కౌగలించుకొనుటను

చుంబన – దంతక్షత – నఖక్షతాదుల నాచరించుటకు సౌకర్యం ఎక్కువగాఉండి రతిక్రీడ ఆనందప్రదం అవుతుంది.

ఇక ఉత్ఘాతకరణములు క్లేశకరములగుటయే కాక తగినంత నేర్పులేక ఆచరించుటవలన రోగకారకములుకూడ అయిఉన్నాయి. అందుచే వానిని లోకము ఎక్కువగా ఆచరింపదు.

ఐదవదైన వ్యానతకరణము లేక పశుకరణము స్త్రీ తన యొక్క కటిభాగమును మిక్కిలిగా సంచలింపజేయుటకు, యోని ముఖమును మిక్కిలిగా వెల్లడించుటకు వీలు కలదగుటచే స్త్రీ యోనికంటె పురుషాంగము చిన్నదైన నీచరతులయందు ఆనంద ప్రదం అవుతుంది.

రతిక్రీడయందు పురుషుడు అలసినపుడు స్త్రీ పురుషునిమీద ఆరోహించి స్వయముగా పురుషునివలె ప్రవర్తిస్తుంది. దీనిని 'పురుషాయితము' అంటారు.

ఈ చెప్పబడినవానికంటె భిన్నములైన రతిభేదములు ఎన్నియో ఉన్నాయి. అవి ఉత్తమములు కాకుండుటచే నాగరకజనం వాని యందాసక్తి చూపరు. అందుచే అవి యిందు పరిహరింపబడ్డాయి. కాని ఏకరణభేదమును అవలంబించినా పురుషుడు క్రమం తప్పకూడదు.

శ్లో॥ దర్శనేన రతిం కృత్వా స్త్రియః స్పర్శన మాచరేత్ ।
స్పర్శేన ద్రావ ముత్పాద్య శనైః స్సంభోగ మాచరేత్ ॥

అనగా పురుషుడు స్త్రీవంకకు చూచే చూపులోనే ఆమెకు తనయందు ప్రీతి కలిగించాలి. అలా ప్రీతి కలిగించిన మీదటనే ఆమెను స్పృశించాలి. తనయొక్క స్పర్శచేతనే ఆమె యోనియందు ద్రవించేలా స్పృశించాలి. అనంతరం నెమ్మదిగా సంభోగానికి ఉపక్రమించాలి. ఇది క్రమం. ఈక్రమం తప్పకూడదు, మరియొక క్రమంకూడ చెప్పబడ్డది.

శ్లో॥ ఆశ్లేషం ప్రథమం కుర్యాత్ ద్వితీయం చుంబనం తథా ।
తృతీయం నఖఘాతశ్చ దంతఘాత శ్చతుర్థకమ్ ।
క్షేపణాం పంచమం ప్రోక్తం షష్ఠం ప్రహరణాం తథా
సప్తమం కంఠ శబ్దశ్చ నధ్యాఖ్యాం చాష్టమం రతమ్ ॥

అనగా మొదట ఆలింగనము, తరువాత చుంబనము. చుంబనమునకు పిమ్మట నఖక్షతము, దాని తరువాత దంతక్షతము. ఈ నాలుగు ఆచరింపబడినమీదట ఐదవక్రియ పురుషాంగము యోని యందు సంవిశితము చేయుటయై ఉన్నది. ఆరవది ప్రహారణము. ప్రహారణము అనగా కొట్టుట. ఆలుమగలు రతిక్రీడ నాచరించేవేళ హేలగా పురుషుడు భార్యను కొట్టుటకూడ (అనగా గట్టిగాకాదు) జరుగుతుంది. దానికే ప్రహరణ మనిపేరు. సంభోగము ఆరంభము కాకపూర్వమే పురుషుడు భార్యను ప్రహరించుట కూడదు. అట్లా తడు ప్రహరించినమీదట భార్య తనకు నొప్పి తోచినను తోచకున్నను 'అబ్బ! అమ్మా! ఇస్' ఇత్యాది ధ్వనులను ఆచరిస్తుంది. వీనికి కంఠశబ్దములనియు విరుతములనియు పేరు. ఈ కంఠశబ్దములు ఏడవక్రియగా ఆచరింకిబడాలి. ఆలుమగలు ఈ క్రమాన్ని గుర్తించి రతిక్రీడాపరులై ఆనందించాలి.

ఇక్కడ వేరొక విషయముకూడ తెలిసికొనవలసి ఉన్నది, పురుషుని రతిక్రీడాదక్షతకు అతని వీర్యము కారణము. మానవుడు స్వీకరించు ఆహారము మొదట రసముగా మారుతుంది. ఆ రసమే నెత్తురుగా మారుతుంది. నెత్తుటినుండి మాంసము, మాంసమునుండి మేధస్సు, మేధస్సునుండి మజ్జ, మజ్జనుండి ఎముక, ఎముక ద్రవించి వీర్యము జనిస్తాయి. రస – రుధిరమాంస మేధస్ – మజ్జా– అస్థి – వీర్యములనే ఈఏడింటికీ ఏడు ధాతువులని పేరు. ఈ ఏడు ధాతువులయందు ఉత్తమమైనది వీర్యము. ఈ వీర్యము పురుషుని అండములయందు జనిస్తుంది. సంభోగ సమయమునందీ వీర్యము పురు

షుని పురుషాంగమునుండి బయటకు వస్తుంది. అట్లు వీర్యము నిస్సృతమైనపిమ్మట పురుషాంగమునందు శిథిలత ఏర్పడుతుంది.

పురుషుడు రతిక్రీడకు అభిముఖుడైనపుడాతని పురుషాంగము ఉత్థితం అవుతుంది. దానివలన ఆతని రతిక్రీడాభిముఖత, ఆతని లోని ఆవేశము వ్యక్తం అవుతాయి. కాని ఈవిధంగా స్త్రీయొక్క రతిక్రీడాభిముఖతను సూచించే లక్షణము లేవీ బయటకు కనబడవు అయినను యోనియందు పురుషాంగము ప్రవేశించినంతనే వారి యందు కూడ రతిక్రీడాభిలాష జనిస్తుంది.

ఇక సంభోగసమయమున పురుషుని ఆనందమునకు స్థానము ఆతని పురుషాంగముయొక్క అగ్రభాగమే అయిఉండగా వనితకు గర్భాశయముఖము ఆనందస్థానమై ఉన్నది. ఆ గర్భాశయ ముఖము చించాప్రసూనము (చింతపూవు) వలె ఉంటుంది. పురుషాంగముయొక్క అగ్రభాగము ఆ గర్భాశయ ముఖమును తాకి నంతనే వారికి కలుగు ఆనంద పారవశ్యము ఇంత అని చెప్ప డానికి వీలులేనిదై ఉంటుందని 'రతికల్లోలిని' అనే ప్రాచీన కామ శాస్త్రకర్త అభిప్రాయమై ఉన్నది.

సంభోగారంభదశయందు భార్యలో రతికి తగిన ఆవేశమును కలిగించుటకు మదనచ్ఛత్రమును చేతితో కలచవలెనని వెనుక చెప్పబడినది. అట్లు కేవలము వ్రేలితో మదనచ్ఛత్రమును కలచు టయేకాక పురుషుడు తనచేతివ్రేళ్ళను భార్యయొక్క యోని యందు ప్రవేశపెట్టుటకూడ జరుగుతుంది. దానికి అంగుళీ ప్రవేశ మని పేరు. అది యీదిగువ వివరింపబడుతోంది.

షుని పురుషాంగమునుండి బయటకు వస్తుంది. అట్లు వీర్యము నిస్సృతమైనపిమ్మట పురుషాంగమునందు శిథిలత ఏర్పడుతుంది.

పురుషుడు రతిక్రీడకు అభిముఖుడైనపుడాతని పురుషాంగము ఉత్థితం అవుతుంది. దానివలన ఆతని రతిక్రీడాభిముఖత, ఆతని లోని ఆవేశము వ్యక్తం అవుతాయి. కాని ఈవిధంగా స్త్రీయొక్క రతిక్రీడాభిముఖతను సూచించే లక్షణము లేవీ బయటకు కనబడవు అయినను యోనియందు పురుషాంగము ప్రవేశించినంతనే వారి యందు కూడ రతిక్రీడాభిలాష జనిస్తుంది.

ఇక సంభోగసమయమున పురుషుని ఆనందమునకు స్థానము ఆతని పురుషాంగముయొక్క అగ్రభాగమే అయిఉండగా వనితకు గర్భాశయముఖము ఆనందస్థానమై ఉన్నది. ఆ గర్భాశయ ముఖము చించాప్రసూనము (చింతపూవు) వలె ఉంటుంది. పురుషాంగముయొక్క అగ్రభాగము ఆ గర్భాశయ ముఖమును తాకి నంతనే వారికి కలుగు ఆనంద పారవశ్యము ఇంత అని చెప్ప డానికి వీలులేనిదై ఉంటుందని 'రతికల్లోలిని' అనే ప్రాచీన కామ శాస్త్రకర్త అభిప్రాయమై ఉన్నది.

సంభోగారంభదశయందు భార్యలో రతికి తగిన ఆవేశమును కలిగించుటకు మదనచ్ఛత్రమును చేతితో కలచవలెనని వెనుక చెప్పబడినది. అట్లు కేవలము వ్రేలితో మదనచ్ఛత్రమును కలచు టయేకాక పురుషుడు తనచేతివ్రేళ్ళను భార్యయొక్క యోని యందు ప్రవేశపెట్టుటకూడ జరుగుతుంది. దానికి అంగుళీ ప్రవేశ మని పేరు. అది యీదిగువ వివరింపబడుతోంది.

యందు తనచేతి వ్రేళ్ళను ప్రవేశపెట్టుటకూడ శాస్త్ర సమ్మతమై యున్నది. దీనికే అంగుళీ ప్రవేశమనిపేరు. ఈ అంగుళీ ప్రవేశ విధానములు మొత్తం ఆరు. అందు మొదటిది కరణము.

**1. కరణము:-** భర్త భార్యయొక్క యోనియందు తన చూపుడు వ్రేలిని ప్రవేశపెట్టినచో దానికి 'కరణము' అనిపేరు.

**2. కనకము:-** భర్త తన చూపుడువ్రేలిని తన నడిమి వ్రేలిమీద కెక్కించి భార్య యోనియందు ప్రవేశపెట్టినచో అది 'కనకము' అనబడుతుంది.

**3. వికనము:-** కనకమునందువలెనే భార్యయొక్క యోని యందు ప్రవేశపెట్టిన వ్రేళ్ళను (చూపుడువ్రేలు, నడిమివ్రేలు) యోనియందేయుంచి మార్చుట- (అనగా నడిమి వ్రేలిమీదనున్న చూపుడువ్రేలిని దిగువచేసి నడిమివ్రేలిని చూపుడు వ్రేలిమీదను ఎక్కించుట)మాటిమాటికి జరిగినచో అది 'వికనము' అనబడుతుంది.

**4. పతాక:-** భార్య యోనియందు ప్రవేశపెట్టబడిన రెండు వ్రేళ్ళను ఒకదానికొకటి ఎడముగా విస్తరింపజేయుట 'పతాక అనబడు తుంది.

**5. త్రిశూలము:-** చూపుడువ్రేలు, నడిమివ్రేలు మాత్రమే కాక ఉంగరపువ్రేలినికూడ భార్యయోనియందు ప్రవేశపెట్టి వానిని యోనియందే ఒకదానికొకటి ఎడము కావించినచో ఆస్థితి త్రిశూలము అనబడుతుంది.

**6 నిభోగము :-** పైన చెప్పినవిధముగా భార్యయోని యందు ప్రవేశపెట్టిన మూడువ్రేళ్ళను ఎడముగాకాక దగ్గరగాచేర్చినచో ఆస్థితి 'శనిభోగము' అనబడుతుంది.

ఈ అంగుళీ ప్రవేశ విధానముల నారింటినికూడ పురుషుడు క్రమముగనే ఉపయోగించాలి. ఇట్లు అంగుళీ ప్రవేశముచేయుటవలన

వనిత ఎట్టిదైనను రతికి అభిముఖి అవుతుంది. ఆమెయందు సంభోగము కొరకైన ఒక పరమమైన విహ్వలత ఏర్పడుతుంది. ఈ అంగుళి ప్రవేశమువలన ఆమెయందు రతికొరకైన విహ్వలత ఏర్పడుతుందే కాని తృప్తి ఏర్పడదు. స్త్రీకి తృప్తి పురుషాంగ సంయోగముచేతనే లభిస్తుంది. ఈవిషయం పురుషుడు గ్రహించాలి. కేవలం అంగుళీగతంతో మాత్రమే ఆచరించేవాడు పురుషాధముడు. రతిక్రీడయందు మిక్కిలి ఉత్సుకతను కనబరచని స్త్రీలవిషయమునందు మాత్రమే ఆవశ్యకత నెరిగి పురుషుడీ అంగుళీ ప్రవేశ విధానమును ఆచరించాలి.

---

## -: క్రీడాతాడనము :-

సంభోగసమయములో స్త్రీపురుషులు సంయుక్తయంత్రులై రమించుచున్నవేళ భార్యను ప్రేమతో పురుషుడు ప్రహరించుట (కొట్టుట) కూడ జరుగుతుందని వెనుక చెప్పబడ్డది. ప్రహరణ తాడన శబ్దములు సమానార్థకములు. సుందరములై స్త్రీయొక్క నాడీమండలమును స్పందింపజేయగల్గిన తాడనభేదములు పదునొకండు ఇందు తెలుపబడుతున్నాయి. ఈ తాడనభేదములయందు మొదటిది శబ్దకర్తనము.

**1. శబ్దకర్తనము :-** శబ్దకర్తనము అనగా కత్తిరింపు శబ్దము. భార్యయొక్క శిరస్సు ఈతాడనమునకు స్థానమై ఉన్నది. పురుషుడు భార్యనుకలిసి సంభోగాసనాసీనుడై యుండి ఆమె శిరస్సు మీద క్రీడగా తాడనముచేయ నెంచినపుడీ శబ్దకర్తన విధానమును అవలంబించాలి. చేతివ్రేళ్ళు నాల్గింటిని గుప్పిడిగా ముడవకయే కొంచెము వదులుగావుంచి చిటికినవ్రేలియొక్క పార్శ్వభాగము శిరస్సునకు తాకునట్లుకొట్టగా – మిగిలినమూడువ్రేళ్లును వదలుగా ఉన్నందున ఒకదానిమీద ఒకటి పడినదై ఒక శబ్దమును జనింపజేస్తాయి. ఆ

శబ్దము 'టాత్ - టాత్' అన్నధ్వనికి సమీపంగా ఉంటుంది. దీని యందు వ్రేళ్ళయొక్క స్థితి కత్తెరయొక్క స్థితి సన్నిహితంగా ఉంటుంది పుట్టేశబ్దముకూడ కత్తెరింపుశబ్దాన్ని పోలిఉంటుంది. అందుచే దీనికీ పేరువచ్చినది.

**2. ముష్టితాడనము :-** భార్యతో కలిసి రమించుచు భర్త తనచేతివ్రేళ్ళను పూర్తిగా గుప్పిడిగా ముడిచి ఆమెను తాడించి నచో ఆతాడనము 'ముష్టితాడనము' అనబడుతుంది. భార్యయొక్క పిరుదులు పృష్టము ఈ తాడనమునకు అర్హస్థానములై ఉన్నాయి. ముష్టి అనగా పిడికిలి. పిడికిలిలో చేయబడే తాడనమైనందున దీనికీ పేరువచ్చినది.

**3 విద్ధకము :-** ఒకదెసగా ప్రయాణం చేస్తూవున్న వస్తువు (ఏకాంతికిరణమో) మరియొకదెసగా ప్రయాణంచేసే వేరొక వస్తువును (ఏకాంతికిరణమునో) ఢీకొనుట జరిగితే దానికి వేధ అని పేరు అట్టిదైన వేధాలక్షణముతో కొట్టుటకే విద్ధకమని పేరు, భర్త తన యొక్క కాలిబొటనవ్రేలితో భార్యయొక్క బుగ్గను వేధించుట విద్ధకము అనగా దీనికి భార్యయొక్క చెక్కిలిస్థానమనియు, పురుషుడు తనకాలి బొటనవ్రేలితో ఈతాడనం ఆచరించాలని గ్రహించాలి. కొన్ని సంభోగాసనములయందు భార్యయొక్క తొడలు పైకెత్తబడియుండగా పురుషుడామెను కూడువిధానములు చెప్పబడినవి. అట్టిస్థితియందు భార్య కొంత నిరుత్సాహముగాగాని, మరేకారణముచేతగాని తనముఖమును ఒకవంకకు వ్రాల్చియుంచుట సంభవించినచో - పురుషుడు సంభోగాసనమును వీడకయే ప్రయత్నపూర్వకముగా తనపాదము నామె ముఖము వద్దకు గొనిపోయి కాలి బొటనవ్రేలితో ఆమెముఖమును తనకు అభిముఖమగునట్లు మీటుట 'విద్ధకము' అనబడుతుంది.

**4. ఆదీపితము :** ఆదీపితము అనగా అంతటను ప్రజ్వలింపచేయబడినది. పురుషుడు తన పిడికిలితో భార్యయొక్క సర్వశరీర

మునందు కామాగ్ని జ్వలించునట్లు ఇచ్చట, అచ్చట అనక అంతట మర్దించుట, కొట్టుట జరిగినచో ఆతాడనము 'ఉదీపితము' అనబడుతుంది కామము సర్వత్ర దీప్తముగుటకై చేయబడు తాడనమగుటచే దీనికీ పేరు వచ్చినది.

**5 స్పృష్టకము** – భార్యయొక్క శరీరమునందు భర్త కేవలము తన అరచేతితో అల్పముగా తాడించినచో అది 'స్పృష్టకము' అనబడుతుంది. స్పృష్టశబ్దమునకు స్పృశింపబడినదని అర్థము. ఈ తాడనము స్పర్శాప్రధానముగా ఆచరింపబడుతుంది. అందుచేదీనికి 'స్పృష్టకము' అనుపేరువచ్చినది.

**6. కంపితకము :–** కంపనమనగా వడకుట. భార్యా భర్తలు కలిసి రమించుచుండగా భర్త ఒకానొక ఉత్కటావేశమునకు లోనై – ఆ అధికావేశము కారణముగా వడకుచున్న చేయికలవాడై – అట్లు వడకుచున్న చేతితో భార్యాశరీరమునం దెచ్చట తాడించుట జరిగినను – ఆతాడనము 'కంపితకము' అనబడుతుంది. భార్య తన సౌందర్యం ద్వారా భర్తయందు జనించిన అధికావేశాన్ని ఈ తాడనం ద్వారా గ్రహించినదై తానుకూడ దీప్తదీపంలా మెరుస్తుంది.

7. **సమాక్రమము :–** పురుషుడు భార్యను కూడియుండి ఆమెయొక్క శరీరమునందు మాంసలములైన భాగాలను కేవలము చేతితో అల్పముగా నొక్కుట జరిగితే అది 'సమాక్రమము' అనబడుతుంది. పురుషుడు చేతితో భార్యాశరీరమును తాడించుటకాక ఆక్రమించుటమాత్రమే ఇందు జరుగుతుంది. అందుచే దీనికీపేరువచ్చినది.

**8. బద్ధముష్టి :–** సమాక్రమమే మరికొంత గట్టిగా భార్యా శరీరము బాగుగనొచ్చునట్లు ఆచరింపబడితే అది 'బద్ధముష్టి' అనబడుతుంది. భార్యాశరీరమును చేతితో గ్రహించి గట్టిగా పిడికిలి బిగించుటతో అన్నట్లు వ్రేళ్లునొక్కబడుటవలన దీనకీపేరువచ్చినది. భార్య దేహమునం దెచ్చటనైనను ఈ బద్ధముష్టి నాచరింపవచ్చును.

**9. వేష్టితకము:-** వేష్టనము అనగా చుట్టుట. తుమ్మెదల వలె నల్లగా ఉండి, సువాసనలు విరజిమ్ము పూవులతో అలంకరింపబడిన భార్యయొక్క జడను చేతికి చుట్టుకొని లాగుట లేదా జుట్టులోని ఒక పాయను మాత్రము తనవ్రేలికి చుట్టి లాగుట- 'వేష్టితకము' అనబడుతుంది.

**10. కృతగ్రంధి:** గ్రంధి అనగా ముడి. భర్త భార్యయొక్క చేతివ్రేళ్ళ సందులనుండి తన చేతివ్రేళ్ళను పోనిచ్చి ఆమె చేతివ్రేళ్ళతో తన చేతివ్రేళ్ళను ముడివైచినట్లుంచి నొక్కుట జరిగినచో – ఆస్థితి 'కృతగ్రంధి' అనబడుతుంది. ఆలుమగల చేతివ్రేళ్ళు ముడివేయ బడినట్లుండుటచే దీనికీ పేరు వచ్చినది.

**11. సమాకృష్టి:-** ఆకర్షణ మనగా లాగుట. భార్యను గూడి రమించుచున్న భర్త ఆమెయొక్క చనుమొనను లేదా మెడ మీాది పలుచని చర్మమును తన చూపుడువ్రేలితోడను, బొటనవ్రేలి తోడను (రెండువ్రేళ్ళతో మాత్రమే గ్రహించి లాగుట జరిగినచో అది 'సమాకృష్టి' అనబడుతుంది,

ఇట్లున్న ఈ తాడనభేదములయందు ఏడవదైన సమాక్రమము మొదలు పదునొకండవదైన సమాకృష్టివరకు చెప్పబడిన తాడనము లైదును నిజమునకు తాడనములు (కొట్టుటలు)కావు. అయినను వీనిచే భార్యయొక్క శరీరము తాడనమునందువలెనే నొచ్చుట జరుగును. అందుచే ఇవి ఇందు చేర్చబడ్డాయి. ఈ తాడనములన్నియు ఉచితవేళ ఉచితరీతిని ఆచరింపబడినప్పుడు భార్యాభర్తల సంభోగసౌఖ్యాన్ని పెంపొందిస్తాయి.

వీనివలన భార్యకు కొంచెంబాధకలిగినా తన శరీరావయవవాలతో ఈవిధంగా భర్త తాడనపూర్వకంగా ఆడుకొనడం ఆమెకు ఆనందాన్నే కలిగిస్తుంది. అయినా ఆమె తన ఆనందాన్ని వ్యక్తపరచ డానికి బదులు నొప్పినే అభినయిస్తూ 'ఇస్-అమ్మ-అబ్బ' మొదలగు

ధ్వనులతో తన బాధను వ్యక్తంచేస్తుంది. ఈ ధ్వనులకు విరుతములని పేరు. అవి ఈదిగువ ప్రకరణములో వివరింపబడుతున్నాయి.

---

## -: విరుత భేదములు :-

విరుతము అనగా విశేషధ్వని. సంభోగవేళ భార్యను తాను మెల్లగా తాడించగా ఆమె 'అమ్మా-ఇస్' మొదలగు విరుతాలను ఆచరిస్తే వానిని వినుటచే భర్తయొక్క హృదయములో ఏదో తెలియని ఆనందరేఖ నర్తిస్తుంది. అట్టి ఆనందమును కలిగించునదగుట చేతనే విరుతము ఆలింగనమాదిగాగల రతిభేదములయందే డవ రతిభేదముగా చెప్పబడినది. ఈ విరుతభేదములు మొత్తముఏడు. వానిలో మొదటిది స్తనితము.

**1. స్తనితము:-** స్తనితము అనగా మేఘధ్వని. అనగా ఊంకము. సంభోగసమయమున భర్త భార్యను కొంచెము నొప్పి తోచునట్లు వర్తించినపుడు కృతకమైన కోపముతో ఆమె "ఊం, ఊం" అని పలికితే ఆధ్వని విశేషము స్తనితము అనబడుతుంది. అలా కోపసూచనకై ఉచ్చరించే ఊకారము జఠరదేశమునుండి ఉచ్ఛ్వాసతో వ్యక్తం అవుతుంది. ఈధ్వని మేఘధ్వనిని పోలినదగుటచే దీనికి 'స్తనితము' అను పేరేర్పడినది.

**2. కూజితము:-** పక్షులు ఆచరించే ధ్వని విశేషములు కూజితము అనబడుతాయి. కూత అను శబ్దము కూజిత శబ్దము నుండియే జన్మించినది. రతివేళ భార్య తృప్తిచెందినపుడామె కంఠము నుండి ఆమెకు తెలియకయే – మిక్కిలి ఉత్సాహముగానున్న పావురముయొక్క "కువకువ" ధ్వనిని పోలినధ్వని జనిస్తుంది. ఈధ్వని విశేషము ఆమెయొక్క పరితృప్తిని సూచించునదగుటచే భర్తయొక్క

ఆనందాన్ని తరంగితం చేస్తుంది. తమకు రతియందు తృప్తికలిగినపుడు స్త్రీలు గొంతు సవరించుకొంటారు. ఆ సవరించుకొనుటలో ఇట్టిధ్వని ఏర్పడుతుంది.

**3. శ్వసితము:-** శబ్దము వినబడునట్లు నిట్టూర్పుటయే శ్వసితము. రతివేళ (ఏ పురుషాయితమునో ఆచరించి) అలసినదై భార్య సశబ్దముగ నిట్టూర్పుట జరిగితే అది 'శ్వసితము' అనబడుతుంది

**4. సీత్కారము:-** బాధను అలసటను సూచిస్తూ 'ఇస్' అని కొంచెం దీర్ఘంగా పలుకబడే ధ్వని విశేషమునకే సీత్కారమని పేరు. రతివేళ అలసిన భార్య ఒక్కొక్కప్పుడు తన అలసటను సూచించుటకును, భర్త తన శరీరముమీద తీసుకొనే చొరవను నిషేధించుటకును ఈవిధమైన ధ్వనిని ఆచరిస్తుంది.

**5 ఫూత్కారము:-** మండని పొయ్యిని మండించుటకు 'ఉఫ్ ఉఫ్' అని ఊది మండించుట లోకవిదితమే. మానవుడు బాగా అలసినపుడుకూడా సరిగా ఇట్లే దగ్గరగాజేర్చిన పెదవుల మధ్యనుండి గాలిని విసర్జిస్తాడు. రతిసమయంలో బాగా అలసిన భార్య దగ్గరగాజేర్చిన తన పెదవుల మధ్యనుండి గాలిని విసర్జిస్తూ 'ఉఫ్' అన్నధ్వనిని ఆచరించుట 'ఫూత్కారము' అనబడుతుంది. ఫూత్కారమన్న పేరులోనే దాని లక్షణం ఇమిడిఉన్నది. రతి రహస్యమునందు ఫూత్కార లక్షణము భిన్నముగా చెప్పబడినది. చూ— రతిరహస్యం.

**6. హింకృతము:-** "హింక్" అను అక్షరములను ఉచ్చరించునపుడు జనించు ధ్వనివంటి ధ్వనియగుటచే దీనికి 'హింకృతము' అని పేరు వచ్చినది.

రతివేళ భార్యలో ఒక తీవ్రావేశము జనించి, ఆమె తన భర్తను ముద్దుకొనే వేగంలో ఈ హింకృతం పుడుతుంది.అనగా

భర్తయొక్క ముఖము భార్యాముఖానికి కొంతదూరంలో ఉన్నది. ఆమెలో భర్త ముఖాన్ని చుంబించాలన్న కోరిక జనించింది. ఆమె తన ముఖమును భర్తయొక్క ముఖమునకు దగ్గరగా కొని పెట్టుటకు పూర్వమే నోరు తెరచి గాలిని లోపలికి పీల్చుచు — వేగముగా తన పెదవుల నాతని ముఖముపై చేర్చి చుంబించినది. అట్టి స్థితియందే 'హింకృతము' జన్మిస్తుంది. ఎట్లనగా ఆమె గాలి పీల్చువేళ జన్మించిన "హాకార" ధ్వనివంటి ధ్వని. పెదవులు ఒక్క సారిగా భర్తయొక్క ముఖముమీద ఆన్చినంతనే "క" అన్న ధ్వనితో సమాప్తం అవుతుంది. అందువలననే దీనికి 'హింకృతము' అన్న పేరేర్పడినది రతిరహస్యకారుని హింకృతధ్వని లక్షణము దీనికంటె భిన్నమైనది. చూ— రతిరహస్యం.

**6. దూత్కృతము:**—మంచిముత్యము చేయిజారి మట్టినేలపై పడినప్పుడు "దత్" అన్న శబ్దం పుడుతుంది. సరిగా అట్లే రతివేళ భార్య భర్తను కృతకంగా "థత్, దత్" అన్న శబ్దాలను పలుకుతుంది. అయితే అది రతిసమయముకనుక, ఎవరైనా వింటా రన్న సంకోచముతో ఆమె ఆ శబ్దాలను చాలా అల్పధ్వనితో ఉచ్చరిస్తుంది. అపుడా శబ్దము "దూత్, ఊత్" అనే శబ్దాల వలె వినిపిస్తుంది. ఇదుగో! భార్యాకంఠ నిర్గతమైన ఇట్టి ధ్వని విశేషము 'దూత్కారము' అనబడుతుంది.

రతిరహస్యమునందు "కూజితము" చెప్పబడలేదు. దానికి బదులుగా "రుదితము" (భర్తయొక్క చేతవలన నొప్పితోచి భార్య ఏడ్చుట) చెప్పబడినది.

ఈధ్వని విశేషములన్నియు సతీపతుల రతిక్రీడయందు ఆనంద వర్ధకాలై ఉన్నాయి.

## -: చంద్రకళ :-

మన్మథునకు స్త్రీయొక్క సర్వశరీరము నివాసస్థలమే అయి ఉన్నప్పటికి ఒక్కొక్కరోజున ఒక్కొక్క ప్రత్యేకావయవమునం దాతనియొక్క స్ఫూర్తి అధికంగా ఉంటుంది. కామభావముయొక్క దైవరూపమే మన్మథుడు. అందుచే స్త్రీశరీరంలో ఒక్కొకరోజున ఒక్కొక అవయవంలో అధికస్ఫూర్తికలదై ఉన్న కామాగ్ని అచ్చట భర్తయొక్క స్పర్శ కలిగినంతనే భగ్గున ప్రజ్వలించి ఆమెయొక్క సర్వశరీరమునందు విద్యుద్వలయాలను సృష్టిస్తుంది. దానితో ఆమె విహ్వలయై వివశయై భర్త చేతులలోనికి ఒరిగిపోతుంది. ఇలా దినదినము స్త్రీ శరీరావయవములందు మార్పుచెందే కామము ఆకాశమునిూద మనము నిత్యము దర్శించే చంద్రకళయొక్క వృద్ధి క్షయముల ననుసరించి వృద్ధిచెంది క్షీణించేదై ఉన్నది. అందుచే ఈమార్పుచెందే కళను చంద్రికళ అన్నారు. నిజమునకిది కామకళ.

ఈకామకళకు, స్త్రీయొక్క శరీరములో వామభాగము మాత్రమే నివాసస్థానమైఉన్నది. చంద్రుడు శుక్లపాడ్యమి మొదలు పూర్ణిమవరకు వృద్ధిచెంది, తిరుగ కృష్ణపాడ్యమినుండి అమావాశ్య నాటికి క్షీణదశకు వస్తాడు. అల్లే ఈ కామకళకూడ శుక్లపాడ్యమి రోజున వనితయొక్క వామపాదాగ్రమునం దున్నదై పూర్ణిమ నాటికి శిరస్సును చేరుకొని, తిరుగ కృష్ణపాడ్యమినుండి క్రిందకు దిగుటను ఉపక్రమించి, అమావాస్యనాటికి మరల యథాస్థానము నను అనగా వామ పాదాగ్రమునకు చేరుకొంటుంది. అనగా తిథులనుబట్టి యీ కామకళా స్థానాలను గుర్తించాలి.

**3. సింధు దేశ స్త్రీలు:-** మన దేశమునందలి నేటి పంజాబు ప్రాంతమును పశ్చిమ పాకీస్తానమును పూర్వము సింధు దేశమని పిలుచుచుండువారు. ఈప్రాంతమున జన్మించిన స్త్రీలు వ్యానత కరణము (స్త్రీ తన పాదములను చేతులను నేలపై ఆని నాలుగు కాళ్ళ జంతువువలె వంగియుండగా పురుషుడామెను వెనుకనుండి కూడి రమించు విధానము) నందు ఆసక్తి కలవారై ఉంటారు. గాఢాలింగన కేశాకర్షణములయందు వీరికి ప్రీతిఎక్కువ. వీరు నఖక్షత దంతక్షతములయందుకూడ అభిరుచిని ప్రదర్శిస్తారు. ఆలింగనాదికములైన బాహ్య రతివిధానము లన్నిటియందును ఆసక్తికలవారైన ఈస్త్రీలు అల్పమైన ఆభ్యంతర రతిచేతనే (సంభోగము) ఆనందించేవారై వుంటారు. అనగా వీరు దీర్ఘకాలిక రతిని వాంఛింపరు.

**4. కురు-మరు దేశ స్త్రీలు:-** మన దేశమునకు ఉత్తరమున హిమాలయము నంటియున్న దేశము కురుదేశము. ప్రస్తుత రాజస్థానమే మరుదేశము. ఈ దేశములయందు జన్మించిన వనితలు స్థంస్లలోకంటె కొండగుహలయందు, చిట్టడవులయందు కాంతునితో కలసి విహరించుటయం దాసక్తికలవారై వుంటారు.

**5. సింహళ దేశ స్త్రీలు -** సింహళ దేశము సుప్రసిద్ధము. ఈ దేశమునందలి స్త్రీలు నానావిధ రతివిధానములందును ఆసక్తికలవారై నేర్పరులై వుంటారు.

**6. కాశ్మీర దేశ స్త్రీలు:-** కాశ్మీరదేశము సుప్రసిద్ధము. ఈ దేశమునందలి స్త్రీలు చక్కని పనితనముకల సుందర వస్త్రాలను నిపుణముగా ధరిస్తారు. వీరు మిక్కిలి శుచి శుభ్రతలుకలవారై గుణవతులై ఉంటారు.

**7. జలంధర దేశ స్త్రీలు:-** పంజాబు దేశమునందే ఉత్తర ప్రాంతమున జలంధరనగరము ఉన్నది. ఆనగర పరిసరములయందు

జన్మించిన వనితలు సహజంగా ఆచారహీనలై ఉంటారు. వీరు రతివేళ పతి తమ్ము అధికంగా తాడించుటద్వారా ఆనందిస్తారు.

**8. స్త్రీరాజ్య-కోసలదేశ స్త్రీలు:-** ప్రస్తుతము 'భూటాన్' అని పిలువబడు ప్రాంతమునే పూర్వము స్త్రీరాజ్యమను పేరుతో పేర్కొనేవారు. అయోధ్య అనే నగరాన్ని నేటి మనదేశ పటమునందు గుర్తింపవచ్చును. ఈనగరము మనదేశములో ఉత్తర ప్రాంతమునందున్నది. ఈనగరప్రాంత దేశము పూర్వము కోసల దేశమని పిలువబడేది.

ఈరెండు ప్రాంతములయందలి స్త్రీలు వివిధాలింగన చుంబనములందును ఉత్థిత (నిలువబడి రమించుట) వ్యానతకరణము(పశువు వలె వంగియుండగా రమించుట) ల యందును అనురక్తికలవారై ఉంటారు. వీరు దీర్ఘకాలికమైన రతినికోరే చండవేగలై ఉంటారు. అందుచే పురుషుడు వారిని తృప్తిపరచుటకు కృత్రిమ పురుషాంగమును (పురుషాంగమువలె తయారుచేయబడిన కఱ్ఱ లేక వేరొక ధాతువు) ఉపయోగించుట పూర్వము ఆచరణలో ఉండేది.

**9. కర్ణాటదేశ స్త్రీలు:-** కర్ణాటదేశ మనగా కన్నడదేశము కన్నడదేశములోని స్త్రీలు స్త్రీరాజ్య కోసలదేశ స్త్రీలవలె అధిక కామం కలవారై దీర్ఘకాలిక రతియందాసక్తి కలవారై ఉంటారు. అందుచే ఈదేశ స్త్రీల విషయమునందును పూర్వము కృత్రిమ పురుషాంగము నుపయోగించుట ఆచరణలో ఉండేది. అధికకామం కలవారైనందున ఈస్త్రీలు మదవతీ లక్షణాన్ని సార్థకపరచే శరీరాలు కలవారై ఉంటారు. వీరు రతివేళ పతిచేసే తాడనాలను ఆనందంతో స్వీకరిస్తారు. వీరికి 'అంగుళీప్రవేశము' నందును ఆసక్తి ఎక్కువ.

**10. మహారాష్ట్ర స్త్రీలు:-** మహారాష్ట్ర దేశము సుప్రసిద్ధము ఆ దేశములోని వనితలు సకలకళా నిపుణులై ఉంటారు. (కళలు

మొత్తం 64. వీనిని వరము వాత్స్యాయనుని కామసూత్రము లందు చూడఁదగును.) వీరియందమును కామముయొక్కపాలు ఎక్కువ గానే ఉంటుంది. అయినా వీరు కృత్రిమ పురుషాంగమును వాంఛింపరు. ఆలింగన చుంబనములయందును, అంగుళీ ప్రవేశము నందును అభిలాష కలవారై ఉంటారు.

**11. ద్రవిడదేశ స్త్రీలు :-** ద్రవిడ దేశమనగా తమిళ దేశము ఈ దేశ స్త్రీలు అలంకారప్రియులై ఉంటారు. వీరికి ఆలింగన చుంబన ములయందు అభిలాష ఎక్కువ. అందున జిహ్వాప్రవేశ చుంబనముపై వీరికి మక్కువఎక్కువ. రతివేళ పతి తమ్ముతాడించి తనుశరీరము నందు మాంసపుముగల భాగములను బాగుగమర్దించి, తనజుట్టును లాగి చికాకుపరచుటద్వారా వీరు ఆనందించేవారై ఉంటారు.

**12. వంగ - గౌడదేశ స్త్రీలు :-** వంగ దేశమనగా నేటి బెంగాల్. నేటిబిహారురును అంటియున్న ప్రాంతము(ఒరిస్సా)పూర్వము గౌడ దేశమని పిలువబడెడిది. ఈ రెండు దేశములలోని వనితలు లావణ్య ముతో నిండిన శరీరాలుకలవారై ఉంటారు. ఆలింగన చుంబనముల యందు, అందున అధరోష్ట (క్రింది పెదవి) పానమునందు వీరికి అభిలాష ఎక్కువ. అభ్యంతర రతియందు వీరు కనబరచే ఆసక్తి మనోహరంగా ఉంటుంది. వీరు మధురంగా మాట్లాడతారు. తీర్థయాత్రలయందు వీరికి మక్కువ ఎక్కువ.

**13. నేపాళ - కామరూప - చీనాదేశ స్త్రీలు** నేపాళము ప్రసిద్ధము. కామరూపమనగా నేటి అస్సాము ప్రాంతము. ఈ రెండు దేశములలోని వనితలును, చీనా దేశవనితలును సమానమైన స్వభావా భిరుచులు కలవారై యుంటారు. వీరు అలంకారప్రియులై కళా పాండితికలవారై, మధురభాషిణులై ఉంటారు. వీరుమందవేగలు అనగా అల్పకామంగలవారు. అల్పకాలిక రతిక్రీడచే తృప్తిచెందుతారు

అయినావీరు సుందరయువకుడు కంటబడినంతనే కామాసక్తిని కండ్లలో వ్యక్తపరుస్తారు. రతివేళ వీరు ఆలింగన చుంబనములయందు ఆసక్తిని ప్రదర్శిస్తారు. నఖక్షత దంతక్షతములయందును, అంగుళీప్రవేశ, క్రీడా తాడన, శరీరయుద్ధములయందును వీరు ఆసక్తిని చూపరు.

ఈవిధముగా దేశభేదమునుబట్టి స్త్రీలయొక్క అభిరుచులు, స్వభావములు భిన్నంగా ఉన్నాయి. వారివారి ప్రకృతులకు అనుకూలముగా వర్తించినప్పుడు మాత్రమే భర్తవలన వారికి వారివలన భర్తకు ఆనందము కలుగుతుంది. అట్లుకాక వారిప్రకృతికి విరుద్ధంగా భర్త వర్తించిననాడు ఉభయులకును సుఖముకలిగే అవకాశములేదు. చలి గడగడ వణికిస్తూఉన్నప్పుడు వింజామరగాలి ఎవరికిని సుఖాన్నికలిగించదు కాని ఆ వింజామరమే ఉష్ణకాలమునందు, ఉష్ణదేశమునందు సుఖదాయకం అవుతుంది. అట్లే భిన్న దేశములోని స్త్రీలు భిన్నాభిరుచులు కలవారై ఉండుటచే పురుషుడు ఆ యా దేశప్రకృతులకు అనుకూలములైన రతివిధానముల నవలంబించాలి.

ఈ ప్రకరణంలో పద్మశ్రీ ఆంధ్రదేశ గూర్జరదేశ (గుజరాత్) స్త్రీల స్వభావములనుగూర్చి చెప్పలేదు. ఆ దేశ స్త్రీల స్వభావములు రతిరహస్యమునం దీవిధముగా చెప్పబడ్డాయి. ఆంధ్రదేశస్త్రీలు :- వీరు సుకుమారంగా ఉంటారు. రతియందు ఉత్సాహాన్ని ప్రదర్శిస్తారు. వీరు రతివేళ భర్తకు తనకు తృప్తికలిగి భావావసాన దశకు వచ్చియున్నప్పుడు కూడ తమ మర్మావయవముతో అల్పవీర్యమైన పురుషావయవమును బిగియబట్టి భర్తను ప్రోత్సహించి ఆనందించే స్వభావము కలవారై ఉంటారు. ఘూర్జరదేశస్త్రీలు ఘూర్జరమనగా నేటిగుజరాత్. ఈదేశపుస్త్రీలు వరలుకొప్పులతో, బిగువుచన్నులతో సుందరనేత్రములతో మధురభాషిణులై బాహ్య- ఆభ్యంతర రతుల యందు రెండింటియందును ఆసక్తి నలవారై ఉంటారు.

---

## :: కాంతల ఏకాంత ధర్మాలు :-

ఇంతవరకు వివిధ భేదములతో కూడిన కామక్రీడా విధానము లన్నియు తెలుపబడ్డాయి. పురుషుడు ఈ శాస్త్రమునందెంత పండితు డైనా భార్యయొక్క అనురూపాదరణం వల్లనే అతనియందు ఉత్సాహం జనిస్తుంది. అప్పుడాతడు తనానందించి ఆమెను ఆనందింపజేయ గలుగుతాడు. భార్యయొక్క నడవడి, ఆమె చేతలు, అతనిమనస్సులో ప్రేమోత్సాహాలను జనింపజేయ లేకపోతే అతడామెయందు తగినంత అనురాగం ప్రదర్శింప జాలనివాడవుతాడు. ఫలితంగా ఆలుమగల దాంపత్యం రసహీనంగా ఉంటుంది. అందుచే ఏకాంతలో భర్తయొక్క మానసాన్ని ఆకర్షించడానికి కాంతలు ఆచరింపవలసిన పనులు ఈ ప్రకరణంలో తెలుపబడుతున్నాయి.

తనభర్తయొక్క మనస్సును ఆకర్షించాలని, అతనియొక్క పరిపూర్ణ ప్రేమానురాగాలకు తాను పాత్రం కావాలని ప్రతివనిత కోరుకొంటుంది. అలా భర్తయొక్క ప్రేమానురాగాలను వాంఛించే వనిత అన్ని పనులు భర్తమనస్సుకు అనుకూలంగా ఆచరించాలి. భర్తకు అనిష్టమైన పనిని ఆచరించుట, ఇష్టమైన పనియందు అనాదరము చూపుట భార్యకు తగదు. ఆమె ఎల్లవేళల స్వచ్ఛమైన వస్త్రాలను నాజూకుగా ధరించాలి. అందున పతిని కలిసే ఏకాంతసమయంలో ఆమె వస్త్రాధారణం స్వచ్ఛతాపూర్ణమై - నాగరకతతో కూడినదై ఉండుట మిక్కిలి అవసరము. ఆమె నాగరకులు తమశరీరాలు అలంకరించుకొనే విధానలయందు నేర్పుగడించి శరీరాలంకరణముులో శ్రద్ధకలదై ఉండాలి. ఆమె వేషాలంకారాలలో పల్లెటూరివారి అసహ్యకరములైన లక్షణాలు కనిపించకూడదు. ఆమెభర్త మనస్సుకు నొప్పితో చేమాటలు నెన్నడును పలుకక మధురభాషిణియై ఉండాలి.

పతియెదుట పత్నికి భయభక్తులే శోభాజనకాలు. ఆమె పతియందనురాగముతో బాటు భీతినికూడ తగుమాత్రంగా ప్రదర్శిస్తూ లజ్జాశీలయై

ఉండుటవల్ల ఆతని హృదయానురాగాన్ని పొందగలుగుతుంది. స్త్రీలకు సిగ్గు సహజాభరణం. అందుచే పతి ఎరుగని రహస్యములు తనయొద్ద లేకపోయినను స్త్రీ లజ్జాగుణాన్ని విడువకూడదు. అట్టి లజ్జాప్రదర్శనం వల్ల పతియొక్క-మనస్సుఆనందతరంగితం అవుతుంది. నిర్లజ్జ సిగ్గులేనిది) అయిన వనితయందు పురుషునకు విరక్తి కలుగుతుంది. అందుచే పతి ఎదుటకూడ వనిత సిగ్గువిడచి ఎన్నడును చరించకూడదు. సంతతము చిరునవ్వుతో కూడిన ముఖముకలదై నాజూకైన వస్త్రధారణంద్వారా అల్పంగా మాత్రమే గోచరించే శరీరముకలదై లజ్జావతియైన వనిత పతియొక్క మానసాన్ని ఆకర్షించ గలుగుతుంది. పతిఎదుట చిరునవ్వును విడచి కోపమును, దుఃఖమును ప్రదర్శించే వనితలు భర్తయొక్క అనురాగావేశాన్ని కూడ సంపాదించలేరు.

చిరకాలమునుండి తాను పతితో కలసి కాపురముచేస్తూ ఉన్నా ఆపతి రతిక్రీడయందాసక్తిచూపినప్పుడు వనిత వెంటనే అంగీకరించరాదు. ఆ సమయమునందామె తన శరీరాన్ని ముడుచుకొని, కొంతసిగ్గును, కొంతభయమును, కొంత వ్యతిరేకతను ప్రదర్శించుటద్వారా మాత్రమే పతియొక్క మనస్సులో అనురాగాన్ని దీప్తం చేయగలుగుతుంది.

ఇక రతిక్రీడ ఆరంభమైనమీదట వనిత అంతవరకు ప్రదర్శించిన సిగ్గును వ్యతిరేకతను కొంతవరకు విడచిపెట్టి తనయొక్క శరీరాన్ని భర్తకు అర్పించాలి. ఆ అర్పించుటలో ఆతనిమీది ప్రేమవలన తాను దీనికి (రతికి) ఒడబడుతూ ఉన్నట్లుండాలేకాని, తానే రతిని కోరుతూ ఉన్నట్లు ఉండకూడదు. సంభోగసమయంలో భర్త ఆవేశముతో తనయొక్క ఏ శరీరభాగాన్ని చూడగోరినా లేక నఖక్షత దంతక్షతము లాచరింపగోరినా ఆ శరీరభాగాన్ని ఆతనిదృష్టికి చేతులకు అందకుండ తప్పించి, ఆతనిని కవ్వించి అందించాలేకాని కోరినంతనే అందీయకూడదు.

భర్త తనయొక్క స్తనాదులను చేతులతో నొక్కి పీడించు నపుడు భార్య "కూజితము", (పావురము వలె 'కువకువ' మనుట) దంతక్షత మాచరించినపుడు బాధతో "హుంకారము" (ఉఁహ్ అనుట) నఖక్షత మాచరించినపుడు 'సీత్కారము' (ఇస్ అనుట) అనే ధ్వనులను ఆచరించాలి. ఆమెయొక్క ఈధ్వనులు భర్తయొక్క ఆనందాన్ని పెంపొందిస్తాయి.

రతిక్రీడ కొంతవరకు సాగినమీదట భార్య పులకించిన శరీరముతో, చెమటతో దోగిన ముఖము కలదై అలసటను, ఆయాసమును సూచిస్తూ నిట్టూరుస్తూ నెమ్మదిగా "హా" అని మూల్గుట ద్వారా పతియొక్క అనురాగాన్ని వృద్ధిచేయగలుగుతుంది. ఆసమయాన ఔచిత్యమెరిగి "అబ్బ! అంత మోటుదనమైతే ఎలా? నన్ను గట్టిగా నొక్కకు! నొక్కితే నేను ఓర్చుకోలేను! నాకంత ఓపిక లేదు!"– అనే మాటలు పలుకుతూ ఉండాలి.

రతిక్రీడయందు పతి సర్వదా ఒకేరకమైన ఆవేశాన్ని ప్రదర్శించడు. ఒకప్పుడాతడు అల్పావేశముతో ప్రవర్తిస్తే, ఒకప్పుడు అధికావేశముతోడను, ఒకప్పుడు సాధారణావేశముతోడను ప్రవర్తిస్తాడు. పతిలోని ఈ సంభోగాతురత ఏపాలులో ఉన్నదో గమనించి భార్య తదనుకూలమైన నడవడిని ప్రదర్శించాలి.

ఇక రతిక్రీడ ఉభయుల మనస్సులకు ఆనందజనకంగా సాగుతూ ఉన్నప్పుడు స్త్రీ తన వినయగుణాన్ని విడచి, ధైర్యాన్ని ప్రదర్శిస్తూ ఒకటి రెండు అశ్లీలాలు (బూతుమాటలు) భర్తతో పలుకుటకూడా అవశ్యకృత్యమై ఉన్నది. ఆసమయంలో అట్టి బూతుమాటలు భార్య పలికితే భర్తలోని కామావేశం పెరుగుతుంది. ఈఒక్క సమయంలోనే స్త్రీ బూతుమాటలు పలుకుటకు శాస్త్రాలు సమ్మతించాయి దీనికి భిన్నమైన ఏపరిస్థితి యందును ఆమె అశ్లీలాలు పలుకరాదు.

రతిక్రీడ పరిసమాప్తమైనంతనే వనిత శిథిలమైన దేహము కలదై, మూయబడిన కన్నులుకలదై, తనలోని పారవశ్యాన్ని తన

శరీరస్థితిచే ప్రదర్శించాలి. రతిక్రీడ ముగిసినమీదట కాంత ఎంత పరవశయై ఉన్నా మిక్కిలి శీఘ్రంగా భర్తయొక్క కంటబడకుండునటు తన జఘనభాగాన్ని (మొలముందు ప్రదేశము) వస్త్రముతో కప్పుకోవాలి. క్రీడా సమాప్తియందు చిక్కులుపడిన తన జుట్టును, అలసటను సూచించుచు చెమటతో దోగిన కన్నులను ప్రదర్శించినట్లు వనిత తన జఘనదేశాన్ని భర్తకు ప్రదర్శించకూడదు.

కాంతలందరు ఈ ఏకాంత ధర్మాలను గుర్తించి చరించాలి. వీనివలన వారిలోని నాజూకుదనం ప్రదర్శింపబడి వారు భర్తను ఆకర్షించగలవారు అవుతారు. లోకంలో కాంతానురంజనం (స్త్రీని సంతోషపెట్టుట) మిక్కిలి సున్నితమైనది, క్లేశముతో కూడినది. ఈ ఏకాంతధర్మాలను కాంతలు ఆచరించే తీరునుబట్టి పురుషుడు వారియొక్క తృప్తిని, అసంతృప్తిని గ్రహించి తగినట్లు వర్తించాలి. అప్పుడు భార్యాభర్తలు ఇద్దరును ఆనందమయజీవనం గడపగలుగుతారు.

---

## -: పరదారగమనము :-

పరదార అనగా పరభార్య 'నపరదారాన్ గచ్ఛేత్' పరస్త్రీలను పొందరాదు. అని వేదము చెబుతోంది, పరస్త్రీలపొందు ఈ విధంగా వేదవిరుద్ధము, అధర్మము అయి ఉండగా కామశాస్త్రగ్రంథములయందు ఆపరస్త్రీని పొందడానికి, ఉపాయాలు చెప్పబడ్డాయి. అందుచే అవి నింద్యములయ్యాయి - అన్న వాడుకకూడ లోకంలోఉన్నది. కాని ఈవిషయం వాస్తవంకాదు.

పరస్త్రీని పొందరాదనియే సర్వకామశాస్త్రములు ఘోషిస్తున్నాయి. కాని ఒక్కొక్కప్పుడు కామం మిక్కిలి ప్రబలంగాఉండి తాను వాంఛించిన స్త్రీని - ఆమె పరస్త్రీయేకావచ్చు - పొందలేకపోతే తన తనువుకే ముప్పు వాటిల్లే పరిస్థితి ఏర్పడుతుంది. అయితే ఈ పరిస్థితి ఎక్కడనోకాని ఏర్పడదు.

వెనుక ఒక ప్రకరణంలో మన్మథావస్థలు చెప్పబడ్డాయి. వానిలో చివరి అవస్థ మరణము. స్త్రీ పురుషులలో కామం పరస్పరం చూచుకొనడంతో ఆరంభం అవుతుంది. అవి క్రమంగా మెట్లెక్కినట్లు శరీరంలో విజృంభిస్తూ ఉంటుంది. దాని విజృంభణలో చివరిమెట్టు (పదవఅవస్థ) మరణం. కాని ఈలోగానే ఆ స్త్రీపురుషులకు సంగమం కలిగితే విజృంభిస్తూ ఉన్న ఆ కామంయొక్క ఆటఅంతలో కట్టు పడుతుంది. అతి మరి పైమెట్టుమీదకు ఎక్కజాలనిదగుతుంది. ఇలా కంటిచూపుతో ఆరంభమైన కామం, అభిలషించిన స్త్రీపురుషులకు సాంగత్యం ఏర్పడకపోయినా అన్ని మెట్లు ఎక్కజాలినంత బలంగా అందరియందు విజృంభించదు. ఎక్కడో, ఎప్పుడో అట్టిపరిస్థితి ఏర్ప డుతుంది. అట్టిచోట తనశరీరాన్ని కాపాడుకొనడం కోసం పరస్త్రీ గమనాన్ని కామశాస్త్రాలు అంగీకరించాయంటే దానిలో దోషం లేదనిపిస్తుంది.

కాని ఇది ఎవరికివారు ఆత్మపరీక్ష చేసి చూచుకొనవలసిన విషయము. "అ పరవనితను పొందకపోతే చచ్చిపోతాను"—అన్న భీతి పూర్తిగా ఏర్పడినట్లు తాను అంతరంగంలో పరిశుద్ధంగా భావిం చిననాడు మాత్రమే ప్రయత్నించవలసిన విషయమిది. ఇదైనా ఎం దుకు అంగీకరింపబడ్డదంటే "శరీరమాద్యం ఖలుధర్మసాధనం" అన్నారు ధర్మము యెంత గొప్పదైనా దానిని సాధించిపెట్టే సాధనాలలో మొదటిది శరీరము. అందుచే "ధర్మము, శరీరము" రెండింటిలో ఏది? అన్న ప్రశ్న ఏర్పడినప్పుడు శరీరము వంకకే మొగ్గుచూపి ధర్మాన్ని కొంత చిన్నచూపు చూస్తే – అది అన్యాయం అనబడదు

అందుచేతనే ప్రాణాపాయదశయందు పరస్త్రీ గమనానికి కొంత అంగీకారం కామశాస్త్రాలలో కనుపిస్తుంది. తన ప్రాణము పోయినను పరస్త్రీని పొందడానికి అంగీకరించనివారున్ను ఉంటారు. అట్టివారు యుగానికి ఒక్కరుకూడ జన్మిస్తారో లేదో తెలియదు.

వారు మహాత్ములు. ఇక పరవనితను పొందకపోతే ప్రాణం పోతుం దన్న దశయందు మాత్రమే పరవనితాసక్తులయ్యేవారు ఉత్త ములు. పరవనితను పొందకపోతే తన ప్రాణానికి కలిగే ముప్పు ఏమీ లేకపోయినా దుర్వాంఛాపూర్తికై కంటబడిన ప్రతికాంతకొరకు ప్రాకులాడేవారు అధములు. ఈవిషయంలో ద్వితీయుల నుద్దేశించి మాత్రమే కామశాస్త్రములయందు పరదారగమనము చెప్పబడ్డది.

పరదారగమనము కామశాస్త్రాలలో చెప్పబడుటలో వేరొక ప్రధానోద్దేశము స్వభార్యారక్షణము, తాను పరస్త్రీ కొరకు ప్రయ త్నించకపోయినా పరుడెవడో దుష్టుడు తన భార్యపై కన్నువేసి యత్నించవచ్చు. వానియొక్క యత్నస్వరూపం తెలిస్తే ఆవిధముండే తాను జాగ్రత్త పడడానికి వీలు. ఆయత్న స్వరూపము తెలియాలి అంటే పరదారగమన విధులెట్టివో తాను తెలిసికొనాలికదా! అట్టి తెలివిడి అందరకు కలిగించుటకే శాస్త్రములలో పరదారగమనం చెప్పబడ్డది. ఈదృష్టితో చూస్తే పరదారగమన మన్న విషయం ధర్మానికి ఎంత రక్షాకవచమై ఉన్నదో, కామశాస్త్రగ్రంథాలలో దీని స్థానం ఎంత ఉన్నతమో వెల్లడి అవుతుంది.

అదీకాక ఇతర శాస్త్రాలవలెనే ఈశాస్త్రముకూడ ఋషులచే ప్రవచింపబడినదేకాని యెవరో సాధారణులు చెప్పినదికాదు. అందుచే ఈవిషయమును అగౌరవపరచుట అవివేకము. ప్రాణాపాయస్థితిలో ప్రాణ రక్షణకు, స్వభార్యాశీల రక్షణకు ఉపయోగించే పరస్త్రీగమన విధా నాలు ఈ ప్రకరణంలో తెలుపబడుతున్నాయి.

**పరవనితాభేదాలు:-** స్త్రీలు అయత్నసాధ్యలు, సాధ్యలు అసాధ్యలు అని మూడు రకాలుగా ఉన్నారు. ఏప్రయత్నము అక్కర లేకయే సులభంగా పరపురుషునకు వశమయ్యే స్త్రీలు అయత్నసాధ్యలు వీరినే సులభసాధ్యలు అని కూడ అంటారు. కొంత ప్రయత్నంతో పర పురుషునకు లొంగివచ్చే స్త్రీలు సాధ్యలు. వీరిని ప్రయత్నసాధ్యలు

అనికూడ అంటారు. ఎంత ప్రయత్నించినా లొంగని వనితలు అసాధ్యాలు అనబడతారు. ఈ అసాధ్యాల విషయంలో తనక్షేమం కోరుకునే వాడెవడూ యెట్టి ప్రయత్నము చేయకూడదు. ఇక తప్పనిసరి అయిన వేళ ఎవరైనా ప్రయత్నిస్తే 'చావుతప్పి కన్నులొట్టపోయి నదన్న' సామెతగా వారు చేజిక్కితే సరేకాని ఆపద్రహితంగా అరచేతిలోనికి వచ్చి వ్రాలిపోం అన్నది జరుగదు.

ఈ విధంగా పరవనితలు మూడురకాలుగా ఉన్నందున పురుషుడు తానుకోరే స్త్రీ వీరిలో ఏరకానికి చెందినదో తెలిసికొనడం అవసరం. అందుచే మూడురకాలుగా ఉన్న ఈవనితల లక్షణాలు చెప్పబడుతున్నాయి.

**సులభసాధ్యలైన స్త్రీలు :-** ఏప్రయత్నము చేయనక్కరలేకయే పరపురుషునకు లొంగేస్త్రీలు ఆ పరపురుషుని ఎదుట శంకలేకుండా వర్తిస్తారు. 'చూస్తే చూడనియ్యి' అన్నట్లు తమ స్తనాలను, చంకలను, ఉదరభాగాన్ని (కడుపు) పరపురుషుల ఎదుట మాటిమాటికి వెల్లడిస్తారు. పరపురుషుని వంకకు సాభిప్రాయంగాచూస్తూ తమపిల్లలను కౌగలించుకొని ముద్దుపెట్టుకొనడం కూడ వీరి లక్షణాలలో ఒకటి.

వీరు పరపురుషుని ఎదుట తమ రెండుచేతులను పైకెత్తి జడముడివిప్పి తిరుగముడివేసుకొనడానికి సిగ్గుపడరు, సరికదా ప్రత్యేకంగా అతనిఎదుటకువచ్చి బుట్టు ముడి సరిగావున్న ఒకసారివిప్పి తిరుగముడి వేసుకొంటారు. జుట్టుముడి విప్పాలన్నప్పుడు రెండుచేతులూ పైకిలేవాలి. అలాలేచినపుడు స్త్రీయొక్క స్తనాలు, చంకలు స్ఫుటంగా వెల్లడి అవుతాయి. పరపురుషులఎదుట కులస్త్రీలు ఎన్నడూ ఈవిధంగా తమ అవయవాలను వెల్లడించరు. సులభసాధ్యలైన స్త్రీలుమాత్రమే ఈవిధంగా ఆచరిస్తారు. వీరు పరపురుషుని యెదుట అతడు చూస్తూ ఉండగా తమ స్తనాదులవంకకు మాటిమాటికి చూచుకొంటారు. తమకంటిరెప్పలపై వ్రేలుంచి మాటిమాటికి తడుముకొనుటకూడ వీరి చేష్టలలో ఒకటి

తామకోరే పురుషునిగూర్చి వినడానికి వీరు ఎక్కువ ఆసక్తిని కన బరుస్తారు.

ఈవనితలు పరపురుషుని ఎదుట ఆవులించి,ఒడలువిరచుకొని, చేతి వ్రేళ్ళు మెటికలు విరుస్తారు. లేని శ్లేష్మం నోటిలోనికి తెచ్చుకొని గొంతుసవరించుకొని ఉమ్మి వేస్తారు. పనిలేనిదే చెవులలో వ్రేళ్ళు పెట్టుకొని త్రిప్పుకొంటూ పరపురుష సన్నిధియందు సంచరిస్తారు చిరు నవ్వులు చిందిస్తారు. తీయగా మాట్లాడుతారు. ప్రేమగాచూస్తారు. ఇవన్నీ సులభసాధ్యలైన స్త్రీల చేష్టలు.

ఇట్టి చేష్టలు పరపురుషుని ఎదుట ఆచరింపబడితే ఆపురుషుడా వనిత తనకు సులభసాధ్య అని గ్రహించాలి. కాని ఒక్కవిషయం. కొందరు ఏమీ తెలియక అమాయికంగానే మనస్సులో ఏగూఢార్థము లేకయే ఈపనులు ఆచరింపవచ్చును. అట్టిచోట పురుషుడు ఆలోచన లేక ప్రవర్తిస్తే ప్రమాదం తప్పదు, అందుచే చాలా నిదానించికాని పురుషుడొక నిర్ణయానికి రాకూడదు.

**2. ప్రయత్న సాధ్యలైన స్త్రీలు :-** ఈ పైన చెప్పిన లక్షణాలు లేకపోయినా భర్తవలన తగినంత సౌఖ్యంలేని స్త్రీలు కొంత ప్రయత్నంతో పరపురుషునకు వశమవుతారు. అనగా నిరంతరవ్యాధి పీడితుని భార్య, అసూయపరుని భార్య, దుష్టుని భార్య ప్రయత్నసాధ్యలై ఉంటారు. ఎల్లప్పుడు ఏదో ఒకవ్యాధితో బాధపడేవాని భార్యకు భర్త వలన సుఖమేముంటుంది ! ఇక అసూయాపరుడైనవాడు శారీరకంగా దృఢంగాఉన్నా అసూయాలక్షణంచేత భార్యామనస్సుకు నొప్పికలిగిస్తూ ఉంటాడు. దుష్టుడైనవాడు కలిగించినబాధ ఏమున్నది గనుక! అందుచే ఈ మూడు పరిస్థితులయందు తమభర్తయొద్ద పొందజాలని సుఖాన్ని పొందడానికై యువతులైన వనితలు తమంతతాము కాకపోయినా ఎవరయినా భయంలేదంటూ చేయిపట్టుకొని నడిపిస్తే కొంతజంకుతూ కొంతఏదో తెలియని ఆనందాన్ని అనుభవిస్తూ పెడదారి త్రొక్కడానికి అంగీకరిస్తారు. వీరు ముప్పురేకాక మాటిమాటికి తీర్థయాత్రలు, ప్రయా

కొలుచేసేవనితలు కూడ కొంతప్రయత్నంతో పరపురుషునకు వశమవుతారు.

**3. అసాధ్యలైన వనితలు:-** మిక్కిలి సిగ్గుపడే వనితలు, భయపడే వనితలు, ఏదో పెద్ద దుఃఖంలో చిక్కుకున్న వనితలు, దేనియందున ఆశలేని వనితలు పరపురుషునకు ఎన్నడు వశంకారు. బాగా సిగ్గుపడే వనిత పరపురుష ప్రసంగానికే సిగ్గుపడి వెనుకకు తగ్గుతుంది. భయపడే వనితలు లోకభీతిని వీడజాలనివారై వుంటారు. అందుచే అచ్చట పరపురుషుడు ఎన్నివలలు పరచినా ప్రయోజనంలేదు. ఏదో మహాదుఃఖంలో చిక్కువున్న వనిత ఆదుఃఖచ్ఛాయలు తొలగినమీదట అంగీకరిస్తుందేమోకాని, ఆదుఃఖం మనస్సుమీద పీఠ వేసుకొని కూర్చుండగా పరపురుష సాంగత్యానికి ప్రాణంపోయినా అంగీకరించదు. ఏదో ఆశ— సుఖించవచ్చుననియో, కానుకలు, ధనము లభించుననియో—ఏదో కోరిక వున్నపుడుకదా వనిత పరపురుషునకు వశమవుతుంది కాని ఏఆశ లేని స్త్రీ పరున కెందుక వశమవుతుంది. అందుచే లోభవర్జితలైన స్త్రీలు పరపురుషున కెన్నడును స్వాధీనలుకారు. ఈ అసాధ్యలైన స్త్రీల విషయంలో పరపురుషుని ప్రయత్నం సఫలంకాదు. సఫలమైనా నిరాపదంగా సఫలంకాదు.

సులభసాధ్యలైన స్త్రీల విషయంలో పురుషుడు తనంతతానే చొరవ దీసికొని వ్యవహరించవచ్చును. లేదా తనకు కొంత జంకు కలిగితే స్నేహితునో కార్యసాధనకు వినియోగించవచ్చును. ఇలా అల్పయత్నంలోనే వారు అతనికి స్వాధీనలవుతారు. కొంత ప్రయత్నం చేసిన మీదటగాని సాధ్యలుకాని స్త్రీల విషయంలో పురుషుడు తనంతతానుగా వ్యవహరించకూడదు. స్నేహితునికూడ వినియోగించకూడదు. అట్టి చోటులందాతడు దూతికను వినియోగించాలి.

**దూతికలు:-** ఇంటి చాకలి (స్త్రీ) ఇంటిలో నిత్యము పనిచేసే దాసి, పూవులమ్మునది, యోగాభ్యాసముచేయు ఆడుది, పొరుగింటి

స్నేహితురాలు, పశువుల యొద్ద బాగుచేయు వనిత. చేటిక (పనికత్తె)- వీరు దూతికలుగా వినియోగించుటకు తగినవారు.

పురుషుడు పరవనితకు ఒక సందేశం పంపదలచి ఒక పురుషునే ఈపనియందు వినియోగిస్తే - ఆమె స్త్రీ. ఈతడు పురుషుడు అయినందున ఈసందేశం అక్కడకు చేరడంలో అభ్యంతరాలు ఎక్కువగా యేర్పడతాయి. అంతేకాక ఈపనిని ఆచరించేవాడుకూడ పురుషుడే అయినందున ఆ ఆనందం తానే జుర్రుకొని కూర్చోవచ్చు. అందుచే పరస్త్రీని పొందగోరే పురుషుడెన్నడూ వేరొక పురుషుని (సులభ సాధ్యలైన స్త్రీల విషయంలో స్నేహితుని వినియోగించినట్లు) దూతకర్మలో వినియోగించకూడదు. అనగా స్త్రీలనే వినియోగించాలి. ఆస్త్రీలైనా ఆవనిత వుండేచోటుకు ఎక్కడో దూరంగా వుండేవాళ్లు, ఎప్పుడో కాని ఆమె ఇంటికి రావడానికి వీలులేనివారు అయితే వారివల్ల కూడ పని సాధింపబడదు. అట్టివారు ప్రత్యేకం ఈపనిమీద మాటి మాటికి రాకపోకలు సాగిస్తే - "ఈమె అంతదూరం నుండి పనిగట్టు కొని రోజూవస్తోంది. కారణం ఏమిటి?" అన్న శంక ఇతరులకు కలిగి కార్యభంగం అవుతుంది.

అందుచే మామూలుగా ఆఇంటిలోనికి వెళ్ళడం అలవాటున్న వారినే దూతికలుగా వినియోగించాలి. ఇంటిచాకలి వస్తే యెవరికీ అనుమానం కలుగదు, ఆచాకలి స్త్రీయైయున్నందున ఆడవారిఎదుట నిస్సంకోచంగా వ్యవహరిస్తుంది. ఆయింటిలోని ఆడవారుకూడ ఆచాకలిఎదుట ఏవిధమైన చెరుపదనము లేనివారై ఉంటారు. అందుచే చాకలికి యేదో అవకాశం చూచుకొని పరపురుషుని సందేశం చేరవేయుడానికి వీలు యెక్కువగా ఉంటుంది. ఇంటిలో నిత్యమూ పనిచేసేదాసి పశువుల దగ్గర బాగుచేసే వనిత, అప్పుడప్పుడు ప్రత్యేకపుపనుల ఒత్తిడి కలిగినపుడు వెళ్ళి పనిచేసే చేటిక - ఈముగ్గురకు కూడ పరపురుష సందేశం అందజేయడానికి అవకాశాలు ఎక్కువ. ఆవనిత ఉండే ఇంటికి

పొరుగున నివసించే స్నేహితురాలైన వనితకుకూడ ఇట్టి అవకాశం ఉం టుంది. ఇక పూవులు, అమ్మే వనితలు ఇంటింటికి వెడుతూ ఉం టారు. గనుక వారి రాకపోకలు ఎవరికీ అనుమానం కలిగించవు కొందరు స్త్రీలు—'యోగమని, యోగాభ్యాసమని, ఆత్మ, పరమాత్మ అని కబుర్లు చెపుతూ ఆయోగంలో కొంత ప్రవేశం కలవారై ఉం టారు. అట్టి స్త్రీలకు స్త్రీలలో కొంత గౌరవము ఆదరము ఎక్కువ గాఉండి వారు అందరి యిండ్లకు వెళ్ళడానికి అవకాశాలు ఉం టాయి. ఈవిధంగా యోగినులైన స్త్రీలుకూడ పరపురుష సందేశం భద్రంగా చేర్చి కార్యసఫలతను సాధించకలవారై ఉంటారు. అందు చేతనే దూతికలుగా వీరినే వినియోగించవలెనని చెప్పబడ్డది.

వీరినైనా యోగ్యత చూచికాని పురుషుడు వినియోగించ కూడదు. తగినంత యోగ్యత లేనివారి వలన పని చెడుతుంది.

**దూతికా యోగ్యతలు:—** దూతిక గడుసుదనం కలదై ఉం డాలి. ఇతరుల మనస్సులోని భావాలను వారి ముఖంమీదనే చదు వగల నేర్పు మిక్కిలిగా కలదై ఉండాలి, ఈయోగ్యతలు లేని నాడు దూతిక వెనుక చెప్పబడినదారిలో ఒకతె అయి ఉన్నా ప్రయోజనంలేదు. అందుచే పురుషుడు ఈలక్షణములు కలవారినే దూతికలుగా వినియోగించాలి. ఎందువల్లనంటే దూతీకృత్యము మిక్కిలి నున్నితమైనది.

**దూతీకృత్యము:—** దూతిక తగు సమయం చూచికాని తాను చెప్పదలచిన ఆపరపురుష సందేశం ఆ పరవనితకు చెప్పకూడదు. ఈ సందేశం చెప్పడానికి ముందు దూతిక ఆవనితతో కామగుణాన్ని వృద్ధిపరచే మాటలు మాట్లాడాలి. ఆమె మాటలు తీయగా—రసవం తంగా—విన్నంతనే ఏవో ఆనందలోకాలలోనికి తీసికొనిపోయేవిగా మన్మథభావోద్దీపకాలుగా ఉండాలి. ఇట్టిమాటలు చెప్పి చెప్పి, ఆపురు షుని గుణగణాలు వర్ణించి వర్ణించి, ఆతనితోడి పొందువలని సుఖాన్ని

వివరించి వివరించి– ఆదూతిక ఆయువతి మనస్సు స్వాధీనం తప్పునట్లు, ఆ పరపురుషునిపై లగ్నమగునట్లు చేయాలి. ఈ పనిచేస్తూ దూతిక అనుక్షణము ఆవనితయొక్క మనస్సులోని భావాలను ఆమె ముఖలక్షణాలద్వారా గ్రహిస్తూ తగినట్లు వ్యవహరించాలి అప్పుడా యువతి మానసంలో మన్మథుడు తిష్ఠవేసుకొని కూర్చుంటాడు, ఆ మె లో కామాగ్ని ప్రజ్వరిల్లుతుంది. అపుడామె బిగింపు విడచి తన అంగీకారము నామెకు తెలుపుటయేకాక తల్లివెంట బిడ్డ నడచినట్లు దూతిక వెంటనడచి వెడుతుంది,

ఈపనిని సాధించుటకు దూతికకు ఎంతకాలం పడుతుంది? అన్న విషయం ఆదూతిక నేర్పుమీద ఆపరవనితయొక్క బిగింపుమీద ఆధారపడిఉంటుంది. దూతిక నేర్పుకలదై ఉండి ఆ పరవనితలో బిగింపు తక్కువగావుంటే ఒకటి రెండురోజులలోనే కార్యం సఫలంకావచ్చును. అట్లుకాక ఆపరవనితలో బిగింపు ఎక్కువగాఉంటే దూతిక అప్పుడప్పుడు వెళ్ళి తనకార్యానికి అనుకూలములైన మాటలు చెబుతూ క్రమంగా కార్య సఫల్యాన్ని సాధించాలి.

ఈవిధంగా పరస్త్రీలకొరకై లోకంలో ప్రయత్నించడం జరుగుతూఉంటుంది. కనుక పురుషుడు తనభార్యను కాపాడుకొనడంలో శ్రద్ధకలవాడై యుండాలి,

**స్వభార్యాలక్షణోపాయములు :–** పురుషుడు భార్యతో పరుషంగా మాట్లాడకూడదు. ఆమెను ప్రేమగా ఆదరిస్తూ ఆమెతో ఏవిషయంచెప్పినా, మృదువుగా మధురంగా చెప్పాలి. ఊరిబయట తోటలలో విహరించడానికి తీర్థాలలో సంచరించడానికి, సామూహిక ఉత్సవాలలో పాల్గొనడానికి భార్యను పురుషుడు నిషేధించాలేకాని అనుమతించకూడదు. ఒకవేళ అనుమతించినా తాను ఏమరుపాటు వహించరాదు. అంతేకాదు, ఇరుగుపొరుగుల తగవులాటలోకూడ తన భార్య పాల్గొనకుండా పురుషుడు జాగ్రత్త తీసుకొనాలి. తీర్థయాత్రి

లయందు, మాటిమాటికి మిక్కిలి తరచుగా బంధువుల ఇండ్లకు వెళ్ళివచ్చుటయందుకూడ పురుషుడు భార్యారక్షణంలో కనుగలిగి, సాధ్యమైనంతవరకు అట్టి యాత్రలను రాకపోకలను నిషేధించాలి. ఇక తనభార్య పొలమునకు వెళ్ళి పనిచేసి వచ్చేదై ఉన్నపుడు పురుషుడు నిత్యము జాగ్రతకలవాడై ఉండాలి. అతడు దుశ్చరిత్రలైన వనితలతో తనభార్యను కలిసి తిరుగనీయరాదు.

ఏమంటే – ఆమె భార్య స్వయంగా మంచినడవడి కలదై ఉన్నప్పటికి తన యౌవనోద్రికం వలనకాని ఇతరుల ప్రయత్నాల వలన గాని శీలాన్ని కోల్పోవచ్చును. ఒక్కొక్కప్పుడు ఆమె శీలాన్ని ఆమెకు దగ్గరబంధువులైనవారే హరించవచ్చును. 'నీకుపుణ్యంఉంటుంది అంగీకరించు, అంగీకరించకపోతే నేను చచ్చిపోతాను, ఈపాపం నీకు వస్తుంది' – అంటూ పుణ్య పాపాలను అడ్డంపెట్టుకొనికూడ ఆమె శీలాన్ని ఎవరైనా పాడుచేయవచ్చును. ధనాశ కల్పించి శీలభ్రష్టను చేయవచ్చు. మాంత్రిక ఏవో కల్లబొల్లికబురులు చెప్పి, ఆమెకు ఏదో స్వర్గసౌఖ్యం అరచేతిలోచూపిస్తే గూడ ఆమె దారితప్పవచ్చును. అందుచే వారు దారితప్పడానికి ఉన్న అవకాశములన్నిటియందును పురుషుడు జాగరూకుడై ఉండాలి. అంతేకాని 'నాభార్యశీలవతి, పతివ్రత' అనుకొని కండ్లుమూసుకొని కూర్చుంటే ఆవలివాడు చాతుర్యంతో ఆమెశీలాన్ని హరించవచ్చును. తీరాచేసి జరుగకూడని ఆపని (శీలంచెడడం) జరిగినమీదట ఈభర్తఏమిచేసినా ప్రయోజనం శూన్యమే, అందుచే స్వభార్యా శీలరక్షణంలో ప్రతిపురుషుడు అప్రమత్తుడై ఉండాలి. సుందరులైన పురుషుల ఎదుట ఆమెచేష్టలు ఎలాఉన్నాయి. అన్నవిషయం వివేకంతో పరిశీలిస్తూ ఉండాలి.

ఇలా చెప్పబడ్డదికదా అని భార్యను ఎల్లపుడు అనుమానిస్తూ ఆమెకు కాలు కదపడానికికూడ అవకాశమీయక భర్తద్వారపాలకుడై కూర్చుంటే – ఆమె ఎవరిద్వారానో ప్రేరితయైకాక తనంత

తానే ఈ పెడదారిలో ప్రవేశిస్తుంది. అందుచే భార్యకు తగినంత స్వాతంత్ర్యం ఇచ్చి, ఆమె శీలరక్షణ విషయంలో జాగరూకుడై ఉండాలేకాని ఆమెను హింసించడం మొదటికే మోసం తెస్తుందని పురుషుడు గ్రహించాలి.

---

# పుత్రప్రాప్తి - ఉపాయము

దంపతులు ఈలోకంలో సుఖంగా ఆనందమయంగా తమ జీవనాలను గడపడానికి ఉపయోగించే సర్వవిషయాలు వెనుకటి ప్రకరణాలలో చెప్పబడ్డాయి. ఇక యీలోకంలోను పరలోకంలోను కూడ సుఖాన్ని అందిచ్చే పుత్రుడనే మహాఫలం దంపతులు ఏవిధంగా పొందగలరన్న విషయం ఈప్రకరణంలో చెప్పబడుతూ ఉన్నది.

సాధారణంగా ఆలుమగలు తమ కామపరితృప్తికై ప్రవర్తించే సమయములోనే భగవంతుని అనుగ్రహం వారియందు ఫలించి వారికి పుత్రుడో పుత్రికయో జన్మిస్తూ ఉంటారు. కాని కొందరికి పిల్లలు కలుగరు. అట్టివారు సంతానంకోసం పరితపిస్తూ చెట్టుకు, పుట్టకు మొక్కుతూ, వ్రతాలు నియమాలు ఆచరిస్తూ ఉంటారు. అట్టిదంపతులు తమకు పుత్రులు కలుగలేదని చింతింపనక్కరలేదు. వారు ఈదిగువ విషయాలను పాటించడంద్వారా సంతానాన్ని పొందగలుగుతారు.

## పుత్రాభిలాషకల దంపతులు చేయవలసిన పనులు :

సంతానంకావాలని పరితపించే వనిత ఋతుస్నానం చేసిన రోజున పగలు చాల పవిత్రంగా గడపాలి. ఆరోజున ఆమె బ్రాహ్మణులకు భోజనంపెట్టి యథాశక్తి దక్షిణలిచ్చి, తనకు మంచి సంతతి కలుగునట్లు ఆశీర్వదించవలసినదిగా వారిని కోరాలి. స్వయంగా ఇష్ట

దేవతను ఆరాధించాలి.* ఆమెయొక్క భర్త కూడ పరస్త్రీగమనము అసత్యము, మద్యము, మాంసము, పరిహాసము, క్రోధము, అభిమానము–అనే దోషాలను విడచి శివపూజా పరుడు కావాలి. తనకు సంతానమును అనుగ్రహింపుమని పార్వతితో కూడిన పరమశివుని ప్రార్థించాలి.

ఈవిధంగా పవిత్రముగా పగటిభాగము గడపి సూర్యాస్తమించి చీకటి పడినమీదట చక్కగా అలంకరింపబడిన శయ్యాగృహానికి చేరుకొని ఆదంపతులు ఇష్టదైవాన్ని స్మరించి బాహ్య-అభ్యంతర రతులయందు ప్రవృత్తులు కావాలి. ఈవిధంగా రతిలో ప్రవృత్తులు కావడానికి పూర్వం వారు తమయొక్క శ్వాస సూర్యనాడిలో నున్నదో చంద్రనాడిలో ఉన్నదో గమనించి చంద్రనాడిలో ఉంటే సూర్యనాడిలోనికి మార్చుకోవాలి అయితే సూర్యనాడి చంద్రనాడి అనగా ఏమో కొందరకు తెలియకపోవచ్చును. అందుచే ఆనాడుల విషయం ఇచ్చట తెలుపబడుతూ ఉన్నది.

**సూర్యచంద్రనాడులు:**- మానవుడు ముక్కుతో శ్వాసక్రియ జరుపుతాడుకదా! ఆముక్కుకు ఉన్న రంధ్రాలు రెండు. ఈ రెండింటి ద్వారా గాలి పీల్చి వదలుతున్నామని అందరూ అనుకొంటారు! కాని దీనిలో కొంత తేడా వున్నది. ముక్కుయొక్క రెండురంధ్రాల ద్వారా కాక యేదో ఒక రంధ్రంద్వారా మాత్రమే శ్వాసక్రియ జరుగుతూ వుంటుంది. కొంతసేపు కుడిరంధ్రముద్వారా శ్వాసక్రియ జరిగితే కొంతసేపు ఎడమరంధ్రము ద్వారా జరుగుతుంది. ఒక రంధ్రం నుండి వేరొక రంధ్రానికి శ్వాసమార్పు చెందే సమయంలో మాత్రం కొన్ని క్షణాలు రెండు రంధ్రాలలోను శ్వాసక్రియ సాగుతుంది. ఈమార్పులు మనకు తెలియకుండానే జరుగుతూ వుంటాయి.

వీనిలో కుడిరంధ్రమునుండి జరిగే శ్వాసక్రియ సూర్యనాడి అని ఎడమరంధ్రమునుండి జరిగే శ్వాసక్రియ చంద్రనాడి అని అన

---

* ఈ గ్రంథకర్త బౌద్ధుడైనందున సంతానాభిలాషకల బౌద్ధవనిత బౌద్ధభిక్షువులకు భోజనం పెట్టాలి అని, బౌద్ధులకు ఆరాధ్యదేవతయైన "తారాదేవిని" పూజించాలి" అని కూడ చెప్పినాడు.

బడతాయి. చంద్రనాడిని సూర్యనాడిగా మార్చదలచినపుడు ముక్కుయొక్క ఎడమరంధ్రమును చేతితో మూసి కుడిరంధ్రముద్వారా బలంగా శ్వాసపీల్చి విడిచిపెట్టాలి. ఇలా కొన్నిసార్లుచేయగా శ్వాస సహజంగానే కుడిరంధ్రంలో రాకపోకలు సాగిస్తుంది. సూర్యనాడి చంద్రనాడిగా మార్చవలెనన్నపుడుకూడ ఇదేవిధానం. అప్పుడు కుడి రంధ్రమును వ్రేలితో మూసి ఎడమరంధ్రముద్వారా బలంగా గాలిపీల్చి విడువాలి. సూర్యనాడియందు శరీరములోని నెత్తురు మొదలగు సప్త ధాతువులయొక్క స్థితి స్వచ్ఛంగా ఉంటుంది. చంద్రనాడియందది కొంత మారుతుంది. ఇది నాడులను గూర్చిన అల్పపరిచయము. ప్రకృతానికి వద్దాము.

శయ్యాగృహానికి చేరుకొన్న దంపతులు తమ శ్వాసక్రియను సరిచేసుకొని తమయందు సూర్యనాడి ఆడుతూఉండగా, అనగాముక్కుయొక్క కుడిరంధ్రములో నుండి ఉచ్ఛ్వాస నిశ్వాసలు జరుగుతూ ఉండగా బాహ్య-ఆభ్యంతర రతులయందు ప్రవృత్తులు కావాలి. ఆభ్యంతరరతి సమయములో భర్త తన పురుషాంగముచే భార్యయోని లోని పుత్రినాడిని (ఈ విషయము వెనుక చెప్పబడినది) ప్రేరేపించి నచో ఆమె గర్భాన్ని ధరించి వంశోద్ధారకుడైన కుమారుని ప్రసవి స్తుంది. ఆమె భర్త దుహితృనాడిని ప్రేరేపించినచో ఆమె గుణవతి యైన పుత్రికను ప్రసవిస్తుంది.

ఋతుస్నాన దివసంలో పైన చెప్పిన నియమాలను పాటించిన దంపతులకు అభీష్టసంతానం కలుగుతుంది. ఇందు సందేహంలేదు.

---

# ఉపసంహారము

ఈ గ్రంథంలో చెప్పబడ్డ విషయాలన్నీ శంకరవిరచితమైన ప్రథమ కామశాస్త్రాన్ని బాగా పరిశీలించి వ్రాయబడ్డాయి. అందుచేత గ్రంథంలో తెలుపబడిన విధివిధానాలు అన్నీ శాస్త్రీయాలే కాని అశాస్త్రీయాలుకావు. బ్రాహ్మణోత్తముడు సకల కళాకోవిదుడు అయిన వాసుదేవపండితుని కోర్కెపై బుద్ధిశాలిన్యైన పద్మశ్రీ చేత రతిశాస్త్రం రచింపబడ్డది. ఈ శాస్త్రమనే దీపము అలుముకల అజ్ఞానమనే చీకటిని తొలగించి ఆనందసామ్రాజ్యాన్ని వెల్లడి చేస్తూ లోకోపకారకమై వర్ధిల్లుగాక!

నాగరసర్వస్వము సంపూర్ణము.

# అనువాదకుని తుదిపలుకు

ఈ గ్రంథ కర్తయైన పద్మశ్రీ తన గ్రంథంలో సుగంధ ద్రవ్యాలను కొన్నిటిని తయారుచేసుకొనే విధానాలు చెప్పేరు. అక్కడక్కడ దంపతులు శరీరస్వాస్థ్యము చెడకుండా కాపాడుకొనేందుకు ఉపయోగించే ఓషధులను, దాంపత్య జీవనంలో దైవానుగ్రహం ద్వారా ఆనందం పొందడానికి వీలుగా మంత్రాలను ప్రస్తావించి ఉన్నారు.

కాని నేటి లోకం ఆ ఓషధులను సంపాదించి వానిని యుక్తవిధానంలో ఉపయోగించుటయందు అసమర్థమైనది. అదీకాక ఆ ఓషధులపేర్లు చెప్పినంత మాత్రలో వానిని గురుతించడం అందరకు సాధ్యం కాదు. గుర్తించగలిగినా అన్ని ఓషధులు అందరకు సులభసాధ్యాలు కావు. సుగంధద్రవ్యాలు బజారులో దొరకుతున్నాయి. గనుక వానిని తయారుచేయడానికై ప్రత్యేకం ఇంటిదగ్గర శ్రమపడడం పనిలేని పని. ఇక మంత్రాలున్నాయి. వానియందు నేటి లోకానికి విశ్వాసంతక్కువ 'మననాత్ త్రాయత ఇతి మంత్రః' జపింపగా రక్షించునది మంత్రము. ఉచిత విధానములో శ్రద్ధావంతుడై శుచియై జపించువానికి మంత్రము నిష్ప్రయోజకము కాదు. తేలుమంత్రము, పాముమంత్రము ఇప్పటికిని ఉపయోగిస్తూనే ఉన్నాయి. అయినా తగిన శ్రద్ధ, పవిత్రత, లేనిచోట మంత్రాలు బూడిదలోపోసిన పన్నీరు. నేటిలోకంలో మంత్రజపయోగ్యత కలవారు అరుదు. అందుచే ఈమూడు విషయాలు అనువాదక్రమంలో పరిహరింపబడ్డాయి. ఇట్లు పరిహరించుటద్వారా ఈఅనువాదం సర్వులకు నిరాపదమైన విజ్ఞానాన్ని అందీయగలదని భావింపబడ్డది, ఈ గ్రంథము దంపతీ సౌఖ్యవర్ధకమైనది. దంపతులు దీని నాదరింతురుగాక

ప్రాప్నుతాం ప్రవిమలసౌఖ్య మఖిల దంపతీ !

